T.T.D. Religious Publications Series No. 1004
Price :

## ఇటీవలి ప్రచురణలు

| | |
|---|---|
| శివచిదంబర చరిత్రె (ఆంగ్లం) | : శ్రీసాలగ్రామ సుబ్బరామయ్య |
| ఇండియన్ కల్చర్ (ఆంగ్ల వ్యాసాలు) | : సంపాదకులు-శ్రీసముద్రాల నాగయ్య |
| వీరశైవాంధ్రవాఙ్మయం | : శిష్టా రామకృష్ణ శాస్త్రి |
| తిరుపతియాత్ర | : డా॥ ఆకెళ్ళ విభీషణ శర్మ |
| తాళ్లపాక చిన్నన్న విరచిత అన్నమయ్య చరిత్ర-వ్యాఖ్యానం | : డా॥ గల్లా చలపతి |
| వేటూరివారి పీఠికలు-భాగం 1 | : శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి |
| వేటూరివారి పీఠికలు-భాగం 2 | : శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి |
| శ్రీ వేంకటేశ్వర స్తుతి రత్నమాల | : సంపాదకులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి |
| శ్రీ వేంకటేశ్వర స్తోత్ర రత్నాకరం | : సంపాదకులు డా॥ మేడసాని మోహన్ |
| శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవం | : డా॥ కె.వి. రాఘవాచార్య |

Published by **Sri L.V. Subrahmanyam,** I.A.S., Executive Officer,
T.T.Devasthanams, Tirupati and Printed at T.T.D. Press, Tirupati.

# ఆంధ్ర పదకర్తలు

ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య




తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

# ఆంధ్ర పదకర్తలు

రచయిత

ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్య




ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

**2013**

# ANDHRA PADAKARTALU

**By**

**Prof. Timmavajjhala Kodandaramaiah**

Edited by

**Prof. Ravva Sri Hari**

T.T.D. Religious Publications Series No:1004


*T.T.D First Edition:- 2013*

Copies:1000

*Published by :*
**L.V. SUBRAHMANYAM**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Editor- in- Chief Office,
T.T.D, Tirupati.

*Printed at :*
***Tirumala Tirupati Devasthanams Press,***
Tirupati.

## ముందుమాట

మధ్యయుగంలో భక్తి ఉద్యమ స్ఫూర్తితో వెలువడిన పదకవిత సమాజంలో భక్తి బీజాలను వెదజల్లి ప్రజలలో ఐక్యతను, సామరస్యాన్ని పెంపొందించడానికి ఎంతగానో తోడ్పడింది. నవవిధ భక్తిమార్గాలలో కీర్తన మార్గానికి బాటలు వేసిన పదసాహిత్యం మొదటి దశలో భక్తి శృంగార వైరాగ్య భావాలను ప్రచారం చేసింది. భక్తుల ఆత్మోన్నతికి, పరమార్థసాధనకు విశేషంగా ఉపకరించిన పదకవితా ప్రక్రియ తరువాత ఎందరు కవులనో ఆకర్షించింది. పద్యకవిత్వానికి దీటుగా పదకవిత రాణకెక్కింది. ఆ దశలో వచ్చిన కృష్ణమాచార్యుల సింహగిరి నరహరివచనాలు, తాళ్లపాక కవుల సంకీర్తనలు భక్తిసాహిత్యశాఖను పరిపుష్టం చేశాయి.

తాళ్లపాక కవుల స్ఫూర్తితో ఆంధ్రదేశంలో అనేకులు పదకవులైనారు. పదాలు, కృతులు, కీర్తనలు, తత్త్వాలు విశేషంగా రచింపబడి ప్రచారమైనాయి. పద్యకవితలోని పదాడంబరం, అన్వయక్లిష్టత, అర్థకాఠిన్యం లేకుండా ప్రసన్నంగా, సూటిగా, సరళంగా మనస్సులకు హత్తుకొని భక్తిభావంతో పాటు మానసిక వికాసాన్ని, చిత్తశాంతిని కలిగించడంవల్ల సామాన్యజనానికి కూడా పదకవిత చేరువైంది. రానురాను భక్తి శృంగార వైరాగ్య భావాలతోపాటు వివిధ సామాజికాంశాలను కూడా కలుపుకొని పదకవులు తమ సాహితీ క్షేత్రాన్ని విస్తృత పరచారు. ఆంధ్రదేశంలోనే పదకవులు అనేకులున్నారు. విజయనగర పతనానంతరం దక్షిణదేశంలో అధికారం నెరిపిన తంజావూరు, మధుర నాయకరాజుల ఆస్థానాలను అలంకరించి ప్రభువులనేగాక ప్రజలనుకూడ రంజింపజేయగల పదాలను రచించిన పదకర్తలెందరో ఉన్నారు. వీరిలో ఆంధ్రదేశంనుండి వలసపోయినవారు కొందరుకాగా అక్కడివారే కొందరు.

అలాంటి పదకర్తలను గురించి, వారు రచించిన పదాలను గురించి విస్తరంగా వివరిస్తున్న ఈ గ్రంథాన్ని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు

రచించారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శిష్యులైన వీరు పదసాహిత్యంలో గొప్ప కృషిచేశారు. కృష్ణమాచార్యులనుండి సభాపతయ్య వరకు వెలసిన పదునాలుగుమంది పదకర్తల వివరాలను, వారి పదాలను ఈ గ్రంథం ప్రదర్శిస్తున్నది. పదసాహిత్య పరిశోధకులకు ఇది ఒక ఆకర గ్రంథం అవుతుంది. సామాన్య పాఠకులైన ఆస్తికులకు ఈ గ్రంథంలోని పదాలు ఆత్మావలోకనాన్ని కలిగిస్తాయి. తి.తి.దే భక్తిరచనల ప్రణాళికలో ప్రచురించడానికి ఈ గ్రంథాన్ని అందించిన కోదండరామయ్యగారికి దేవస్థానం పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ముందెప్పుడో సమర్పింపబడిన ఈ గ్రంథంలోని భాషను ఇప్పటి వ్యవహారానికి అనుకూలంగాను, అప్పటికి దొరికిన ఆధారాలనుబట్టి రచయిత వెలిబుచ్చిన అభిప్రాయాలను నేటికి అనుగుణంగాను మార్చి ఈ గ్రంథ పరిష్కరణ పనిలో పాలుపంచుకొన్న ఆచార్య గల్లాచలపతిగారిని అభినందిస్తున్నాను. మునుపటిలాగే ఈ గ్రంథాన్ని కూడా పాఠకులు ఇతోధికంగా ఆదరిస్తారని నమ్ముతున్నాను.

సదా శ్రీవారి సేవలో....

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# సంపాదకుని మాట

పరమార్థసాధనకు భక్తి కర్మ జ్ఞాన మార్గాలను పెద్దలు సూచించారు. ఈ మూడు మార్గాలలో భక్తిమార్గానికి విశిష్ట స్థానముంది. నవవిధ భక్తి మార్గాలలో కీర్తనమార్గం ఇంకా విశిష్టమైనదని, కలియుగంలో భగవంతుని గుణనామాలను కీర్తించడం ద్వారానే మానవులకు ముక్తి లభిస్తుందని ఆస్తిక్యబుద్ధి గల అనుభవజ్ఞులమాట. భగవన్నామ గుణ కీర్తనలకు పదములని కూడా పేరు. ప్రాచీనకాలం నుండి పదరచనలను ఒక ప్రక్రియగా గుర్తించారు. సాహిత్యంలో పదాల ప్రస్తావన నన్నయకాలం నుండి ఉంది. జానపద బాణీలకు ఒదిగిన ఎన్నో పదాలు ప్రచారంలో ఉండినట్లు తెలుస్తున్నది. అయితే ఈ పదాలకు కర్తలెవరో తెలియదు. సాహిత్యంలో మార్గ దేశి శాఖలుగా ప్రచారమైన కవితోద్యమాలలో పదాలు దేశిశాఖకు చెందుతాయి. గ్రామీణ ప్రజలకు ఆనందాన్ని వినోదాన్ని కలిగించడానికి ఉద్దేశింపబడిన అలాంటి పదాలు ప్రారంభదశ నుండి వివిధ సామాజికాంశాలతోనే కనిపిస్తాయి. ఆంధ్రదేశంలో భక్తి ఉద్యమం పాదుకొన్నప్పటినుండి పదాలలో భక్తిభావాలు వెల్లివిరియడం, అవి ప్రజలలో సాంస్కృతిక ఐక్యతను కలిగించడం బాగా గుర్తింపబడిన అంశాలు.

కాకతీయరాజైన రెండవ ప్రతాపరుద్రుని కాలంనాటి కృష్ణమాచార్యులు రచించిన సింహగిరినరహరి వచనములు గ్రంథస్థమై దొరుకుతున్న మొదటి పదాలుగా కనపడుతున్నాయి. కృష్ణమాచార్యులు మొదటి పదకర్తగా గుర్తింపబడినాడు. పదసాహిత్యంలో అన్నమయ్య కాలం స్వర్ణయుగం. అన్నమయ్య రచించిన కీర్తనలు పదసాహిత్య ప్రక్రియను పరిపుష్టం చేశాయి. అన్నమయ్య, పెద, చిన తిరుమలయ్యలు పదాల సృజనకు కలిగించిన దోహదంతో పదరచన జవ జీవాలను పొదుగుకొని పద్యకవితకు దీటుగా ఒక

ప్రక్రియగా రూఢికెక్కింది. తాళ్లపాక కవుల అధ్యాత్మ సంకీర్తనలు భక్తి వైరాగ్యాలను, ధార్మిక నైతిక విషయాలను ప్రబోధించగా, శృంగార సంకీర్తనలు మధురభక్తియుతంగా సాగి తిరుమల వాసునికి కైంకర్య సుమాలైనాయి. అన్నమయ్య శృంగార సంకీర్తనలు క్షేత్రయ్యను, అధ్యాత్మ సంకీర్తనలు త్యాగయ్యను అమితంగా ప్రభావితం చేశాయని పదసాహిత్య పరిశోధకుల తీర్పు.

తాళ్లపాక కవుల కాలం నుండే పదకవితా పరిమళాలు దక్షిణ దేశంలో కూడా వ్యాపించాయి. రాజాశ్రయం కోసం కొందరు, జీవిక కోసం కొందరు తెలుగు కవులు దక్షిణదేశంలో వెలసిన తంజావూరు, మధుర, పుదుక్కోట, చెంజి మొదలైన సంస్థానాలకు వెళ్లి ఆ యారాజుల ఆస్థానాలను అలంకరించి పదకవితలను సృజించారు. ఆ పదాలు రాజులనేగాక ప్రజలను కూడా ఆనంద పరిచాయి. తాళ్లపాక కవుల శృంగార సంకీర్తనలకు నమూనాలుగా ఆ ప్రాంతాలలో వెలువడిన పదాలలో తాళ్లపాకవారి మధుర భక్తికి మారు సామాజిక శృంగారం చోటుచేసుకోవడంతో ప్రజలకు అవి ఆకర్షకాలైనాయి. అలా పదాలలో శృంగారాన్ని ప్రవహింపజేసిన వారు కొందరు కాగా మరికొందరు పదకవులు ఆ యా ప్రాంతాలలోని దేవతలకు అంకితంగా భక్తిభావ రచనలు కూడా చేశారు. అయితే భక్తి రచనలలో కూడా శృంగారభావాలు కనపడడం అప్పటి పదసాహిత్య లక్షణం. తంజావూరు సంస్థానంలో రఘునాథనాయక, విజయరాఘవనాయకుల కాలంలోను, మధుర సంస్థానంలో విజయరంగచొక్కనాథుని కాలంలోను పదకవులెందరో కనిపిస్తున్నారు. వీళ్లందరూ తెలుగు భాషా సంస్కృతులను పరిరక్షిస్తూ పదాలు అల్లినవారే. పెద్దిదాసరి, సభాపతయ్య, కస్తూరిరంగకవి, వంగలసీనయ్య, సెట్టివణ్యం సుబ్రహ్మణ్యం మొదలైన కవులందరూ గొప్ప పదకర్తలుగా పేరుపొందారు. ఆంధ్రదేశంలో పదకవులుగా పేరుపొందిన వారికంటే వీరు తక్కువవారు కారు. వీరి పదాలూ తక్కువవి కావు.

సంస్థానాలు చితికిపోయిన తరువాత రెండవ శరభోజి వ్యయ ప్రయాసలకోర్చి అలాంటి పదకవుల రచనలనన్నింటిని దొరికినంతవరకు సేకరింపజేసి, తంజావూరులో సరస్వతిమహల్ గ్రంథాలయం స్థాపించి అందులో పదిలం చేయించాడు. ఇప్పుడు ప్రాచీన సాహిత్య పరిశోధకులకు, ముఖ్యంగా పదసాహిత్య పరిశోధకులకు సరస్వతిమహల్ గ్రంథాలయం ఒక ఆకర కేంద్రం. సుమారు 20వ శతాబ్ది ప్రారంభం నుండి పదసాహిత్యం మీద పరిశోధనలు జరుగుతున్నాయి. పదకవుల రచనలనన్నింటిని సేకరించి సంపుటాలుగా ముద్రించే ప్రయత్నాలు జరిగాయి. అయితే ఈ పని ఆశించినంత స్థాయికి రాలేదు. అలాంటి పరిశోధనలో భాగంగా పదసాహిత్య పరిశోధనకు ఇంకా ముందుకు తీసుకొని వెళ్లే దిశగా తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు రచించిన 'ఆంధ్రపదకర్తలు' అనే గ్రంథం చెప్పుకోదగి ఉంది.

పదసాహిత్యంలో కోదండరామయ్యగారు చేసిన పరిశ్రమకు, ఆ విషయంలో వారికి గల శ్రద్ధకు 'ఆంధ్రపదకర్తలు' గొప్ప తార్కాణం. ఈ గ్రంథంలో ఆంధ్రదేశంలో పదకవులుగా పేరుపొందిన వారిలో కొందరిని, దక్షిణదేశంలో పదకర్తలైనవారిలో కొందరిని మొత్తం పదునలుగురు పదకర్తలను ఎన్నుకొని వారిని గురించి, వారి పదాలను గురించి వివరించారు కోదండరామయ్యగారు. సుమారు ముప్పై సంవత్సరాలకు ముందు రచించిన గ్రంథమిది. అప్పటికి ఇది మౌలిక రచన. పదసాహిత్య పరిశోధనకు సంబంధించిన పూర్వరంగాన్ని వివరిస్తూ ఉండడం వల్ల ఈ గ్రంథాన్ని విలువైనదిగా భావించి తితిదే ప్రచురణగా తీసుకోవడం జరిగింది. గ్రంథంలోని కొన్ని ప్రాథమిక విషయాలను ఇప్పటికి అనుగుణంగా మార్చే ప్రయత్నం చేయబడింది.

ఈ గ్రంథంలోని భాష గ్రాంథికం. అరసున్నలు, ద్రుతసంధులు పాటించబడినాయి. అందువల్ల భాషను సాధ్యమైనంతవరకు ఇప్పటి వాడుక భాషకు అనుకూలంగా మార్పుచేయడం జరిగింది. ఇలా మార్చడంలో మూలకర్త భాషామర్యాదను చెడనీకుండా జాగ్రత్త పడ్డాం. ఈ గ్రంథం రాసేనాటికి గ్రంథకర్తకు పదసాహిత్యానికి సంబంధించి ఇప్పుడు తెలిసినన్ని విషయాలు అందుబాటులో లేవు. అందువల్ల అక్కడక్కడా కొన్ని విషయాలను

అవగాహనదృష్టితో అదనంగా ఇవ్వవలసిన అవసరం వచ్చింది. అలాంటి విషయాలను అధస్సూచికలుగా చేర్చి ఆ విషయాలు సంపాదకుడివి అని సూచించడం జరిగింది. ఇలాంటి మార్పులకు చేర్పులకు లోబడి ఈ గ్రంథాన్ని పరిష్కరించి ముద్రణకు అనుకూలం చేయడం జరిగింది. గ్రంథంలో చూపబడిన ఆ యా పదకర్తల పదాలను కూడా ఇప్పటి పద్ధతిలో చూపించడం జరిగింది. పదసాహిత్యంలో విశేషంగా కృషిచేసి ప్రస్తుతం ఎడిటర్-ఇన్-చీఫ్ కార్యాలయంలో పనిచేస్తున్న ఆచార్య గల్లాచలపతిగారు ఈ గ్రంథ పరిష్కరణలో నాకెంతగానో సహకరించారు. ఈ పరిష్కృత గ్రంథం పాఠకులకు-ముఖ్యంగా పదసాహిత్యాభిమానులకు బాగా ఉపయోగపడుతుందని భావిస్తున్నాను.

రవ్వా శ్రీహరి
ఎడిటర్-ఇన్-చీఫ్

# విషయ సూచిక

## 1. ఆంధ్రపదకర్తలు [సంగ్రహచిత్రణము]

'రమణీయ సంగీతరత్నాకర ప్రబం
 ధాధ్యాయమున నుక్తమయ్యెఁ బదము
సముచిత సంగీత చంద్రికాదేశైళ
 యందు మిక్కిలి తేటమయ్యెఁ బదము
అతుల తత్సంవాద మైనట్టి సంగీత
 చూడామణికిఁ బల్కుచోటు పదము
ధన్య సంగీతసుధాకర గ్రంథంబు
 నందు మిక్కిలి చెలువొందుఁ బదము
తానె యిన్నిటికిని మూలమైన భరత
మందుఁ బంచదశాధ్యాయమందు విమల
వృత్త చూర్ణనిబంధక వివిధ నామ
భవ్యలక్షణములకు నాస్పదము పదము.'

**-సంకీర్తన లక్షణము**

సంగీతరత్నాకరము, సంగీతచంద్రిక, సంగీతచూడామణి, సంగీత సుధాకరము, భరతశాస్త్రము అనుప్రాచీన సంగీతశాస్త్ర గ్రంథములయందు పేర్కొనబడిన 'పదము', తెలుగున ఒక విశిష్టమయిన సాహిత్యస్వరూపము. ఆంధ్రసాహిత్యమున ఈ విశిష్టసాహిత్యస్వరూప మొక ప్రత్యేకశాఖగా కూడ ప్రవర్తిల్లినది. నిజమునకు మన జాతీయజీవనమును పదకవిత్వము ప్రతిబింబింప గలిగినంతగా తక్కిన యే వాఙ్మయశాఖ కూడ ప్రతిబింబింపలేక పోయిన దనుటలో విద్దూర మేమియును లేదు. అసలు పదకవిత్వశాఖ తక్కిన వాఙ్మయశాఖల వంటిది కాక కేవలం దేశిసరుకు. ఒకవిధముగా ఈ పదకవులందరును పదకవిత్వముపేర తమకాలములోని రుచిరములయిన సామాజిక జీవనఘట్టములనే రచించి రనుట సత్యదూరము కాదు. భాష, ఛందస్సు, వ్యాకరణము, కథావస్తువు, పాత్రౌచితి అను కట్టుబాటులకు లోబడి

రావలసియుండుటచేత ప్రజావ్యవహారములోని రుచిగల పలుకుబళ్ళు, నానుడులు, శ్రుతిసుభగములయిన కాకువులు, వేళాకోళములు, వెక్కిరింతలు మొదలయిన వానికి పద్యకవిత్వములో లేని అవకాశము పదకవిత్వములో వుండుటయే ఈ కవిత్వమును జాతికిసన్నిహితము చేసినది. తెలుగున వెలసిన పదసాహిత్యము మనకీ విషయమునే స్పష్టము చేయుచున్నది. దేశికవిత అని చెప్పదగిన యీ పదకవిత్వశాఖను తెలుగున ప్రవర్తిల్ల జేసిన పదకవులను గూర్చియు, వారి పదరచనములను గూర్చియు తెలిసికొనుట సమంజసము కాకపోదు.

అసలు తెలుగులో ఈ పదసాహిత్యము ఎప్పటిదో సరిగా చెప్పదగిన ఆధారములు మనకు లభించుట లేదు. తొలిసారిగా పద్యకవిత్వము వెలయుటకు పూర్వమే గేయాత్మక మయిన యీ పదకవిత్వము వెలసినట్టు తోచుచున్నది. తెలుగులోనే కాదు. ఏ భాషాసాహిత్యమున అయినను కవిత తొలుదొలుత గేయాత్మకముగా ఉండుటయే సహజము, సమంజసమును. ఆ గేయాత్మక కవితయే కాలక్రమమున కట్టుబాటులను కల్పించుకొని వివిధ సాహితీరూపములను దాల్చి కవితగా రూపొందును.

నన్నయకు పూర్వము వెలసిన సాహిత్యము యొక్క స్వరూపమెట్టిదో మనకు తెలియరాదు. నన్నయకు పూర్వము తెలుగున సాహిత్యమే లేదనియు, నన్నయయే తొలిసారిగా కవితను వెలయింపజేసినాడనియు విశ్వసించువారు నేడు పలువురుండరు. నన్నయ్యకు పూర్వకాలమున పద్యకవిత్వము తక్కువగానే ఉండినదేమో కాని పదకవిత్వము మాత్రము విశేషముగా ఉండి యుండునని పరిశోధకుల యభిప్రాయము. వారి అభిప్రాయము అసమంజసమయినది కాదు. క్రీస్తుశకము పంద్రెండవ శతాబ్ది వాడయిన పాలకురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రమునందు–

**"పదములు తుమ్మెదపదముల్ ప్రభాత**
**పదములు పర్వతపదము లానంద**



**పదములు శంకరపదముల్ నివాళి**
**పదములు నాకేశుపదములు గొబ్బి**
**పదములు వెన్నెలపదములు సెజ్జ**
**వర్ణన మతి గణవర్ణన పదము**
**లర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండ**
**బాడుచు నాడుచు బరమహర్షమున–"**

అని కొన్ని పదరచనా ప్రభేదములను పేర్కొనినాడు. వీనిలో తుమ్మెదపదములు తుమ్మెద సంబోధనముగల పదములు. ఇవి సాధారణముగా వేదాంతపదములుగా నుండును.

**'ఆఋ తేకుల పువ్వు తుమ్మెదా అది**

**మీతిన వాసనె తుమ్మెదా'** ఇత్యాదిగా తుమ్మెదను సంబోధించు పదములు తుమ్మెదపదములు. ప్రభాతపదములు, మేలుకొలుపు పాటలు, పర్వతపదములు, శ్రీశైలము నెక్కునప్పుడు శ్రమాపనోదనార్థము పరుగు జనము పాడునవి.

**'నల్లవో! నల్లవో! నగరాజరాజ!**
**మల్లయా! మల్లయా! మహనీయ తేజ!'**

ఇత్యాది రూపరచనములు పర్వతపదములు కాగాదును. ఆనందపదములు 'ఆనందమానందమాయెనే' యిత్యాది రూపరచన లగును. శంకరపదములు శంకరుని సంబోధించు తత్వరచనములు. నివాళిపదములు మంగళహారతులు. వాలేశుపదములు వాలేశ్వరుని స్తుతిపరములగు పదములు కావచ్చును. గొబ్బిపదములు గొబ్బిళ్లపాటలు. వెన్నెలపదములు వెన్నెలను, చందమామను సంబోధించు పదములు. సెజ్జవర్ణన పదములు పవళింపు పాటలు.

సామాజిక జీవన వర్ణనాత్మకములయిన పయి తీరు పదరచనము లనేకములు పాలకురికి సోమనాథుని కింకను పూర్వకాలముననే బహుళ ప్రచారములో ఉండి యుండును. లేకున్న ఆతడు దానినంతగా తన గ్రంథమున

పేర్కొనుట సంభవించి యుండదు. ఇట్లు సామాజిక జీవనవర్ణనాత్మకములుగా నున్న పదరచనలను, తరువాత కొందరు భక్తాగ్రేసరులు భక్తివ్యక్తీకరణకు సాధనములుగా ఉపయోగించుకొనినారు. భక్తిపదములయిన ఆ పదములు తరువాతి కాలమున సంకీర్తనములను పేరు దాల్చినవి. అట్టి భక్తాగ్రేసరులలో పేర్కొనదగినవాడు కృష్ణమాచార్యులు.

**1. కృష్ణమాచార్యులు–** ఇతడు మహాభక్తాగ్రేసరుడు. సింహాద్రి నృసింహస్వామి భక్తుడు. ఇతడు ద్వితీయప్రతాపరుద్రుని కాలమున ఓరుగల్లు ప్రాంతమున నివసించుచుండెను. ఇతడు సింహాద్రినృసింహస్వామిపై అనేక సంకీర్తనములను రచించెనట! చాతుర్లక్ష సంకీర్తనములు అతడు రచించినట్లు ఆతని గూర్చిన కొన్ని ప్రాచీన లేఖనములు పేర్కొనుచున్నవి. వానిలో పదిపండ్రెండు సంకీర్తనములు మాత్రమే నేడు మన కుపలబ్ధము లగుచున్నవి. అవి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముననుు, తంజావూరు పుస్తకభాండాగారముననుు కలవు. ఇతని సంకీర్తనములు 'కృష్ణమాచార్య సంకీర్తనము' లనియు,' సింహగిరి నరహరివచనము' లనియు వ్యవహరింపబడుచున్నవి. ఇతని సంకీర్తనములను ప్రాచీనులు పలువురు ప్రశంసించిరి. ఇతర సంకీర్తనములుకూడ పదములే అనుటకు ప్రమాణము సంకీర్తన లక్షణకారుడగు తాళ్లపాక చిన్నన్న. సంకీర్తన లక్షణమున కృష్ణమాచార్యులను గూర్చి ప్రశంస యిట్లు కలదు.

**'ధర గృష్ణాచార్యాదిక**
**పరికల్పితపదము తాళబంధ ఛ్ఛందో**
**విరహితమై చూర్ణాఖ్యం**
**బరగు ననిర్యుక్త నామభాసిత మగుచున్.'–**

ఇతని వచనములు 'తాళగంధి' వచనములు. ఇతని సంకీర్తనముల సంచయము తెలుగు వేదమట!

**'వేదంబు తెలుగు గావించి సంసార**
**ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్య'**



అని పరమయోగి విలాసమున తాళ్ళపాక చిన్నన్న యీతని కీర్తించినాడు. (వివరములకు. చూడుడు – కృష్ణమాచార్యులు అను నా వ్యాసము – నందన వైశాఖ భారతి) (మే–1952)

**2. తాళ్ళపాక అన్నమయ్య–** కృష్ణమాచార్యులకు తరువాత పదరచనములను భక్తివ్యక్తీకరణకు పరమసాధనములుగా జేసికొనిన వారు తాళ్ళపాకవారు. వీరు ప్రసిద్ధ సంకీర్తనాచార్యులు. శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధినుండి వీరు తదంకితములుగా వేలకొలది పదములను విరచించిరి. వీరు నందరీక స్మార్తబ్రాహ్మణులు. భారద్వాజ గోత్రులు.

కడపమండలమున రాజంపేట తాలూకా లోని 'తాళ్ళపాక'లో వీరి పూర్వులు నివసించుచుండిరి. తాళ్ళపాకవారిలో తొలివాడుగ తాళ్లపాక అన్నమయ్య బాల్యముననే 'తాళ్లపాక' వదలి తిరుపతిలో స్థిరనివాస మేర్పరచుకొనెను. తిరుపతి చేరిన పిమ్మట ఇతడు వైష్ణవమతమును స్వీకరించి ముద్రాధారణాదిక మొనరచ్చుకొనెను. అప్పటినుండి అన్నమయ్య అన్నమయ్యంగారు, అన్నమాచార్యులు అని పిలువబడెను. ఇతడు తన పదునారవయేట నుండి శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానమున శ్రీస్వామివారి సన్నిధిని దినమున కొక్క సంకీర్తనమునకేని తక్కువకాని చొప్పున సంకీర్తనములను రచించి కీర్తించుచుండెను. ఇతడట్లు సుమారు ఎనుబది సంవత్సరముల విచ్ఛిన్నముగ శ్రీవారి సమక్షమున సంకీర్తనము గావించుచు పదకవితాపితామహుడనియు, సంకీర్తనాచార్యుడనియు, ప్రఖ్యాతివడసెను. అన్నమయ్య క్రీ.శ. 1408 నుండి 1503 దాక జీవించియుండెను. ఇతడు సంస్కృతమున సంకీర్తన లక్షణమను గ్రంథమును, తెలుగున అధ్యాత సంకీర్తనములు, శృంగార సంకీర్తనములు, శృంగారమంజరి, శృంగార వృత్త పద్యాల శతకము* అను గ్రంథములను రచించెను. ఇతని పదముల నీతని మనుమడగు తాళ్లపాక చిన్నన్న యిట్లు ప్రశంసించుచున్నాడు.

* దీనిపేరు వేంకటేశ్వరశతకం. (సంపాదకుడు)

"పావనములు హరిభక్తివి
భావనములు సర్వమంత్ర పరమరహస్యో
ద్భావనములు గాయకనిక
రావనములు తాళ్లపాక యన్నయ పదముల్"

సారంబులు హరికరుణా
సారంబులు విబుధనికర సంపూర్ణ సుధా
హారంబులు బహుదేశ వి
హారంబులు తాళ్లపాక యన్నయ పదముల్.

వేదంబులు పౌరాణిక
వాదంబులు వరకవిత్వవాణీ వీణా
నాదంబులు కృత సుజనా
హ్లాదంబులు తాళ్లపాక యన్నయ పదముల్.

శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
యతిలోకాగమ వీథులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళుల పాక యన్నయ వచో నూత్న క్రియల్ చెన్నగున్.

**3. తాళ్ళపాక పెదతిరుమలయ్య–** ఇతడు తాళ్ళపాక అన్నమయ్య కుమారుడు. ఇతడు తన తండ్రియగు అన్నమయ్య ఆజ్ఞమేరకు క్రీ.శ. 1503 మొదలు శ్రీవేంకటేశ్వర స్వామివారి కంకితములుగ అనేక పదములను విరచించెను.

'చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁబెద తిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్.'



తెనాలి రామకృష్ణకవి చెప్పిన పై పద్యమున తాళ్లపాక పెదతిరుమలయ్య పదకవిత్వమున మేటి యని ప్రస్తుతుడయినా నిజమునకు గూడ ఈతని పదరచనములు తాళ్ళపాకవారి పదరచనమున మేలుతరముగా నుండును. ఇతని శృంగారపదములు ప్రత్యేకము ప్రశంసార్హములు.

ఇతడు వేంకటేశ్వరవచనములు అనబడు వైరాగ్యవచనమాలికా గీతములు, శృంగారదండకము, చక్రవాళమంజరి, నీతి సీసశతకము అను గ్రంథములను రచించెను.

**4. తాళ్ళపాక చిన తిరుమలయ్య(లేక) చిన్నన్న–** * ఇతడు పెదతిరుమలయ్య కుమారుడు. ఇతడును తన తండ్రి తాతలవలెనే శ్రీ వేంకటేశ్వరాంకితములుగా అధ్యాత్మసంకీర్తనములను, శృంగారసంకీర్తనములను రచించెను.** ఇవికాక ఈతడు అష్టభాషాదండకము, సంకీర్తనలక్షణము, అన్నమాచార్యచరిత్రము, అష్టమహిషీ కల్యాణము, పరమయోగివిలాసము మొదలగు గ్రంథములను రచించెను. ఇతని సంకీర్తన లక్షణమున అన్నమయ్య సంస్కృతమున రచించిన సంకీర్తన లక్షణము కనువాదము. ఇతడింకను ఉత్సవపద్ధతికి యోగ్యములగు మంగళములు, హెచ్చరికలు, ధూపదీపనైవేద్యావసర కీర్తనములు, వసంతోత్సవ, డోలోత్సవ సందర్భమున పాడదగు భక్తిమయమైన సంకీర్తనములు పెక్కు రచించినట్లు తెలియుచున్నది.

తాళ్ళపాకవారిదాక భక్తిమయములుగా ఉండిన గేయాత్మక రచనములు తాళ్ళపాక అన్నమయ్య కాలములో శృంగారసంకీర్తనములను

* తాళ్లపాక చినతిరుమలయ్య, తాళ్లపాక చిన్నన్న ఒకరు కాదు. ఇద్దరు అన్నదమ్ములు మాత్రమే. తిమ్మావజ్ఝల కోదండరామయ్య వీరు ఇద్దరు ఒక్కరే అని పొరబడినారు. పెదతిరుమలాచార్యులకు ఐదుగురు కొడుకులు. పెద్దకొడుకు చినతిలాచార్యులు. నాల్గవ కొడుకు చిన్నన్న. చిన్నన్నకే చినతిరువేంగళనాథుడని కూడాపేరు. (సంపాదకుడు)

** అన్నమాచార్యచరిత్ర, అష్టమహిషీకల్యాణం, పరమయోగివిలాసాలను రచించినవాడు చిన్నన్న. ఇతడు సంకీర్తనలు రచించలేదు. సంకీర్తనలక్షణము, అష్టభాషా దండకము చినతిరుమలయ్యవి. (సంపాదకుడు)

స్వరూపాంతరమును పరిగ్రహించినవి. భగవంతుడు వేంకటేశ్వరస్వామి నాయకుడు. భక్తుడు నాయిక. వేంకటేశ్వరుడు తానొక్కడు పురుషుడు. మానవకోటి స్త్రీ. ఈ స్త్రీ పురుషుల అనంత శృంగారలీలయే విశ్వము. ఇట్టి అలౌకిక మధురభావము అన్నమయ్య శృంగార సంకీర్తనములకు మూల బీజమయినది. ఏతద్భావస్ఫూర్తితో అన్నమయ్య శ్రీవేంకటేశ్వర లీలలను అనంతముగా తన శృంగారసంకీర్తనములలో కీర్తించినాడు. అతడు రచించిన అధ్యాత్మ సంకీర్తనముల సంఖ్యకన్న శృంగారసంకీర్తనములసంఖ్య అధికముగా ఉన్నది. ఇందుచే ఈ అలౌకిక శృంగారభావము అన్నమయ్యలో ఎంత రూఢముగా పాదుకొని పోయినదో ఊహించుట కష్టము కాదు.

అన్నమయ్య శృంగారసంకీర్తనములు 'వేంకటశైలవల్లభు రతిక్రీడా రహస్యముల' వెల్లడించునవి. అవి పదసంజ్ఞ దాల్చినవి. అధ్యాత్మ సంబంధములగు సంకీర్తనములును పదరచనములే అయినప్పటికిని శృంగారసంకీర్తనముల ఆవిర్భూతితో అవి పదసంజ్ఞను గోలుపోయి కేవల సంకీర్తనసంజ్ఞను మాత్రము దాల్చినవి. నాటినుండి పదసంజ్ఞ శృంగారసంకీర్తనముల యందు రూఢమైపోయినది. భగవద్గుణ సంకీర్తనాత్మకములయిన పదరచనములకు సంకీర్తనములనియు, శృంగార సంకీర్తనములకు పదములనియు వ్యవహారము నాటినుండి యేర్పడినది.

**5. గార్లపాటి లక్ష్మయ్య-** ఏగంటి నంజయ గుర్వంకితములుగా ఉన్న పదములు సుమారు నూటికి పైబడి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున కలవు. అందు కొన్నిమాత్రమే ముద్రితములయినవి. అవియు సరిగా, సమగ్రముగా ముద్రితము కాలేదు.

గార్లపాటి లక్ష్మయ్య యను శివకవి ఆ పదములకు కర్త. పై పదముల వ్రాతప్రతులయందు 'లక్ష్మయ్యగారి వచనాలు' అని కలదు. ఇతని యింటి పేరు గార్లపాటివారని పోలిసెట్టి లింగనకవి రచించిన నవచోడ చరిత్రమును



బట్టి, ఈతని గ్రంథముగానే తెలియవచ్చుచున్న 'శివజీవైకవిధానము' అను గ్రంథమును బట్టి తెలియవచ్చుచున్నది.

ఇతని కాలము తెలిసికొనుటకు తగిన గ్రంథస్థాధారము లభించుట లేదు. ఇతని పదములలో పిడుపర్తి గురువర్యుని ప్రశంస ఉండుటబట్టి ఆ పిడుపర్తి గురువర్యుడు ప్రసిద్ధుడైన పిడుపర్తి బసవయ్యయే అయియుండునని, అందుచే ఇతని కాలము క్రీ.శ. 1530 ప్రాంతము కావచ్చునని శ్రీనిడదవోలు వెంకటరావుగారు వ్రాసిరి.(చూడుడు- భారతి రజతోత్సవ సంచిక. కాని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున 'పిడుపర్తివారి రచనములు అనుపేరున కొన్ని పదములు కలవు. అవి పిడుపర్తి మల్లికార్జున గుర్వంకితములు. ఏగంటివారి పదములలో గానవచ్చు పిడుపర్తి గురు ప్రశంసా పదములు పిడుపర్తివారి వచనములలో జేరదగినవనియు, నవి లేఖకుల అజ్ఞానముచే ఏగంటివారి పదములలో లభింపబడి ఉండుననియు నేనూహించున్నాడను.' ఏగంటివారి పదముల రచయిత పోలిసెట్టి లింగనకవి పూర్వుడో, సమకాలికుడో అని మాత్రము స్పష్టముగా జెప్పదగును. లింగనకవి కాలమేదో మనకు నిశ్చయముగా తెలియదు. అందుచే ఈ కవి కాలమును ఇదమిత్థమని నిర్ధరించుటకు వీలులేదు. ఇతని పదములు వేదాంతపదములు. ఏగంటివారి పదాలనియు, ఏగంటివారి వచనాలనియు వీనికి వ్యవహారము కలదు. (వివరములకు చూడుడు-గార్లపాటి లక్ష్మయ్యగారి పదాలు అను నా వ్యాసము. విరోధి ఉగాది సంచిక 1949)

**6. క్షేత్రయ్య-** పదకవితా చక్రవర్తియని పేర్కొనదగిన యీతడు కృష్ణామండలములోని 'మొవ్వ' గ్రామవాస్తవ్యుడు. 'మొవ్వ' లోని గోపాలస్వామి పేర ఈత డనేక పదములను విరచించినాడు. తంజావూరులో రఘునాథనాయకుని కాలమున పదకవితకు గలుగుచున్న ఆదరమును గూర్చి విని ఈతడు మొవ్వనుండి బయలుదేరి మార్గమధ్యమున పుణ్యక్షేత్రములను దర్శించుచు, ఆ యా క్షేత్ర దైవతముల మీద పదములు రచించి పాడుచు

తంజావూరును జేరుకొనెను. క్షేత్రయ రఘునాథనాయకుని దర్శించి ఈ పద్యము జెప్పినాడు.

**కII తముcదామె వత్తు రర్థులు**
**క్రమమెఱిcగిన దాతకడకు రమ్మన్నారా**
**కమలంబు లున్నచోటికి**
**భ్రమరంబుల నచ్యుతేంద్ర రఘునాథనృపా!**

రఘునాథనాయకుడు క్రీ.శ. 1633లో పరమపదించిన వెనుక అతని కుమారుడు విజయరాఘవ నాయకుడు ప్రభుత్వమునకు రాగా ఈత డాతని దర్శించి అతనిపై చలువచప్పరములో ఉండి వేయిపదముల రచించి అతనిచే బహుమతి పడసెను. కాని విజయరాఘవుని మీది పదములలో పదిపదములు మాత్రమే నేడు ఉపలబ్ధము లగుచున్నవి. తక్కినవి లభ్యమగుట లేదు. కాలగర్భమున కలసియుండ బోలును. (చూడుడు- విజయరాఘవ పదములు అను నా వ్యాసము- వికృతి భాద్రపదమాస భారతి (1950 సెప్టెంబర్-అక్టోబర్).

'వేడుకతో నడచుకొన్న విటరాయడు' అను మేరు పదములో ఈతడు మధుర తిరుమలేంద్రునిపై రెండువేలపదములను, విజయరాఘవునిపై వేయి పదములను గోలకొండ పాదుషావారిపై వెయ్యినేనూరు పదములను మొత్తము నాలుగువేల అయిదువందల పదములను విరచించినట్లు తెలుపుకొనియున్నాడు. క్షేత్రయపదములు నేటిదాక ఉపలబ్ధము లగుచున్న వాని నెల్ల సేకరించి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారును, శ్రీవిస్సా అప్పారావు పంతులుగారును, శ్రీపిఠాపురము రాజావారును ఇటీవల ప్రకటించిరి. అన్నమయ్యకు తరువాత, పదకవిత్వ పాకమును పలుచపరిచి జుఁర పదను గావించిన మహనీయుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య పదసాహిత్యము మనకు విలువ కట్టలేని సాహితీ భాండారము! మన జాతీయ జీవన సర్వస్వమది!



**7. విజయరాఘవ నాయకుడు-** ఇతడు తంజావూరు నేలిన రఘునాథనాయకుని కుమారుడు. రఘునాథనాయకుని అనంతర మీతడు క్రీ.శ. 1633 నుండి 1673 వరకును తంజావూరును పరిపాలించెను. తండ్రియగు రఘునాథనాయకుని వలెనే యీతడును కృతికర్తయు, కృతిభర్తయునై పేర్గాంచెను. ఇతడు తెలుగున నాటకములు, ద్విపదలు, చౌపదలు మున్నగునవి పెక్కు రచించినాడు. ఈతని కృతులలో రఘునాథనాయకాభ్యుదయము- ద్విపద, రఘునాథనాయకాభ్యుదయము- నాటకము, కాళీయమర్దనము-నాటకము, ప్రహ్లాద చరిత్ర, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్రము అనునవి మాత్రము నేడు తంజావూరు పుస్తకభాండాగారమున ఉపలబ్ధములగుచున్నవి. ఇతడు ఇవిగాక యింకను వేడుకోలు విన్నపములు, దరువులు, ఏలపాటలు, సంకీర్తనలు, కొరవంజి మొదలగు యక్ష గానములు రచించిన ట్లతని ప్రహ్లాద నాటక పీఠిక వలన తెలియవచ్చుచున్నది. పదరచనములకు తన యాస్థానమున ప్రోత్సాహ మొసగుట మాత్రమే కాక ఈతడు స్వయము పదకవియై తెలుగున పెక్కు పదములను విరచించినాడు.

**8. పసుపులేటి రంగాజమ్మ-** విజయరాఘవనాయకుని ఆస్థాన కవయిత్రియగు ఈమె మన్నారుదాసవిలాసము (ప్రబంధము), మన్నారుదాసవిలాసము (నాటకము) ఉషాపరిణయము, రామాయణసంగ్రహము, భారతసంగ్రహము, భాగవతసంగ్రహము అను గ్రంథములను మాత్రమేకాక లలితఫణితిని మృదురసాస్పదములగు పెక్కు శృంగార పదములను విరచించినట్లు తెలియ వచ్చుచున్నది. ఈమెచే రచింపబడిన ఉషాపరిణయ అవతారిక యందిట్లు కలదు.

**సీII వేంకటేంద్రుని పుత్రి! వినుత సద్గుణగాత్రి!**
**ఘన యశోరాజి! రంగాజి! వినుము**
**మాధుర్యమున మించు మన్నారుదాస వి**
**లాస ప్రబంధంబు లలితఫణితి**

**గావించి, మిగుల శృంగారంబు గన్పట్ట**
**బదములు మృదురసాస్పదములగుచు**
**రాణింప రచియించి, రామాయణంబును**
**భాగవతంబును, భారతంబు**
**గీ॥ సంగ్రహంబుగ రచియించి సరసరీతి**
**మమ్ము మెప్పించితివి చాల నెమ్మి దనర**
**బరగ హరివంశమున నుషాపరిణయ కథ**
**దెనుగు గావింపు మిక నీవు తేటగాగ.**

మరియు ఈమె తన గ్రంథముల కడపటి గద్యలో తన్నుగూర్చి 'శృంగార రస తరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తి' నని చెప్పుకొనినది. కాని ఈమె రచించిన పదములు నేడు మనకు లభ్యములగుట లేదు.

**9. పెద్ద దాసరి–** ఇతడు విజయరాఘవుని కాలము వాడు. నృసింహస్వామి భక్తుడు. సంస్కృతమునను, తెలుగునను ఇతడు పదములను విరచించెను. తెలుగున ఈతడు రచించిన పదములు పెద్దదాసరి పదములని ప్రసిద్ధివహించియున్నవి.

**10. లింగనమఖి శ్రీకామేశ్వరకవి–** ఇతడు తిరుమలనాయకుని కాలమునుండి మధురనాయకరాజుల ఆస్థానమునందుండినవాడు. రుక్మిణీపరిణయము సత్యభామాసాంత్వనము అనునవి ఈతని కృతులు. ఇందు రుక్మీణీపరిణయము లభ్యమగుట లేదు. సత్యభామాసాంత్వనము మాత్రము శృంగార గ్రంథమాల వారిచేతను, శృంగారకావ్యగ్రంథమండలి వారిచేతను రెండు తూరులు ప్రకటింపబడినది. ఇతనికే తిరుకాముడని కూడా పేరు. ఇతని సాహిత్యము నందేకాక సంగీతము నందును చక్కని పాండిత్యము గలిగి యుండెను. సత్యభామాసాంత్వనమున గద్యలో 'ధీరజన హృదయరంజక వచోవిహార వల్లకీవాదనధురీణ వర్ణగీతాది గాంధర్వస్వరకల్పనా ప్రవీణ' అని ఇతడు తన్నుగూర్చి చెప్పుకొనివున్నాడు. ఇతని సంగీతవిద్యా నైపుణ్యమే ముద్దళగిరి



ప్రభువు నాకర్షించియుండును. ముద్దళగిరి ప్రభువు చక్కని సంగీత పరిజ్ఞానము గలవాడు. కామేశ్వరకవి రచించిన వర్ణగీతాది రచనము లెట్టివో తెలియరావు!

**11. జయగోపాలుడు–** పదునేడవ శతాబ్దికి చెందిన ఇతడు సంస్కృతమునను, తెలుగునను 'విజయగోపాల' ముద్రతో భక్తి కీర్తనలను, పదములను విరచించెను. ఇంతకుమించి ఈతని గూర్చిన వివరము లేవియు తెలియరావు.

**12. శాహజీ–** ఇతడు తంజావూరిని పరిపాలించిన రెండవ మహారాష్ట్రరాజు. తంజావూరు నాయకరాజుల వలెనే యీతడును తెలుగు కవులను, పండితులను పోషించుట మాత్రమేకాక స్వయముగ తెలుగున చక్కని కవిత చెప్పగలిగియుండెను. ఇతడు క్రీ.శ.1684 నుండి1710 దాక జీవించి యుండెను. ఇతనిచే విరచింపబడిన గ్రంథము లిరువదియైదు దాక తంజావూరు పుస్తకభాండాగారమున గలవు. ఇతడు పదరచనములయెడ ఆదరము గలవాడై స్వయముగా కొన్ని పదములను విరచించెను. వానిలో పేర్కొనదగినవి. త్యాగేశపదములు, వేంకటేశపదములు. త్యాగేశపదములలో నొక్కపదము–(గ్రంథసంఖ్య 431,432,433).

**తోడిరాగము-ఆదితాళము**

**ఆరుదూరు జేసేది మేరా**
**వారిజాక్షిని వసంత త్యాగేశ** **॥పల్లవి॥**
**కలికి చూడలేదని కనులెట్టి జేసేవు**
**తిలకించు హేతువు తెలియలేవు**
**కలయ నీ చెక్కిటి నెలగొనల జూచితె**
**వెలది కనుదమ్ములు వెఱవక యున్నె.**

**వేంకటేశపదములు** (గ్రంథసంఖ్య 466) ముఖపత్రమున ఇట్లున్నది. **'శాహమహారాజు కవిత్వం,** పదాలు తెనుగు లిపి **నామయ్య** వ్రాసింది. ఆకులు 204'–

వేంకటేశ పదమొకటి.

**యమునాకల్యాణి- ఆది**

**తెలియ జెప్పవమ్మా నా**
**చెలువునికి మీరైనను ॥తెలియ॥**
**చెలిమితో వచ్చినన్ను**
**చెయి బట్టినసామీ మా**
**చెలువుడు వేంకటేశ్వరుడు**
**చలము చేసుక యున్నాడు ॥తెలియ॥**

**13. గిరిరాజకవి-** ఇతడు శాహజీ (1684-1711) కాలము వాడు. తంజావూరు మండలములోని తిరువారూరు ఇతని నివాసస్థలము. సంగీతమునందును, సంస్కృతాంధ్రముల యందును ఇతడు గొప్ప విద్వాంసుడు. తంజావూరు రాజాస్థానమునందలి సంగీత విద్వాంసులలో ఒకడై ఇతడు శాహజీరాజుచే గొప్ప సత్కారములను బడసెను. ఇతడనేక వేదాంత కీర్తనలను, యక్షగానములను రచించెను. ఇతడు రచించిన యక్షగానములు తంజావూరు సరస్వతీమహలు పుస్తకభాండాగారము నందున్నవి. శాహేంద్ర చరిత్రము, రాజమోహన కొరవంజి, రాజకన్యాపరిణయము, లీలావతీ కల్యాణము, సర్వాంగసుందరీవిలాసము- ఇత్యాదులతని కృతులు. సుప్రసిద్ధ వాగ్గేయకారుడగు త్యాగరాజున కితడు పితామహుడు. త్యాగరాజు తండ్రియగు రామబ్రహ్మ మీ గిరిరాజకవి కుమారు లయిదుగురిలో కడపటివాడు.

**14. కంఠీరవరాజు-** కంఠీరవరాజు మైసూరు పరిపాలకుడును, కవిపండిత ప్రియుడును, మహాయశస్కుడును అగు చిక్కదేవరాయల కుమారుడు. ఇతడు క్రీ.శ.1704 నుండి 1713 వరకును మైసూరును పరిపాలించెను. ఇతడు పుట్టుకచే మూగవాడును, చెవిటివాడును అయి ఉండెను. అందుచే ఇతనికి 'మూకరసు' అను నామాంతరము గలిగెను. కేవలము హస్తసంజ్ఞల తోడనే ఈతడు రాజ్యకార్యములను నిర్వహించెడివాడు. అయితే భగవంతుడేదేని



అంగవైకల్యమును కలిగించినప్పుడు ఆ వ్యక్తికేదో ఒక విలక్షణమైన శక్తిని ప్రసాదించును. కంఠీరవ రాజునకు కమనీయ మగు కవనశక్తియే గాక బహుభాషావేత్తృత్వమును పరమేశ్వరుడు ప్రసాదించినాడు. ఇతని యక్షగానరచనముల మూలమున ఇతడు సంగీత, సాహిత్య, నాట్యవిద్యల యందు నేర్పరి అగుటతో పాటు సంస్కృతమునను, ప్రాకృతమునను, మాతృభాషయగు కన్నడమునను, తెనుగునను, తమిళమునను కవితారచనము చేయగలవాడని విశదమగుచున్నది. కొరవంజి యిత్యాది పదునాలుగు యక్షగాన కృతులీతడు రచించినవి కలవు. ఈతని విద్యావిశేషము మైసూరుచరిత్రకారులెవ్వరును ఈ వరకు గుర్తించి యుండలేదు. (చూడుడు- కంఠీరవరాజు యక్షగాన కృతులు, పదములు అను శ్రీ నిడదవోలు వెంకటరావుగారి వ్యాసము- నందన ఆశ్వయుజమాస భారతి, 1952 సెప్టెంబర్).

**15. వంగల సీనయ్య-** ఇతడు మధుర నేలిన విజయరంగ చొక్కనాథనాయకుని (1706-1732) మంత్రులలో ఒకడు. శేషము వెంకటపతి రచించిన తారాశశాంక విజయమున కీతడు కృతిపతి. ఇతడు 'ఘననయ దేశీయ కమనీయ గ్రామ మూర్ఛనా బహువిధ విన్యాస ధన్యాసమాన తాళమాన నానానూన తాన వితాన భంగీ తరంగిత సంగీత విద్యావిశారదుండు',' వీణానినాద వినోద భూలోక నారదుడు',' సరస పదపద్య గద్యరచనా భోజుడు'. ఇతడు మన్నారు రంగముద్రతో పెక్కుపదములు విరచించినాడు. అవి మన్నారురంగని పదములు. 'శివదీక్షాపరురాలనురా' అనుప్రసిద్ధ మయిన పదమీతనిదే. ఈతడు మన్నారురంగని పదములను రచించినట్లు శేషము వెంకటపతి రచించిన ఈ క్రింది పద్యముల వలన తెలియవచ్చుచున్నది.

**"క॥ శ్రీమన్నారు రంగాధిప**
**నామాంకిత గేయ కల్పనాస్తుత మతికిన్**
**రామానుజ విజయాంక గ**
**వీమధుర స మోదమాన వేంకటపతికిన్.**

**క॥ శ్రీమన్నారు రంగాధిప**
**రామానుజ గుణగణాంక రచనాముదితా**
**హేమాచల మలయాచల**
**సీమాచర సుకవిచంద్ర! సేనసుధీంద్రా!**

ఇతడు రామానుజ చరిత్రమను ప్రబంధమును గూడ రచించినాడు. ఇది శ్రీవేంటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధనాలయ పుస్తకభాండాగారమునందు గలదు. నేటిదాక ఉపలబ్ధము లగుచున్న ఈతని మన్నారురంగని పదము లిటీవల ప్రకటింపబడినవి. (చూడుడు– మరొక పదకవి– వంగల సీనయ్య అను వ్యాసము– ఖర మాఘమాస భారతి1951 జనవరి).

**16. కస్తూరి రంగకవి–** లక్షణకవి కస్తూరి రంగకవి 'లక్షణచూడామణి' అనబరగు ఆనందరంగచ్ఛందమును, సాంబనిఘంటువును, కృష్ణార్జున సంవాదమును రచించుట మాత్రమే కాక కొంత పదరచనమును కూడ చేసినాడు. పదునెనిమిదవ శతాబ్దారంభమున పుదుచ్చేరిలో ఫ్రెంచి రాజప్రతినిధిగా డూప్లే దొరగారి విజయములను గూర్చియు, పై డూప్లే దొరగారి ఆస్థానిలో 'దుబాసి' గా ఉండిన ఆనందరంగని విజయములను గూర్చియు ఇతడు గేయములను రచించినట్లు తెలియుచున్నది. డూప్లే దొరగారి ఆస్థానములో ప్రసిద్ధగాయకుల గేయములను పాడుచుండిరట! ఈ విషయము 'ఆనందరంగపిళ్లడైరీ' యందు పేర్కొనబడినట్లు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము డిస్క్రిప్టివు కేటలాగులో పేర్కొనబడినది. మరియు ఈతడు వెంకటగిరి సంస్థానాధీశ్వరుడగు వెలుగోటి బంగారు యాచమనాయని మీద కూడ గొన్ని శృంగారపదములను విరచించినట్లు తెలియవచ్చుచున్నది. వెలుగోటివారి వంశావళిలో ఇట్లు కలదు.

' వీరి మీద కస్తూరి రంగప్ప యనుకవి పంచరత్నంబు లనెడు శృంగారరసయుక్తంబులై గానయోగ్యంబులైన పదములను జెప్పియున్నాడు'–



ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారములో 'కస్తూరిరంగని పదములు' అను పేర గానవచ్చు శృంగారపదము లీతనివే. (చూడుడు– కస్తూరిరంగని పదములు అను వ్యాసము. 28–12–1949 ఆంధ్రవారపత్రిక.)

**17. కస్తూరి లింగప్ప–** ఇతడు కస్తూరిరంగకవి కుమారుడు. ఇతడు వెలుగోటి ప్రభువగు కుమార యాచమ నాయకునిపై కొన్ని శృంగారపదములను విరచించినట్లు తెలియుచున్నది. వెలుగోటివారి వంశావళిలో నిట్లు కలదు. 'కమార యాచమనాయకుని కాలమున కస్తూరిలింగప్ప యనుకవి నవరత్నములను గానయోగ్యములగు పదములను జెప్పినాడు–'

**18. ఏకోజీ–** ఇతడు తుళజేంద్రుని కుమారుడు. క్రీ.శ. 1735–36 సం॥లో తంజావూరి నీతడు పరిపాలించెను. ఇతడు 'సరస సాహిత్య లక్షణ చక్రవర్తి'. ఇతనిచే రచింపబడిన పదములు కొన్ని తంజావూరు పుస్తకభాండాగారమున గలవు. (గ్రంథసంఖ్య 440,441,442) ఏక రాజేంద్ర పదమొకటి మాత్రముదాహరింతును.

**ముఖారి-అటతాళము**

**భూలోక జనులకు ముఖ్య మీ నీతి**
**వేలారు శాస్త్రములు వెదకి చూచినగాని ॥ప॥**
**తల్లిదండ్రులభక్తి దైవతగురుభక్తి**
**యెల్లప్పుడు చేసితే యీశ్వరుడు ఫలమిచ్చు**
**సరస వినయముతోడ స్వామిసేవ జేసితే**
**పరంగ స్వామి సకల భాగ్యముల నిచ్చును**
**తుళజేంద్ర తనయైక రాజేంద్ర వినుతిని భో**
**సలకులదేవుని చంద్రమౌళీశుని తలచేది**

మరొక గ్రంథములో ఈ శ్లోకము కలదు.

**శ్రేయస్సంపద్ప్రదాతారం పార్వతీ శంకరప్రియా**
**సర్వవిఘ్నహరం దేవం యేకేంద్రనుత మాశ్రయే.**

**19. మాతృభూతనకవి–** ఇతడు త్రిశిరగిరి అనబడు తిరుచినాపల్లివాస్తవ్యుడు. తెలుగు బ్రాహ్మణకుటుంబమునకు చెందినవాడు. త్రిశిరగిరి యందలి సుగంధి కుంతలాంబా భక్తుడై ఈత డాదేవి అను గృహమున పెక్కు శృంగారపదములను విరచించినట్లు తెలియుచున్నది. పారిజాతాపహరణమను ఒక యక్షగాన కృతి యితనిపేర తంజావూరు సరస్వతీమహల్ పుస్తకభాండాగారములో కలదు. పారిజాతాపహరణమున గద్య ఇట్లు కలదు–

'ఇది శ్రీచోళ సింహాసనాధ్యక్ష భోసల ప్రతాపసింహరాజ పూర్వపుణ్య పరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తి మౌక్తికాయమాన నారసింహ మండలాధీశ్వర నామాంకితంబైన శ్రీమత్సుగంధి కుంతలేశ్వర కరుణా కటాక్ష వీక్షణ సుధాసార సంజనిత చతుర కవితా నిర్వాహక శాండిల్య గోత్ర పవిత్ర కవిరంగయార్య పుత్ర విద్వజ్జన విధేయ మాతృభూతకవి నామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకమందు'–

ఇతని పదరచనములు కొన్ని పుదుక్కోట సంస్థానము నందలి హరితీర్థమయ్య అను సంగీత విద్వాంసుని కడ ఉన్నట్లు తెలియుచున్నది. ఇతని భక్తి పారమ్యమును తెలుపు ఐతిహ్య మొకటి జనవ్యవహారమున వినబడుచున్నది. ఇతని భక్తికి మెచ్చి త్రిశిరగిరి యందలి సుగంధికుంతలాదేవి తంజాపుర ప్రభువగు ప్రతాపసింహేంద్రుని (1741–1764) ప్రబోధించినట్లును, ఆమె ఆనతిమేర కాతడు మాతృభూతయ్యకు విస్తారముగా ధన మొసంగి సత్కరించినట్లును చెప్పుదురు. ఈ విషయము సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో విపులముగా కలదు.

**20. మార్గదర్శి వీరభద్రయ్య–** ఇతడు కూడ తంజావూరును క్రీ.శ. 1741 నుండి 1764 వరకు పరిపాలించిన ప్రతాపసింహ మహారాజుకాలమున ఉండినవాడు. ఇత డుత్తరదేశమున నుండి వచ్చి తంజావూరునందు స్థిరనివాసము కల్పించుకొని సంస్థాన విద్వాంసుడై రాజుచేత అనేక సత్కారములు పొందెను. మహారాష్ట్రరాజుల కులదైవమగు ప్రతాపరామాంకితములుగా ఇతడనేక కృతులను, కీర్తనలను, పదములను రక్తిరాగములయందును, దేశీయ రాగములయందును విరచించెను. ఇవికాక ఈతడనేక పదములను, దరువులను, తిల్లానలను ప్రతాపసింహాంకితములుగా విరచించెను. ఈతని రచనములు నిర్దుష్టములు, మనోహరములు నయి తరువాతి వారికి మార్గదర్శకము లగుటచేత ఈతనికి మార్గదర్శి వీరభద్రయ్య అను పేరుగూడ కలిగెను. 'వీరభద్రయ్య స్వరజతి' అని ఈతని పేరనొక గ్రంథము తంజావూరు సరస్వతీమహలు పుస్తక భాండాగారమునందు కలదు. (గ్రంథసంఖ్య 472) గ్రంథాదిని 'వీరభద్రయ్య స్వరజతి' అని ఉండుటచే ఆ స్వరజతిని రచించినవాడు మార్గదర్శి వీరభద్రయ్యయే అని నిశ్చయింపనగుచున్నది.

**21. తుళజేంద్రుడు–** ఇతడు క్రీ.శ. 1741 నుండి 1764 దాక తంజావూరిని పరిపాలించిన ప్రతాప సింహేంద్రుని కుమారుడు. ఇతడు1765 నుండి 1787 దాక జీవించియుండెను. ఇతని పేర ఒకపదము తంజావూరి పుస్తక భాండాగారమునందు గలదు.

**భైరవి-ఆది**

**కన్నుల పండుగాయెను–**
**నిన్ను జూడగానె**
**కన్నుల పండుగాయెను–**
**ఘనుడ శ్రీతుళజభూప!** ॥పల్లవి॥
**చిన్నెలన్నియు జూచి చాలమోహించియున్నాను.**
**కరుణించుమీ సన్నుత కీర్తివిశాలా** ॥కన్నుల॥

**22. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి–** ఇతనికే గంగపట్నం సుబ్రహ్మణ్యకవి అని కూడ పేరు. ఇతడు తెలుగున అధ్యాత్మ రామాయణకీర్తనలను రచించెను. అది

ముద్రితము. ఇదిగాక ఇతడు కాళహస్తి సంస్థానము నేలిన దామెరవారి మీద పెక్కు శృంగారపదములను రచించినట్లు తెలియుచున్నది. దామెర తిమ్మభూపాలుని కుమారుడగు దామెర కుమార వెంకట సార్వభౌముని మీదను, దామెర వేంకటేంద్రుని కుమారుడగు దామెర కృష్ణభూపాలుని మీదను ఇతడు రచించిన పదములు నే డుపలబ్ధము లయినవి. కాళహస్తీశ్వరుని మీదను, అగస్త్యనాథీశ్వరుని మీదను గూడ ఇతడు కొన్ని పదములను రచించినాడు. దామెరవారి మీద ఇతడు రచించిన పదములు చక్కని రచనముతో సవరని భాషలో నున్నది. కాళహస్తి సంస్థానము నేలిన కుమార వెంకటప్ప నాయకుడు హైదరునకు సమకాలికుడు. హైదరు క్రీ.శ. 1780 ప్రాంతము వాడగుటచే కుమార వెంకటప్పనాయకుడును ఆ కాలమువాడే అగుచున్నాడు. అతని మీద పదములను విరచించిన మునిపల్లె సుబ్రహ్మణ్యకవియు ఆ ప్రాంతమువాడే అనుటకు సందేహము లేదు.

**23. సారంగపాణి–** క్షేత్రయకు తరువాత ప్రజాహృదయములను చూరగొన జాలిన పదములను విరచించిన వారిలో సారంగపాణి పేర్కొనదగినవాడు. ఇతడు చిత్తూరు మండలములోని కార్వేటినగర వాస్తవ్యుడు. కార్వేటినగర ప్రభువగు మాకరాజు కాలమున ఇతడు జీవించి ఉండినట్లీతని పదములవలన తెలియవచ్చుచున్నది. కార్వేటినగరములోని వేణుగోపాలస్వామి కంకితములుగా ఇతడు పెక్కు పదములను విరచించినాడు. వేణుగోపాల ముద్ర గలిగి ఉండుటచే అవి వేణుగోపాల పదములనియు, సారంగపాణిచే రచింపబడిన వగుటచే సారంగపాణిపదములనియు వ్యవహరింపబడుచున్నవి. ఇతడు సంగీత సాహిత్య దేశీయ జాతీయ కవిత్వ రచనా చమత్కారి. ఇతడు రచించిన పదములు తొలిసారిగా క్రీ.శ. 1867వ సంవత్సరమున ఈ కవి దౌహిత్రుడగు గరిమెళ్ల వేంకటసుబ్బయ్య గారిచే చెన్నపురియందు నేలటూరు సుబ్రహ్మణ్యంగారి విద్యావిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినవి. ఆ పిదప క్రీ.శ. 1872 లోను, 1889 లోను మరల రెండు పర్యాయములు ఈపదములు



ముద్రింపబడినవి. ఈ కవి దౌహిత్రుడు క్రీ.శ. 1867 సంవత్సరము ప్రాంతము వాడని తెలియుటచే ఇతడు పందొమ్మిదవ శతాబ్ది ప్రథమపాదమున జీవించి యుండదగునని ఊహింప వీలగుచున్నది.

క్షేత్రయ్య మనోహరముగా శృంగార రసమయముగా పదములను విరచింపగా ఇతడు తన కత్తికి రెండువైపులను పదును గలదని తెలుపుటకు కాబోలు శృంగార పదములను, వేదాంత పదములను విరచించినాడు. అన్నమయ్యకువలె ఇతడును శృంగారపదముల కన్న జిగిబిగులతో, చిన్నెలువన్నెలతో వేదాంతపదముల విరచింపగలడు. తన వేదాంత పదముల నితడు సంకీర్తనములని పేర్కొనినాడు. ఈతని పదములు ప్రధానముగా నాలుగు విభాగములుగా విభాగింపబడినవి.

ఆ విభాగములు: శృంగారము, దేశీయము, జాతీయము, కీర్తనలు అనునవి. ఇందలి తొలిరెండు విభాగములలోని పదములు గూడ పురుషవాక్యము, స్త్రీవాక్యము, సఖీవాక్యము అను క్రమములో రచింపబడినట్లున్నవి.

ఇతని పదములు సులభమై, సుగమమై ఉండుటయే గాక అభినయాను కూలముగను ఉండి శృంగారరసమును పుక్కిలించుచు సహృదయా స్వాద్యములైయున్నవి. అవి కవితకు, కళలకు, గానమునకు కదలపరాని కాణాచి. క్షేత్రయ్యకు తరువాత పదకవులలో ఇతనిదే అగ్రతాంబూలము!

**24. సభాపతయ్య–** ఇతడు త్యాగరాజునకు వలెనే ములకనాటి వైదికశాఖకు చెందిన బ్రాహ్మణుడు. తంజావూరునకు సమీపముననున్న మూవనల్లూరను బ్రాహ్మణాగ్రహార మీతని స్వగ్రామము. పిదప ఇతడు తన స్వగ్రామము వీడి తత్సమీపముననే ఉన్న ప్రసిద్ధవిష్ణుక్షేత్రమగు మన్నారుగుడి కేతెంచి అచ్చట రాజగోపాలస్వామి భక్తుండై తన్నామాంకితములుగా గొన్ని శృంగారపదములను విరచించినాడు. ఇతని స్వగ్రామము మూవనల్లూరగుటచే మూవనల్లూరు సభాపతయ్య అనియు, మన్నారుగుడిలో చాలకాలము వసించిన వాడగుటచే

రాజమన్నారుగుడి సభాపతయ్య అనియు ఇతడు వ్యవహరింపబడుచుండెను. భరతశాస్త్రము నందితడు మహాప్రవీణుడయినట్లు తెలియుచున్నది. క్షేత్రయ్య పదముల నితడు సంప్రదాయ సిద్ధముగాపాడి అభినయించువాడట. పదాభినయమే ఇతనిని పదరచయితగా జేసియుండు ననుటలో ఆశ్చర్యము లేదు. క్షేత్రయ్యపదము ఇతనికి నిత్యాను సంధానములో నుండి శిక్షాధ్యయనముల ప్రతిదినమును నలుగుచుండుటచేత కాబోలు ఇతని పదములయందు క్షేత్రయ్యపదములతనము మిక్కిలిగా కానవచ్చున్నది. ఇతడు సుమారు నూరేండ్ల కిటీవల అనగా క్రీ.శ. 1860 ప్రాంతమున ఉండినట్లు తెలియుచున్నది. ఇతడు శృంగారపదములను మాత్రమే కాక 'సీతాస్వయంవరము'ను పాటలలో రచించెను. చాలాకాలము నుండి ద్రవిడదేశములో నెలకొని ఉండిన తెలుగు కుటుంబమునకు చెందినవాడగుటచే ఇతని పదముల యందును త్యాగయ్య కీర్తన లందువలెనే కొన్ని తమిళపదములును దొరలినవి.

సభాపతయ్య రాజగోపాల నామాంకితములుగా రచించిన శృంగారపదములు ఏబది మాత్రము క్రీ.శ. 1884 సంవత్సరము మార్చినెలలో శ్రీ.అ.స. నృసింహాచార్యులవారి శ్రీవాణి నిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినవి. ఇందు ఈ పదములకు శ్రీ.నీ.మా. తిరుపతి వేంకటాచార్యులవారు సంగ్రహించిన ఆంధ్ర కావ్యరూపమయిన నాయికా నాయకాది లక్షణములును; రసమంజరి ఉదాహరణ శ్లోకములును ఒసగబడి ఉన్నవి (వివరములకుచూడుడు- సభాపతయ్యగారి పదములు అను వ్యాసము- వికృతి మాఘమాస భారతి.(1950 జనవరి).

**25. రాజగోపాల వాగ్గేయకారాగ్రణి-** ఇతనిని గూర్చిన వివరము లెక్కువగా తెలియవచ్చుటలేదు. ఇతనిచే రచింపబడిన భక్తజనపారిజాతమను ప్రబంధము తంజావూరు సరస్వతీమహలు పుస్తక భాండాగారమునగలదు. (గ్రంథ సంఖ్య 202-203) అందలి గద్య ఇది. చూడుడు-



"ఇది చింతామణి మంత్రజపలబ్ద చతుష్షష్టి కలాకలాపాభిరామ గుంటూరి రామకృష్ణ కవిసార్వభౌమ నందనగోపాల విద్వత్కవీంద్ర తనయ వేదవిద్యామనీషా విశేషాభిరామ రాజగోపాలకవి వాగ్గేయకారాగ్రణి ప్రణీతంబైన భక్తజన పారిజాతంబను మహాప్రబంధమునందు చతుర్థాశ్వాసము."

దీనిని బట్టి ఈ కవి ఇంటిపేరు గుంటూరివారనియు, ఇతని తండ్రి విద్వత్కవీంద్రుడనియు, పేరు గోపాలుడనియు, దాతపేరు రామకృష్ణకవి యనియు తెలియ వచ్చుచున్నది. ఇతడు రచించిన గేయములు,పదములు ఎట్టివో తెలియరావు.

**26. మేరట్టూరు వెంకటరామశాస్త్రి-** ఇతడు త్యాగరాజునకు సమకాలికుడు. సంగీతశాస్త్రమునందును, భరతనాట్యమునందును ఆరితేరినవాడు. ఇతడు వెలనాటి శాఖకు చెందిన తెలుగు బ్రాహ్మణుడు. తంజావూరు మండలములోని మేరట్టూరు గ్రామ మీతని నివాసస్థలము. ఇతడనేక యక్షగానములను రచించెను. క్రీ.శ. 1807 లో మేరట్టూరు గ్రామమున జన్మించి ఇతడు సంగీతము నందును, సంస్కృతాంధ్రముల యందును గొప్ప పాండిత్యమును బడసి తన యిరువదియైదవ సంవత్సరమునుండియు గ్రంథరచనమునకు పూనుకొనెను. ఇతడు పండ్రెండు యక్షగానములను రచియించినట్లు తెలియుచున్నది. వానిలో పదునొకండు మాత్రము వ్రాతప్రతులలో మన కుపలబ్ధము లగుచున్నవి. ఇతడిట్లు యక్షగానములను మాత్రమే కాక పెక్కుపదములను గూడ రచియించి పదరచయితగా గూడ ప్రసిద్ధిచెందినట్లు తెలియవచ్చుచున్నది. తంజావూరు మండలములోని పెక్కు గ్రామములలో మొన్న మొన్నటిదాక గూడ నృసింహజయంతి సందర్భముల యందు ఇతని యక్షగానములు ప్రదర్శింపబడు చుండెడివనియు, పలువురు సంగీతవిద్వాంసులు ఆసంగీత ప్రదర్శనములకు పోయి ఆనందించుచుండెడి వారనియు జెప్పుదురు.

**27,28. ధర్మపురి సుబ్బరామయ్య- పట్టాభిరామయ్య-** వీరిరువురును ప్రశస్త సంగీతవిద్వాంసులు. తెలుగున మనోహరములయిన జావళీలను, పదములను

వీరు రచించిరి. ధర్మపురీశ, తాళవనేశ అను ముద్రలు గలిగి ఆ పదరచనములు సహృదయ హృదయాహ్లాదకరములుగా ఉండును.

ఆంధ్రసాహిత్యములో పదరచనమునకు పేదతనము లేదు. సుప్రసిద్ధులగు పై పదకర్తల పదరచనములే కాక ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున కచ్చి యువరంగని పదములు, శివరామపురమయ్యవారి పదములు, శోభనగిరివారి పదములు, తిరుమలపురివారి పదములు, కువ్వముసామి పదములు, వృద్ధకాశి వారి పదములు, విజయరంగ చొక్కనాథుని పదములు, పాళెమురంగని పదములు, ముద్దురంగని పదములు, నారసింహునిపదము, ఆరణి తిరువెంగళప్పయ్యపదము, ఉదయాద్రివారి పదములు, సౌందరేశ్వరుని పదములు, గోపాలుని పదములు, మధురపాక ముద్దుచెన్నశౌరి పదములు, వీరరాఘవుని పదములు, బసవశంకరుని పదములు, తిరుక్కోవులూరి పదములు, చంద్రశేఖరుని పదములు, శోభనగిరివారి పదము (అచ్చువెలివారి పదము), వరహుని పదము, తిరుక్కణమంగవారి పదము, ఉమామహేశ్వరుని పదము, కల్యాణవరదుని పదము, అరియుపురి కోదండరాముని పదము, కరిగిరివరదునిపదము, తౌరయూరి మదనగోపాలపదము, సహదేవపురివారిపదము, ఏకామ్రపతి పదము, ప్రసన్నగుడియాతపు చెన్నుని పదము, దామెర ముద్దు వెంకటభూపాలుని పదములు కలవు.

క్రీస్తుశకము పదునేడు, పదునెనిమిది శతాబ్దులలో ప్రజాసామాన్యము పదరచనములకు బ్రహ్మరథము పట్టుచుండిరనుటను ఈ పదరచనములు ధ్రువపరచుచున్నవి. పురాతన పదరచయితలచే రచియింపబడి చెదరులు చెదరులుగా ఉన్న ఈ పదరచనములెల్ల ఒక సంపుటముగా ముద్రింపదగినవి. ఈ పదరచనములు ప్రజాసామాన్యమునకు విద్యావినోదముతో పాటు సాహిత్యాభిరుచిని, కళాభిజ్ఞతను కలిగించుచు అనితరానంద సంసాదకములయి నిత్యనవీనములై నెగడుచున్న వనుటలో సందేహములేదు.

# 2. కృష్ణమాచార్యులు

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున కృష్ణమాచార్య వచనముల ప్రతులు మూడున్నవి. అందు రెండు ప్రతులయందు 'కృష్ణమాచార్యుల' మహిమాదికమును తెలుపు ఈ క్రింది వృత్తాంతము కలదు. ఆ రెంటిలో ఒకటి మాతృక, మరొకటి దాని పుత్రిక.

కృష్ణమాచార్యులు ఓరుగంటినగర వీధులవెంట సంకీర్తనములు గానము సేయుచు పోవుచుండ ఒకవీధిలో కైలాసప్రాప్తి గాంచిన ఒక కంసాలి భక్తుని మృతకళేబరమును కొనిపోవుచుండిరి. అతనితో సహగమనము చేయదలచి అతని సతీమణి విమాన మెక్కిపోవుచు సంకీర్తనముల గానము చేయుచుండిన కృష్ణమాచార్యులకు పాదాభివందన మాచరించుటకై విమానము దిగివచ్చెను. పసుపుచీర, పసుపురవికె, ఒడిబియ్యము, నుదుట కుంకుమ బొట్టు, పాపట సేసబ్రాలు ఒకచేత నిమ్మపండు, మరొకచేత పూవులు దాల్చి తనకు నమస్కరించిన ఆ కంసాలి భక్తురాలిని సమర్తపెండ్లికూతురని భావించి కృష్ణమాచార్యులు 'దీర్ఘ సుమంగళీ భవ! దీర్ఘాయుష్మతీ భవ !' అని దీవించెను. అపుడామె తన భర్త మృతుడయ్యెనని, తా నతనితో సహగమనము చేయబోవుచుంటినని, ఆతని యాశీర్వాద మెట్లు ఫలించునని అడుగగా అతడు తప్పక తన వాక్కు జరిగితీరునని పలికెను. అంత కైలాసములో శివుడు కంసాలిభక్తుని రావించి కృష్ణమాచార్యులు కోరుచున్నందున భూలోకమునకు పొమ్మని ఆజ్ఞాపించెను. 'అంత నతడు స్వామీ! సుకృతములు చేసిన గాని కైలాసము లభింపదు. నా పూర్వకృత సుకృతవశమున నాకు కైలాసప్రాప్తి కలిగినది. ఒక భాగవతుని మాటవిని తమరు నన్నిట్లు నియోగింపదగునా!' అని పలికెను. అంత శివుడు 'ఓయీ! కృష్ణమాచార్యులు భాగవతాగ్రేసరుడు. నీవు తప్పక అతని కడకు వెళ్ళి అతని యనుజ్ఞగొని మరల కైలాసమునకు రమ్ము, పొమ్మని దీవించి పలికెను. అంత ఓరుగంటిలో ఆ కంసాలి భక్తుడు పునర్జీవితుడై కృష్ణమాచార్యులను గాంచి 'స్వామీ! నేను కైలాసమునకు బోగా నన్ను కోరితిరట! పరమేశ్వరుని ఆజ్ఞమేరకిట మీ సన్నిధికి

వచ్చితిని. మరల నన్ను కైలాసమునకు పంపు' దని వేడుకొనగా ఆచార్యులతనితో 'ఓయీ! కైలాస మేరీతినుండును? అందలి విశేషములను వివరింపు' మని కోరగా నతడు కైలాసమును వర్ణించి తెలిపెను. అప్పుడు కృష్ణమాచార్యు లతని జూచి 'ఓయీ! కైలాసము మేలో పరమపదము మేలో మీ పరమశివుని నడిగి చూడుమని కోరగా నపుడు పరమశివుడును, బ్రహ్మదేవుడును ప్రత్యక్షమై 'ఓయీ! ఇతడు సింహాద్రి యప్పయ భక్తుడు. భాగవతాగ్రేసరుడు. కైలాసమున కంటె యతడొసగు పరమపదమే గొప్పది' యని పలికిరి. అప్పుడు కృష్ణమాచార్యులు చాతుర్లక్ష సంకీర్తనములు గానముచేసి సింహాద్రి యప్పన్నను కీర్తించెను. ఆ కంసాలి భక్తుడును తిరుమణి, తిరుచూర్ణములు దాల్చి వైష్ణవు డయ్యెను.

ఆచార్యసూక్తి ముక్తావళిలోని ఈ క్రింది సీసపద్యపాదములో పేర్కొనబడిన వృత్తాంతము, ఇదియు ఒకటియే కాబోలు!

**'ఏ సూరి రజకుని యింట మృతానుజు**
**నడిపించెఁ బితృకాననంబుదనుక'**

ఇందు రజకుడని కలదు. అందు కంసాలి భక్తుడని కలదు. స్పష్టముగా రజకుని వృత్తాంతము వేరయినట్లు తెలియు వరకు ఇదియే ఆ వృత్తాంత మయి ఉండవచ్చు ననుకొనవచ్చును.

మరియొక ప్రతిలో నీ క్రింది వృత్తాంతము కలదు.

కృష్ణమాచార్యు లొకనాడు ఓరుగంటినగర వీధులవెంట చాతుర్లక్ష సంకీర్తనములు గానము చేయుచు పోవుచుండెను. అప్పుడొక గృహస్థు డతనిని తన ఇంటికి గొనిపోయి సత్కారములు చేసి తన యింట ఆతిథ్యము స్వీకరింప వేడెను. అతడు 'బృందావనమును దర్శింపని వాని యింట నాతిథ్యము స్వీకరింపను. కావున నీవు బృందావనమునకు పోయి వచ్చితివేని నీ ఇంట నేను సాపడుదు'నని పలికెను. అపుడతడు తులసి ప్రభావమును గానము చేసెను. ఇతడట్లు సంకీర్తనము చేయునపుడు నలువురు కోడండ్రు ఆ దారిని



పోయిరి. అందులో మువ్వురతని గానమును పెడజెవిన బెట్టిరి. అంత వారు సంకీర్తనా తిరస్కార ఫలమును తోడ్తో పొందవలసి వచ్చెను.

ఈ పై కథలు పేర్కొన్న పిదప అందు కొన్ని వచనములు కలవు. అవియే శ్రీకృష్ణమాచార్య సంకీర్తనములు. వానికి వచన సంజ్ఞ కలుగుటకు కారణము బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన 'శ్రీవేంకటేశ్వరవచనముల' పీఠికలో చదువగోరు చున్నాను. అందు వారు విపులముగా ప్రాచీన వచనరచనాసంప్రదాయ చరిత్రలను వివరించియున్నారు. అందే వారు కృష్ణమాచార్యులు కాకతీయ ప్రతాపరుద్రదేవుని నాటివాడని, పదమూడవ శతాబ్ది వాడని వ్రాసిరి. ఏకశిలానగర చరిత్రాదుల నాధార పరచుకొని, వారు ఆ కాలనిర్ణయమును చేసినట్లు తెలిపిరి. పై పేర్కొనిన రెండు వృత్తాంతములలోను కృష్ణమాచార్యులు ఓరుగంటిలో సంకీర్తనములు చేసినట్లు కలదు. కృష్ణమాచార్యులు ఓరుగంటి నివాసి కాబోలు! లేక తత్ప్రాంతీయు డగుటవలన అచటి కపుడు వచ్చుచుండెనేమో! కృష్ణమాచార్యులు రచించినట్టు పై చెప్పబడిన చాతుర్లక్ష సంకీర్తనము లేమయినవో తెలియరావు. ఈ ప్రతులలోని సంకీర్తముల నన్నిటిని చేర్చినను అవి కొన్ని పదులసంఖ్య కంటె మించవు. అవి 'నిత్యుల' పాలై నశించి యుండనోపును! ఇచట నిత్యులనగా ఏపూట కాపూట బిచ్చమెత్తి జీవించువారని అనుకొనవచ్చును.

ఇక తంజావూరి సరస్వతీమహలు భాండాగారమున ఉన్న 'విష్ణునామ సంకీర్తనము' అను పేరుగల గ్రంథము కూడ కృష్ణమాచార్య సంకీర్తనములే. తంజావూరి లైబ్రరీ కేటలాగును తయారు చేసినవారు గ్రంథనామమును, కవినామమును తెలిసికొనజాలక గ్రంథప్రతిపాద్య విషయమునుబట్టి ఆ గ్రంథమున కా పేరిడినట్లు క్యాటలాగునందే వ్రాసియున్నారు.

అందొసగియున్న వచనభాగమును పరిశీలించినను నది కృష్ణమాచార్య సంకీర్తనము లయినట్లే తెలియుచున్నది. ఇక అక్కడి 'వేంకటేశ్వర విన్నపములు' కృష్ణమాచార్యులు రచించినవి కాదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని

వేంకటేశ్వర వచనములను, సరస్వతీమహలులోని వేంకటేశ్వరవిన్నపములను క్రోడీకరించి, సరిపరచి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శ్రీవేంకటేశ్వర వచనము' లని గ్రంథరూపమున ప్రకటించి ఉన్నారు. ఆ గ్రంథము తిరుపతి శ్రీవేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధనాలయము వారు ప్రకటించిరి. తత్కర్త తాళ్ళపాక తిరుమలాచార్యుడు.* వచనరచనల గూర్చి, వచనరచయితల గూర్చి వారు పీఠికలో విపులముగా వ్రాసియున్నారు. 'కృష్ణమాచార్య సంకీర్తనము' లను కూడ వారు సేకరించి పరిష్కరించిరి. త్వరలో దానిని ముద్రింతురు.**

* ఇతడు అన్నమయ్య కుమారుడైన పెదతిరుమలయ్య. (సంపాదకుడు)

** ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించినట్లు తెలియడం లేదు. అది ముద్రణ కాలేదు. (సంపాదకుడు)

## *3. కృష్ణమాచార్య వచనములు

క్రీస్తుశకం పదునేడవ శతాబ్ది అంతిమభాగంలో తిరుపతికి సమీప ప్రాంతాలలో ఒక పెద్ద విప్లవం జరిగింది. దుండగీంద్రైన మహమ్మదీయులు కొందరు చెలరేగి ఆ ప్రాంతాల్లో అనేక అత్యాచారాలు చేశారు. గ్రామాలు దోచుకున్నారు. దేవాలయాలు పడగొట్టారు. దారి దోపిడీలు సాగించారు. ఇంకా ఎన్నో యెన్నో చేశారు. అప్పుడు తన చుట్టుపట్టుల్లో వుండే ప్రజలకు సంరక్షణం యివ్వక తనకేమీ కాబట్టనట్టుగా రాయికి మల్లే కదలకుండా మెదలకుండా వుండే శ్రీవేంకటేశ్వరస్వామిని ఆ ప్రాంతాల్లో ఆ విప్లవకాలంలో వుండిన ఒక అజ్ఞాతకవి కడుపుమండి కోపం పట్టలేక బాగా ఘాటుగానే దుయ్యబట్టుతూ ఒక్క శతకం రాశాడు. దానికి † 'శత్రుసంహారశతకం' అని పేరు. అందులోనిది యీ పద్యం చూడండి–

**"కటకేంద్రు కూతురి కౌగిటిలో జిక్కె**
**జెల్లపిల్లస్వామి చేతగాదు**
**కృష్ణమాచార్య సంకీర్తనంబుల జొక్కె**
**సింహాద్రి యప్పయ చేతగాదు**
**కవ్వంపుగొండ సంఘర్షణోద్ధతి దక్కె**
**శ్రీకూర్మనాథుని చేతగాదు**
**సాంఖ్యతొండని ఆలజడి కెంతయును స్రుక్కె**
**జెన్నమల్లేశుని చేతగాదు**

**పవన జవన నిరాఘాట యవనఘోట**
**హరణ జయధాటి మీచేత నౌనె మేటి**

* 'తాళపత్రగ్రంథాలు' అను శీర్షికను మదరాసు రేడియో కేంద్రము నుండి ప్రసారము చేసిన ప్రసంగమును పెంచి వ్రాసినది.

† శ్రీవేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమువారు ప్రకటించిన 'శ్రీవేంకటేశ్వర లఘుకృతులు' అను గ్రంథమున ముద్రితము.

**వౌదు ఒకసన్న జూడు మేలా పరాకు**
**శత్రుసంహార ! వేంకటాచల విహార !**

ఈ పద్యంలో కృష్ణమాచార్యులనే ఒక భక్తుడు సంకీర్తనలు పాడి సింహాద్రి నరసింహస్వామిని చొక్కింపజేసేవాడనే విషయం ఒకటి పేర్కొనబడింది.

ఇంతకి ఇంకా పూర్వంలో పదునారవ శతాబ్ది వాడైన తాళ్ళపాక చిన్నన్న కూడా ఈ కృష్ణమాచార్యులను రెండుమూడు స్థలాల్లో పేర్కొన్నాడు. తాళ్ళపాక అన్నమయ్య 'శృంగారమంజరి' అనే గ్రంథం రచించి శ్రీవేంకటేశ్వరస్వామివారికి సమర్పించగా ఆయన అన్నమయ్యతో యిలా అన్నాడట!

**"ఆడుచు బతక మా కన్నులజోల**
**పొదగ నాడెల్ల బసిబిడ్డనైతి**
**నా కృష్ణమాచార్యు నధ్యాత్మవినుతి**
**రాక గొన్నాళ్లు విరక్తుండ నైతి**
**జగతి నీ శృంగారసంకీర్తనముల**
**కగపడి మంచిప్రాయపువాడ నైతి"**

**–అన్నమాచార్యచరిత్రము**

కృష్ణమాచార్యులు పాడిన ఆధ్యాత్మిక సంకీర్తనములను విని వేంకటేశ్వరస్వామంతవాడు విరక్తు డయినాడట! కృష్ణమాచార్యుల సంకీర్తనల యోగ్యత అలాంటిది!

చిన్నన్న తన పరమయోగివిలాసంలో–

**'వేదంబు దెనుగు గావించి సంసార**
**ఖేదంబు మాన్పిన కృష్ణమాచార్యు'**

అని ఈ కృష్ణమాచార్యులను ప్రశంసించినాడు.

ఇతడి సంకీర్తనల సంచయం తెలుగువేదం! ఆ వేదం చదివితే సంసార ఖేదం తొలగుతుంది.



ఇలాంటి ప్రశస్తిని గడించిన కృష్ణమాచార్యులను గురించీ, అతడు రచించిన సంకీర్తనములను గురించీ తెలుసుకోవాలని యెవరికి వుత్సాహం పుట్టదు? ఉత్సాహం అంటూ కలిగిన తరువాత పరిశ్రమ యెప్పుడూ వట్టినే పోదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో 'కృష్ణమాచార్య వచనములు' అనే పేరుతో ఒక గ్రంథం వుంది. ఆ ఒక్కగ్రంథానికే ఆ భాండాగారంలో మూడుప్రతులు లభిస్తున్నాయి. అందులో రెండుప్రతులు, ఒకటి మాతృక, మరొకటి దానికి పుత్రిక. ఇందాక పేర్కొన్న కృష్ణమాచార్యులు రచించిన సంకీర్తనల సంకలన గ్రంథమే అది. మదరాసులో మాత్రమే కాక ఈ గ్రంథమే తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీలో కూడా వున్నది. అయితే ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ప్రకటించిన అక్కడి గ్రంథముల కేటలాగులో దీనిపేరు 'విష్ణునామ సంకీర్తనము' అని వున్నది. పేరయితే వేరుగా వుందిగాని అందులోని విషయమంతా ఇదే. కేటలాగును తయారు చేసినవారు గ్రంథాన్ని సరిగా గుర్తింపకపోవడంవల్ల యేర్పడిన ప్రమాదం అది! ఎలా అయితేనేం, ప్రస్తుతం ఈ గ్రంథానికి నాలుగు ప్రతులు లభిస్తున్నవని చెప్పవచ్చు!

ఆంధ్రవాఙ్మయంలో అపూర్వమయిన ఈ గ్రంథానికి వున్న విలువ యెలాంటిదో నిర్ణయించే ముందు ఈ గ్రంథానికి కర్త అయిన కృష్ణమాచార్యుల కాలం గూర్చి తెలుసుకోవడం అవసరం. ఏ గ్రంథం యొక్క యోగ్యతైనా ఆ గ్రంథం వెలసిన కాలంమీద కూడా కొంతవరకు ఆధారపడి వుంటుందని చెప్పడం తప్పు కాదు.

ఏకశిలానగర వృత్తాంతం అని ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోనే మరొక గ్రంథం వుంది. అందులో కృష్ణమాచార్యులను గురించి ఒక వింత కథ వుంది. కృష్ణమాచార్యుల మహిమాదికాన్ని మాత్రమే కాక ఆ కథ అతని కాలాన్ని కూడా కొంత అస్పష్టంగానే తెలుపుతూ వుంది. ఆ కథ యిది!

"మరి యొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యుల తమ్ముండు అనంతాచార్యులు రజక స్త్రీతో కూడంగా ఆ రజకుడు యిద్దరిని పొడిచితె

మృతంబైరి. అప్పూరి విప్రులు యీ శూద్రపీనిగెతో కూడా సమసిరి గన్క యీ విప్రులు మోయకుండిరి. అదివిని కృష్ణమాచార్యులు తన మదిని విచారించి వాసుదేవమూర్తిని కీర్తించిన ఆ శవంబు తనకు తానే కాష్ఠంబునకు నడచుటయు, యిది గని సకల జనంబులు విప్రులు యేతెంచి కృష్ణమాచార్యుల పాదంబులకుం బ్రణమిల్లి మా యపరాధంబులు క్షమియింపు మనుటయు ఆ యయ్య నాకు రాగద్వేషంబులు లేవు మీరు వెరవకుడనుటయు యా వార్త ప్రతాపరుద్రుండు చారులవలన నెరింగి కృష్ణమాచార్యుల రావించి పూజించి ఏకశిలానగరి శీమలో నాల్గోభాగంబున యాబది గ్రామంబులకు అధికారంబు, యొక్క వూరు అగ్రహారంబుగా వొసంగి అనుపుటయు, కృష్ణమాచార్యులు సంతూరు ప్రవేశించి కల్లనంబు పుట్టుటంజేసి కల్లూరను గ్రామంబు గట్టికోట పుట్టుటయు మూడు వరుషంబులు అధికారంబు చేసిన గ్రామంబుల గల్గు పదార్థంబు వెచ్చించి తామ్రపత్రికలు సేయించి యా పత్రికమీద తా రచియించిన చాతుర్లక్ష గ్రంథంబు లిఖియించి అది శకటంబుపై పన్నుకొని శ్రీరంగంబునకు కొనిపోవ నుద్యోగించిన కొందరు ధూర్తులు గూడి యా రాజు సముఖంబుకుం బోయి కృష్ణమాచార్యులకు మీరు అధికారంబు యిచ్చిన గ్రామంబుల పదార్థంబు వెచ్చించి తామ్రపత్రికెలు శేయించి శ్రీరంగంబునకుం గొనిపోవుచున్నాడు అని యెరిగించిన ప్రతాపరుద్రుండు విని యతండు మహాత్ముండు. యతనికి యేది యిష్టమో నాకు అదియె యిష్టంబు. అని వూరకుండటయు, ఆ వార్త యిష్టజనులచే కృష్ణమాచార్యులు విని వూరికె పోయిన మూర్ఖత్వంబని రాజసముఖంబునకు యేతెంచి, యాభైగ్రామంబుల వరుషత్రయంబునకు లెక్కవినిపించి, అప్పుడు మూడులక్షల వరహాలు ఆయననిన, కృష్ణమాచార్యులు తన మనంబున వాసుదేవు నారాధించి వక్క వచనంబు రచియించిన మెచ్చి యేకశిలానగరంబున కనకవృష్టి కురువుటయు యిదిగని ప్రతాపరుద్రుండును, ఆ పరిజనంబులున్ను కృష్ణమాచార్యుల పూజించిన వారిచే వీడ్కొని కృష్ణమాచార్యులు శ్రీరంగంబున కరుగుటయు"



'ఏకశిలానగర వృత్తాంతం' లోని యీ విషయం వల్ల కృష్ణమాచార్యులు కాకతీయచక్రవర్తి అయిన రెండవ ప్రతాపరుద్రుడి కాలంలో వుండినట్లు మనకు తెలియవస్తున్నది. కృష్ణమాచార్యులు పదమూడో శతాబ్దంలో ఓరుగల్లు ప్రాంతంలో వుండిన ఒక మహాభక్తుడని దీనివల్ల మనకు తెలుస్తున్నది.

* 'ఆచార్య సూక్తిముక్తావళి' అనే గ్రంథంలో కృష్ణమాచార్యులను గూర్చి ఒక చక్కని కథ వుంది. కృష్ణమాచార్యులు సింహాద్రి నరసింహస్వామి భక్తుడు. సింహాద్రి మీద వుండి ప్రతిదినం స్వామివారిపై యితడు సంకీర్తనలను పాడుతుండేవాడు. ఆయన సంకీర్తనలను పాడుతుండినపుడు నరసింహస్వామి సంతోషముతో ఆడుతూవుండేవాడు. రామానుజులవారు** దిగ్విజయ యాత్ర పోతూ మార్గంలో సింహాద్రి మీద శిష్యులతో కూడా విడిసి స్వామివారి దర్శనంచేసి ఆ గుడిలో యీశాన్యభాగంలో కొంతకాలం గోష్ఠిచేసి తిరిగివస్తూ ఆస్థాన మంటపంలో రాజసంతో కూర్చునేవుండిన కృష్ణమాచార్యుల దగ్గరకు పోయి 'అయ్యా! యీ రాత్రి మీరు పాటపాడినప్పుడు స్వామి ప్రత్యక్షమయితే యెంబెరుమానారు అనే ఒక సన్యాసి యిక్కడకు వచ్చివున్నాడు. అతడికి మోక్షం కలుగుతుందా అని అడుగు. అతడేం చెబుతాడో రేపు నాకు తెలుపు 'అని చెప్పి వెళ్లిపోయాడు. కృష్ణమాచార్యులు అతడెవరో ఒక సామాన్య సన్యాసి అని, యేదో వుపకారం చేద్దాం పోనీ అని ఆ రాత్రి తాళము, వీణె ధరించి స్వామివారిని కీర్తించినాడు. అప్పుడు స్వామి ప్రత్యక్షంకాగా యితడు రామానుజుల విషయం ప్రస్తావించినాడు. అప్పుడు స్వామి 'అతడికీ, అతడిప్పించే వాళ్లకీ గూడా మోక్షం వుంది.' అని సెలవిచ్చినాడు. మరునాడు కృష్ణమాచార్యులు రామానుజులు గుడికి వచ్చివుండినపుడు రాత్రి విషయం తెలిపాడు. రామానుజుల వారంతటితో విడువలేదు.'ఈ రోజు రాత్రి నీకు పరమపదం వుందేమో అడిగి తెలుసుకొని నాకు చెప్పు' అన్నాడు. కృష్ణమాచార్యులు నాకు పరమపదం లేకపోవడమేమిటి?

* నంబూరి కేశవాచార్య విరచితము

** రామానుజులు, కృష్ణమాచార్యులు సమకాలికులని చెప్పడం చారిత్రకంగా సాధ్యంకాదు. (సంపాదకుడు)

అయినా అడుగుతానని ఆ రాత్రి సంకీర్తనలు పాడి స్వామిని తన విషయం అడిగాడు. కాని స్వామియేమీ బదులు చెప్పకుండా వూరికే వుండిపోయాడు. అప్పుడు కృష్ణమాచార్యులు యిలా మీరు బదులు చెప్పకుండా వుండడం వుచితమేనా? అని అడిగితే అప్పుడు స్వామి మోక్షం నా సొమ్మని వేదాలు చెప్తుతున్నవి. అయితే అది యిప్పుడు పరాయత్తం. శ్రీరంగం నాకు దక్షిణపిల్లు. ఎంబెరుమానారు నన్నడిగితే వుభయ విభూతులూ నేను అతడికి యిచ్చేశాను. అందువల్ల యెవడికైనా మోక్షం కావలసివుంటే అతడికి శరణాగతుడు కావాలి. నీకు మోక్షం వుందో లేదో చెప్పడానికి అతడే కర్త. అందువల్ల యీ విషయం అతణ్ణే అడుగు. మోక్షం నీకు యివ్వతగునని తోస్తే యిస్తాడు. లేకపోతే లేదంటాడు." అని సెలవిచ్చాడు. కృష్ణమాచార్యులకు కోపం వచ్చింది. స్వామీ! ఒక్క సన్యాసి కోసం నన్నిలా వంచించడం నీకు ధర్మం కాదు. బాల్యం మొదలుకొని నిన్ను నమ్ముకొని నీ మీద కీర్తనలు పాడి కవిత చెప్పినాను. లోకంలో గొప్ప భక్తుడని పేరుపొందినాను. అప్పుడు స్వామి 'నీ గర్వమే నిన్నింతగా చేసింది. రామానుజులు వచ్చినప్పుడు లేచి నిలుచుని నమస్కరించకుండా రాజసంతో వుండినావు. అదే నీ కిప్పుడు తంటా అయింది. స్వామిమీద పాటలు పాడుతున్నానుగదా! అని నువ్వు గర్వపడ్డావు. దాని ఫలితమే యిది. నీ భక్తికి సంతోషించి నీకు ప్రత్యక్షమయ్యాను. నువ్వు పాడితే ఆడాను అంతే! మోక్షం విషయం అది నా ఆధీనంలో లేదు. నన్నేంచేయమంటావు? అని 'నీ కవిత్వం అగ్రవర్ణులకు గాక నిత్యులపాలై నశించును గాక'! అని శపించాడు. కృష్ణమాచార్యులు 'నీ విమానం నేలకూలును గాక! ఏడు దినములు ఒక్కరీతిగా కాలి కూడా నీ దేవాలయం చెక్కుచెదరకుండా వుండును గాక! తిరిగి నీకు విమాన మమరును గాక!' అని ప్రతిశాప మిచ్చాడు.

ఆ తరువాత కొద్దిరోజులకి తురుష్కులు దేవాలయ విమానాన్ని పడగొట్టి గుడి కాల్చేశారు. కాని గుడి చెక్కుచెదరకుండా నిలిచివుండినది. కృష్ణమాచార్యుల కీర్తనలు నిత్యభోగ్యములయినవి. పశ్చాత్తాపంతో కృష్ణమాచార్యులు తిరిగి స్వామిని ఆశ్రయించాడు. 'సంకోచం వీడి రామానుజుల నాశ్రయింపు' మని



స్వామి అతనికి సలహా యిచ్చాడు. కృష్ణమాచార్యులు వచ్చియున్నాడని కబురు పంపినాడు. 'ఆ బ్రాహ్మణుడితో నా కేమి పని' అని రామానుజులన్నారు. ఈ విషయం రాత్రి స్వామితో చెప్పేసరికి 'ఆచార్య శబ్దం ఒక్క రామానుజులకి తప్ప తక్కినవాళ్ల కెవళ్లకీ విహితము కాదు. అందువల్ల వట్టి పేరు మాత్రం చెప్పు' అన్నాడు స్వామి. మరునాడు అలాగే చేశాడు. రామానుజులు యేమీ చెప్పక వూరకే వుండినాడు. నిరుత్సాహంతో, నిరాశతో ఆ విషయం ఆ రాత్రి స్వామితో చెప్పేసరికి 'కృష్ణదాసుడు వచ్చియున్నాడని విన్నవించుకో. అప్పుడు నీకు దర్శనం లభిస్తుంది.' అన్నాడు. కృష్ణమాచార్యులు అలాగే చేసి రామానుజులను దర్శించినాడు. రామానుజులు అతణ్ణి ఆదరించి 'నీవు యిక్కడే మాకు ప్రతినిధిగా వుండి విశిష్టాద్వైత మతప్రచారం చేయవలసింది'. అని వుపదేశించి దిగ్విజయయాత్రకు శిష్యులతో కూడా బయలుదేరి పోయాడు'.

ఇదీ కథ. మనోహరమయిన యీ కథనంవల్ల కృష్ణమాచార్యులు రామానుజులకు సమకాలికులని తెలుస్తున్నది. అయితే యిది యథార్థంగా తోచదు. ఆంధ్రదేశంలో గొప్ప గాయకుడనీ, మహాభక్తుడనీ పేరుపొందిన కృష్ణమాచార్యులను – రామానుజులవారికి దాసునిగా పేర్కొని రామానుజుల ప్రభావాదికమును గొప్పగా చెప్పుకోవడానికి తగినట్టుగా యీ కథ రామానుజుల మతానుయాయులచే కల్పింపబడినట్టుగా తోస్తున్నది. ఈ కథే నిజమయితే కృష్ణమాచార్య లింతకంటె మునుపటివాడు కావలసివచ్చును. ఏకశిలానగర వృత్తాంతం అనే గ్రంథాన్ని బట్టి యితడు కాకతీయ చక్రవర్తి అయిన రెండవప్రతాపరుద్రుని కాలంలో వాడుగ నిశ్చయించుకొన వలసియున్నది.

ఆంధ్రవాఙ్మయంలో యీ కృష్ణమాచార్య వచనములకు ఒక విశిష్టమయిన యోగ్యతా, స్థానమూ వున్నది. తెలుగువాఙ్మయం యించుమించు సంస్కృత వాఙ్మయాన్ని బట్టి పుట్టినదే. అయినప్పటికీ తెలుగులో తొలికాలంలో గద్యపద్య సమ్మిళితమైన చంపూకావ్యాలే వెలసినవి. యింకా నిర్వచనంగా కావ్యాలు రాయడం ఒక ఘనత కింద ఆ కాలంలో పరిగణింపబడింది. సంస్కృతంలో

కాదంబరి, దశకుమారచరిత వంటి గద్యకావ్యాలు వున్నా తెలుగులో ఆ దశకుమారచరిత్ర కూడా పద్యకావ్యంగా అనువదింపడబడింది. 'గద్యం కవీనాం నికషం వదంతి' అనే నానుడిని తెలుగుకవులు పాటించలేదేమో అనిపిస్తుంది. ఎంచేతనంటే విపులములయిన రాజవంశ వర్ణనలలోనో, పెద్దకథలని అల్లంతలో సంగ్రహించవలసి వచ్చినప్పుడో, పద్యానికి పద్యానికి, కథకు అతుకు అతక వలసి వచ్చినప్పుడో యెప్పుడో సకృత్తుగా తెలుగు కావ్యాల్లో వచనాన్ని ఒక సాధనంగా మాత్రమే తెలుగు కవులు వుపయోగించుకొన్నారు తప్ప తెలుగులో వచనరచన కూడా కవిత్వమే అని వారు భావించలేదు. గద్యం మీద మన కవులకు అటువంటి భావం వుండబట్టే యించుమించు పదునేడవ శతాబ్ది దాకా తెలుగులో నికరమయిన వచనకావ్యాలు అవతరించలేదు. అలాంటి దశలో యీ 'కృష్ణమాచార్య వచనములు' పదమూడవ శతాబ్దంలో రచించబడిన తొలివచన గ్రంథం కావడం ఒక విశేషం కాదా మరి! ఆనుపూర్వితో నొక కథావస్తువు లేకపోయినా వచనకావ్యాల కుండవలసిన లక్షణాలన్నీ యిందులో వుండక పోయినా, అతి ప్రాచీనకాలంలో అంటే పదునేడవ శతాబ్దికి పూర్వం తెలుగు ప్రత్యేకమయిన వచన కావ్యాలే లేవని అనుకునే దశలో అంతకింకా నాలుగువందల యేండ్లనాడు వెలసిన తొలి తెలుగు వచనరచన యిది కావడం దీనికొక విశిష్టత!

*వృత్తగంధి, తాళగంధి, చూర్ణిక అనే వచన విభేదాల్లో యిది చూర్ణిక అనే వచన విభేదానికి చెందిన రచన. తాళ్లపాక తిరువెంగళనాథుడు 'సంకీర్తన లక్షణం' అనే గ్రంథంలో–

**"ధర గృష్ణాచార్యాదిక**
**పరికల్పితపదము తాళబంధచ్ఛందో**
**విరహితమై చూర్ణాఖ్యం**
**బరగు ననిర్యుక్త నామభాసిత మగుచున్."**

* వచనవిభేదాలను గూర్చిన వివరములకు శ్రీవేంకటేశ్వరవచనముల పీఠిక చూచునది.



కృష్ణమాచార్యులు 'చాతుర్లక్ష సంకీర్తనములు' రచించినట్టుగానూ, వాటినంతా తాళ్లపాకవారి పదములు చెక్కింపబడినట్టుగానే రాగిరేకులపై చెక్కించినట్టుగానూ పాతవ్రాతలవల్ల మనకు తెలియవస్తూవున్నా ఆ రచనలన్నీ మనకు ఇప్పుడు దొరకడం లేదు. భిన్నములయిన ప్రతులలోని అన్ని వచనాలూ కలిపితే అంతా కొన్ని పదుల లెక్కకంటే మించవు. ఈ వచనాలకు 'సింహగిరి నరహరి వచనము'లనే పేరుకూడా వ్యవహారంలో వుంది. ఇందులోని ఒక్కొక్క వచనం కడపట 'సింహగిరి నరహరి' సంబోధన వుండడం వల్ల దీని కా పేరు కలిగిందనవచ్చు. మచ్చుకి ఒక్క వచనం–

'దేవా! పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడపంగనేమి, తొమ్మిదికోట్ల తులాభారంబులు తూగంగానేమి, యెనిమిదికోట్ల సువర్ణదానంబులు సేయంగానేమి, యేడుకోట్ల గోదానంబులు సేయంగానేమి, ఆరుకోట్ల భూదానంబులు సేయంగానేమి, అయిదుకోట్ల కన్యాదానంబులు సేయంగానేమి, నాలుగుకోట్ల వస్త్రదానంబులు సేయంగానేమి, మూడుకోట్ల సత్యాది వ్రతంబులు సేయంగానేమి, రెండుకోట్ల అన్నదానంబులు సేయంగానేమి, కోటిస్నానంబులు సేయంగానేమి, దేవా! మీ నామోచ్చారణంబు సేయక పదికోట్ల యజ్ఞాదిక్రతువులు నడపిన దేవేంద్రుడు నిలువల్లా యోనులయ్యెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక తొమ్మిదికోట్ల తులాభారంబులు తూగిన దుర్యోధనుండు యమపురి కేగెను. ఎనిమిది కోట్ల సువర్ణదానంబులు సేసిన కర్ణుండు పసిడి కొండమీద యన్నంబుల కపేక్షించెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక యేడుకోట్ల గోదానంబులు సేసిన కార్తవీర్యుండు గోహత్య బ్రహ్మహత్యపాతకంబుల బొందెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక యాఋకోట్ల భూదానంబులు సేసిన బలి విష్ణుపాదంబున పాతాళంబున కేగెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక అయిదుకోట్ల కన్యాదానంబులు సేసిన ధ్రువుండు కాశిక్షేత్రంబున పంద్రెండువేలయేండ్లు భిక్షంబెత్తెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక నాలుగుకోట్ల వస్త్రదానంబులు సేసిన మార్కండేయుండు మతిహీనుండయ్యెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక

మూడుకోట్ల సత్యాదివ్రతంబులు నడపించిన హరిశ్చంద్రుండు కులహీనుని యింట గాడుకాచెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక రెండుకోట్ల యన్నదానంబులు సేసిన ధర్మజుండు యమపురి తొంగిచూచెను. దేవా! మీ నామోచ్చారణంబు సేయక కోటిస్నానంబులు సేసిన కుమారస్వామి కోరిక సిద్ధించ దాయెను. దేవా! మీ నామోచ్చారణంబు సేసిన ప్రహ్లాద, నారద, పుండరీక, వ్యాస, శుక, శౌనక, భీష్మ, దాల్భ్య, రుక్మాంగద, అర్జున, బలి, విభీషణ, భృగు, గాంగేయ, అక్రూర, విదురాదులగు పరమభాగవతోత్తములు నారాయణ స్మరణవలన గృతార్థులైరి గావున యతి రామానుజముని పరందాతారు అనాథపతియైన సింహగిరి నరహరి నమోనమో దయానిధీ."

మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోనూ, తంజావూరు సరస్వతీమహలు లైబ్రరీలోనూ వున్న యీ వచనముల నొక క్రమంలో సేకరించి ప్రకటనమునకై సంస్కరించి వుంచినాను. తెలుగువాఙ్మయంలో వెలసిన తొలి వచనరచనము కావడమే దీనికున్న విశిష్టయోగ్యత! అలాంటి తొలి తెలుగు వచనరచన ప్రకటింపబడాలనే కతూహలమే నా పరిశ్రమకు కారణం.** విషయదృష్టితో, రచనాదృష్టితో దీనికున్న విలువ యెవరూ కాదనలేరు. ఈ వచనములకు కర్త అయిన కృష్ణమాచార్యులను గురించి ఆ ప్రతులలో యింకా రెండు కథలున్నాయి. అవి రుచియయిన వ్యావహారికభాషలో వ్రాయబడివున్నవి. కృష్ణమాచార్యుల మహిమాదికమును ఇవి పేర్కొంటున్నవి. ఆ ప్రతులలోని కథలను రెంటిని దిగువ ప్రకటిస్తున్నాను.

"*దేవా! శ్రీకృష్ణమాచార్యులు తిరుమణి తిరుచూర్ణంబులు ధరియించి యజ్ఞోపవీతంబులు దండెయు తాళంబులు వైఫనాదులు (?) ధరియించి యుదరమందు శ్రీతులసివనమాలికెలు ధరియించి తులదూగంగాను

* ఈ కథ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున R206 అను సంఖ్యతో నున్న ప్రతిలోనిది.

** ఈ గ్రంథరచయిత సింహగిరి వచనాలను సేకరించి ఉండినా అవి వారిద్వారా ప్రకటితం కాలేదు. (సంపాదకుడు).



యేకశిలానగరంబునకు వీధివెంట (విధేయంట?) సంకీర్తనలు పాడుచున్ను రాగాను, యొక కంసాలి భక్తుండు ముక్తింబొందిన యతనికైన సతి అతనివెంట సహగమనంబు శేయంబోవుచు కృష్ణమాచార్యుల బొడగని విమానంబు దిగివచ్చి తనకు పుణ్యలోకంబులు గలిగెనని గురుతు యెరింగి సాష్టాంగదండములు సమర్పించినను ఆ కాంతను కృష్ణమాచార్యులు పొడగని యేమనుచున్నాడు దేవా! ఆ కాంతకు పసుపుచీర, పసుపురవిక, వొడిబియ్యం, శాసకొప్పున పువ్వుల మాలికచుట్ట, యొకచేత పువ్వులబంతి, యొకచేత నిమ్మపండు పట్టుకొనియున్న కాంతను జూచి యీ కాంత సమర్త పెండ్లికూతురని భావించి దీర్ఘాయుష్మంతురాలవు గావె. బాలముత్తైదువతనము చేసి చల్లనికడుపున వర్ధిల్లవే పిన్నపాపా యని దీవించినను ఆ కాంత కిలకిల నవ్వుచు దేవా! తన కెక్కడి దీర్ఘాయుష్యంబు. తన కెక్కడి ముత్తైదువతనంబు. తన పెనిమిటి యిప్పుడు ముక్తింబొందినాడు, నిండుప్రాణంబులు తన పెనిమిటికి అర్పించబోవుచున్నదాన దేవ! నా కెక్కడి వరం బొసంగితిరి. మీ వాక్యములు కల్లలు గావచ్చును దేవా! మీరు పదునొకండవ యవతారుండవు గనుక అంటేను అప్పుడు కృష్ణమాచార్యులు పరమ దయార్ద్రుండై 'అయ్యాపురే సింహాద్రప్పలు! మా దాసుని వాక్యంబులు కల్లలు అయితేను మా శివభక్తులు హాస్యంబులు చేసెదరు. అదె నీకు భోగ్యంబు. దేవా! చాతుర్లక్ష గ్రంథసంకీర్తనలు శేయదేమిటికి? నీవు నా కేమిటికి? యీ ప్రాణంబులు నాకేమిటికి? అయినా వీరవైష్ణవుండగాన ఆ శవము కడకుంబోయి ఓరీ! యీ శవము యిక్కడ దించుండనిన ఓరి వెట్టిదాసరివాడా! సదాశివుని కొలువుకుం బోయిన ప్రాణములు బ్రహ్మాదుల వశమా తిరుగా పంపుమనేటందుకు? అన్నంతలో యోరీ! నేనెటువలె వెట్టిదాసరి వాడను. ఈశ్వరునిపేరిటి లింగమున్ను శ్రీమన్నారాయణుని పేరిటి సాలిగ్రామమున్ను రెండున్ను యొక్క సమముగా పూజింపనేరక యీశ్వరుండు చల్లగా యుండగాను యీశ్వరుని పేరిటి లింగమున్ను బొందిలోపెట్టుడి. పంచమహాపాతకులు మీరు గాన యోరి మీ కోసంకు ఈ శవము ప్రాణములు

రప్పించెదననిన యితండు  కంచి లోపలను బొందులు మొండెంబులకు తలలు పుట్టంబాడిన మహాత్ముండు గాడా యని ఆ శవమును భూమిపై దించి వారు కడకుం దొలంగిరి. అప్పుడు తన శ్రీపాదతీర్థంబు అతనిపై చిలికించి నుదుట తిరుమణి శ్రీచూర్ణంబులు ధరియించి చాతుర్లక్షగ్రంథ సంకీర్తనంబు యేకచిత్తంబున పరధ్యానము లేక సంకీర్తనలు శేయంగాను అక్కడ బ్రహ్మాదులకున్ను చిత్రగుప్తాదులకున్ను కఠోరంబులై తాకంగాను వారు విన వెరచి (?) హరుని కడకుంబోయి ఆ సదాశివునికి యేమని వందనంబు సేయుచున్నారు. దేవా! ఓ శ్రీజగద్భరితా! లోక రక్షక ఓసదృ....దయాపర, ఓ అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! యో పార్వతీమనోహర! ఓ రాజపరమేశ్వరా! కలియుంగంబులను యేకశిలానగరంబనియెడి యొక పట్టణంబు లోపలను యొక కంసాల భక్తుండు ముక్తింబొందిన అతనికైన కులాంగన అతని వెంట సహగమనంబు సేయంబోవుచున్న యెడ కృష్ణమాచార్యులవారి గని ఆ కాంత విమానంబు దిగివచ్చిన తనకు పుణ్యలోకంబు గలిగెననగా గురుతు యెరింగి......కృష్ణమాచార్యులు ఆ కాంత.....ని యేమనుచున్నాడు. దేవ! ఆ కాంతకు పసుపుచీర, పసుపురవిక, వొడిబియ్యం, శానకొప్పు శిరస్సున పువ్వుల వనమాలిక చుట్టి యొకచేత పువ్వుల బంతి, యొక చేతను నిమ్మపండు, పట్టుకొనియున్న కాంతను జూచి యీ కాంత సమర్త పెండ్లికూతురని భావించి దీర్ఘాయుష్మంతురాలవుగావె బాల ముత్తైదువతనము చేసి చల్లని కడుపు గలదానవుగాను వర్ధిల్లవె పిన్నపాపా యని దీవించి తన దీవెనలు తప్పరాదని చాతుర్లక్ష గ్రంథ సంకీర్తనలు పాడుతున్నాడు. అతనికి కాలమరణంబె కాని యకాలమరణంబు గాదు. అతని యాయుష్య పరిపూర్తియె కాని అర్ధాయుష్య దుర్మరణంబును పొందినవాడు గాడు.. మీ చిత్త మతని భాగ్యమని బ్రహ్మాదులున్ను, చిత్రగుప్తాదులున్ను కడకు దొలంగిరి. ఆ సదాశివుడు కంసాలభక్తునిం జూచి యేమనుచున్నాడు. దేవా! ఓయీ! కంసాలభక్తుండా! నీవు నాకు నిజభక్తుండవు. అతడు శ్రీమన్నారాయణునికి నిజదాసుండు ఇచ్చిన



యీవులు స్థిరములు. తాను యిచ్చిన యీవు లెట్లా అస్థిరములవుతున్నవి. ఆతండు వుండు మంటెను భూలోకంబున స్థిరగాలము యుండుము. అతడు పొమ్మంటెను శీఘ్రంబె వత్తువుగాని పొమ్మని యానతిచ్చినను ఆ సదాశివుని మాటకు ఆ కంసాలభక్తుండు యేమనుచున్నాడు. దేవా! ఓ శ్రీజగద్వరదా! ఓ లోకరక్షకా! ఓ సర్వజీవదయాపర! ఓ అఖిలాండకోటి బ్రహ్మాండనాయక! ఓ పార్వతీ మనోహర! ఓ రాజపరమేశ్వరా! నీవు దైవశిఖామణివి. నిన్ను గొలిచినందుకు ఆ దాసరి మాటలకు తిరుగా బొమ్మనిదె వుచితమా నీకు, ఆతండు కురుకుమారులను కురుక్షేత్రమందు పోట్ల దించిన దోషంబు వాయుకొఱకు కృష్ణమాచార్యుడై తిరు అవతరించినాడు. అతడు యేతన్మాత్రుండు. అతడు వుండకుంటేను భూలోకంబున స్థిరగాలంబు వుండుమీ అతండు పొమ్మనిన శీఘ్రంబె వత్తువు గాని పొమ్మని యానతిచ్చినను ఆ కంసాలిజీవుండు బొందిలో ప్రవేశించెను. దేవ! అప్పుడు కంసాల భక్తుండు లేచి కూర్చుండి కరములు ముకుళించి కృష్ణమాచార్యులకు సాష్టాంగ దండములు సమర్పించి యేమని విన్నపము సేయుచున్నాడు దేవా! ఓయి శ్రీకృష్ణమాచార్యులు నీవు ఆ నారాయణుండనుకొని కృష్ణమాచార్యులై తిరు అవతరించినాడవు. నీవు యే తన్మాత్రుడవు. అతండు వుండుమంటెను భూలోకంబున స్థిరగాలంబు యుండుము. అతడు పొమ్మని యానతిచ్చినను.....తనకు సకాల మరణమె కాని అకాలమరణంబు గాదు. తనకు ఆయుష్య పరిపూర్ణమె కాని యాయుష్య దుర్మరణంబు పొందినవాడగాను. నన్ను మన్నించి పంపవే మహాత్మ యనిన ఆ కంసాల భక్తుని మాటలకు కృష్ణమాచార్యులు యేమనుచున్నాడు. దేవా! ఓయీ కంసాల భక్తుండా! నీవు యీశ్వరునికి నిజభక్తుండవు. నేను శ్రీమన్నారాయణుని నిజదాసుండను. ఈశ్వరుండు నీ ప్రాణంబులు నాకు ధారా పూర్వకముగాను సమర్పించినాడు. నిన్ను నేను కైలాసంబునకు పోనియ్యను. నీవు నమ్మకుంటె నాకు యిచ్చిన వైకుంఠంబు యిచ్చెదననిన ఆ యీశ్వరుని కొలువు యేరీతి వుండును. అది నాకు యెఱిగింపుము. తన జీవుని కైలాసంబునకు తోడుక

పొయ్యేటప్పుడు యిద్దరు శివదూతలు యేతెంచి బంగారు విమానము మీద కూర్చుండబెట్టి మహరదాౖవిహత్వం (?) బనియెడి యా పర్వతంబుకడకు తోడుకుపోయినను ఆ పర్వతంబు యెనిమిది లక్షల యోజనంబుల పొడవు యెక్కపోతిని. దేవా! దానిమీద కోటియోజనంబుల విస్తారంబు గల్గి అటువంటి కైలాసగిరికి నూటయొక్క కోట గలదు. ఒక్కకోటకు నూటొక్క వాకిళులు గలవు. ఒక్కొక్క వాకిలికి నూటొక్క ద్వారపాలకులు గలరు, ఒక్కొక్క ద్వారపాలకునికి మిన్నేరు జడలున్ను, యెక్కువ కన్ను, కుత్తిక నలుపున్ను, క్రొన్నెలపువ్వు, చతుర్భుజంబుల త్రిశూల డమరగంబులును పట్టుకయున్న ద్వారపాలకులకు వందనంబులుచేసి ఆ మీదను ధర్మమడుగు గలదు. ఆ ధర్మమడుగునను తన్ను స్నానమాడించిరి. అంతలోనే తనకు మిన్నేరు జడలు పుట్టెను. ఎక్కువకన్ను కలిగెను. క్రొన్నెల పువ్వును, చతుర్భుజంబుల త్రిశూలడమరుగంబుల బట్టనిచ్చిరి. దేవా! తన్ను ఈశ్వరుని కొలువునకు తోడుక పొయ్యేటప్పుడు ఆ కొలువున ఛత్రచామరంబులు పట్టుకయున్న కోటికన్యకలు సేవకావృత్తి తిరుగుచున్నారు. ఉభయపార్శ్వంబుల సేవచేయుచున్నారు. రంభ, ఊర్వశి, మేనకాది కన్యలు నాట్యంబు లాడుచున్నారు. భృంగీశ్వరుండు తాండవమాడుచున్నాడు. నందీశ్వరుండు యుండెడు ఒక మండపము ముప్పదిలక్షల యోజనంబుల వెడల్పు నిడుపుంగల దానిమీదను పదిహేను జనంబులపొడవు, వక హేమంపు మణిక, దానిమీద యేడు యోజనంబుల వజ్రసింహాసనము, వజ్రసింహాసనము మీదను ఈశ్వరుండు పార్వతి గాని మరియెవ్వరున్ను కూర్చుండరాదు. గనుక అటువంటి కైలాసగిరి ముప్పది లక్షల సోమసూర్యవీధులు, మూడులక్షల శివాలయంబులు, రెండువేల దేవస్థానంబులు, అత్యంతవైభవ భోగంబులు, షోడశోపచారపూజలు సేయుచున్నారు. పురుషుండైన వాడు పదహారు వర్షంబులవాడును, స్త్రీలు పండ్రెండేళ్ల బాలకాంతలై వర్ధిల్లుచుండుదురు. అటువంటి కైలాసగిరి తనకువుండ వసతైయున్నది. నన్ను మన్నించి పంపవే మహాత్మకా యనిన పరమపదంబులో నిది మాత్రంబు లేదు.



నీవు నమ్మకుంటేను నాకు యిచ్చిన వైకుంఠంబు యిత్తును. ఆ బ్రహ్మదేమునిని, ఆ సదాశివుని, తన సింహాద్రప్పలును ఆనతిగం బాడుదును. దిగంబాడెనని చూచి అప్పుడు సింహాద్రప్పలు కోటి సూర్యప్రకాశంబైన దివ్యకిరీటంబు ధరియించి కృష్ణమాచార్యులు వందనంబు జేసి ఓ మహాత్మకా! యీ కంసాలభక్తుండు నన్ను నమ్మక యున్నాడని అంతలోనె బ్రహ్మదేవుండును, సదాశివుండును యేమనుచున్నారు దేవా! పరబ్రహ్మాదులకు లేని వైకుంఠంబు నీకు గలిగె. పరుసము సోకిన లోహము కాంచనమైనట్లు కృష్ణమాచార్యులు నిన్ను చేపట్టగానె కృతార్థుండవైతి వనిన సింహాద్రప్పలు యేమనుచున్నాడు దేవ! కృష్ణమాచార్యులకు యిచ్చిన వైకుంఠంబు నీకు యిద్దరికిన్ని యిచ్చితిగాన యని వైకుంఠంబు అభయమిచ్చెనె దా యీ సంకీర్తన శివభక్తులాయె నేమి, విష్ణదాసులాయె నేమి యెవ్వరు చదివిన యెవ్వరు భక్తితో విన్న, యెవ్వరు వ్రాసిన పాపపరిహారంబవును. అటుమీదట కామంత్యమందున వైకుంఠంబిత్తును. నీ యాన, నీ చరణంబు లాన, మా తిరుమణి తిరుచూర్ణంబు లాన. మా గురువు లాన, మా శ్రీకృష్ణకుమారస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!"

* * * *

* దేవా! కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతా గృహంబున కేగిన ఆ యింటి బ్రాహ్మణుండు దండ ప్రణామంబు జేసి 'స్వామీ! మీరు విజయంజేసుట నా గృహంబు పావనం బాయను. మేము కృతార్థులమైతిమి. మా యింట ఆరగించి మమ్ముల రక్షింపుమని విన్నపంబు జేసిన కృష్ణమాచార్యులు యేమనుచున్నారు. 'నీవు ఏకపత్నీ వ్రతుండవు. నిత్యానుసంధానసంపన్నుండవు. సకలగుణసంపదలు గలుగు ధన్యుండవు. బృందావనమునకు విజయం జేసిన పిమ్మట మీ యింట నారగించెద ననిన బ్రాహ్మణుండు తులసీమాహాత్మ్యం

* ఈ కథ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున R 447 అను సంఖ్యతో నున్న ప్రతిలోనిది.

చెప్పుమనిన ఆ బ్రాహ్మణునకు తులసీ మహత్వంబు యిట్ల చెప్పదొణంగె. నిశి సమయమందు తులసీ దర్శనం జేసినవారికి శిశుహత్య, గోహత్య, స్త్రీహత్య మొదలైన పాతకంబులు పోవును. తులసిని కంప అయినా కట్టి సంరక్షణ జేసినవారికి వేయి సంవత్సరంబులు సాయుజ్య పదంబులు గలుగును. తులసికి కోటవేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబు గలుగును. తులసికి దీపం యిచ్చినవారికి సూర్యచంద్రలోకంబులు గలుగును. తులసికి రాగి, వెండి, బంగారంబుల ప్రాకారంబులు దీర్చిన పుణ్యాత్ములకు శాశ్వతంబుగా విష్ణులోకంబు గలుగును. తులసికి నీరాజనంబు సమర్పించిన వార్కి బ్రహ్మలోకంబు గలుగును. తులసికోటకు గోమయంబులు దీర్చి అలికిన వారికి శత సంవత్సరంబులు స్వర్గంబు గలుగును. తులసికి నమస్కారంబు జేసినవారికి నాలుగులోకంబులు గలుగును. తులసికి నైవేద్యంబులు సమర్పించినవారికి కామ్యంబు గలుగును. నీళ్లుపోసి పెంచినవారికి జలబిందువు లెన్ని కలుగునో అన్ని సంవత్సరములు పుణ్యలోకంబులనుండి విష్ణుసాయుజ్యంబు పొందుదురు. నిత్యకృత్య నమస్కారంబు జేసి పూజలు జేసినవారికి వైకుంఠంబు గల్గును. తులసికి మంత్రపుష్పమున్ను యజ్ఞోపవీతమున్ను సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును. తులసికి వస్త్రములున్ను, మణులున్ను సమర్పించినవారికి స్వర్గలోకంబు గల్గును. తులసి యొద్ద ముగ్గులుంచినవారికి అగ్నిష్టోమఫలంబు గల్గును. తులసి మొదట అరుగు వేసినవారికి అష్టైశ్వర్యంబులు గలుగును. తులసి మొదట మృత్తిక ధరియించిన వారికి లలాటలోచనుని దర్శనంబు గలుగును. తులసిపూజలు అష్టాక్షరి ద్వాదశాక్షరీ జపంబు జేసిన పుణ్యాత్ములకు అష్టపుత్రులు గలుగును. ద్వాదశీదినంబున వైకుంఠము గాంతురు. తులసీదళంబుల శేషశాయి పూజ జేసినవార్కి శంకరలోకంబు గలుగును. తులసీ దళాన తీర్థపానం జేసినవార్కి సకలతీర్థంబులయందు గాంగాది నదులయందు స్నానంబు జేసిన ఫలంబు గలుగును. దేవా! తులసీదళంబు శిరస్సున ధరించినవారు త్రిలోకాలకు అధిపతులై



జన్మింతురు. ద్వాదశీదినంబున వ్రతంబు జేసిన వారు ద్వారకానగరంబున అధిపతులై జన్మింతురు. తులసీ బృందావనంబు అలికి ముగ్గుపెట్టి స్నానం సంధ్య జపములు దీర్చుకొని మంత్రపుష్పాంజలులు, ధూపదీపనైవేద్యంబులు సమర్పించినవారికి యింట నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ సంవత్సరాదులయందును సకలమైన భోగభాగ్యాదులు సంపదలు గలిగి శుభశోభనంబులు గలిగియుందురు. తులసి బృందావనానకు నారికేళ కదళి ఖర్జూర ఫలంబులు సమర్పించినవారికి కైలాస సన్నిధానంబు గలుగును. తులసి బృందావనమునకు దంపతి సమేతంగాను నూరుప్రదక్షిణంబులు జేసి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించినవారికి అనేక కాలాలయందున్ను సకలమైనసంపదలు గలిగి జన్మజన్మాలయందు ఉత్తమ కులంబులయందు జన్మింతురు. తులసి బృందావనమునకు భక్తిపూర్వకంబుగా యథాశక్తి తాంబూల నైవేద్యంబులు జేసినవారికి భూలోకంబు శిష్యపాలనంబు చేసి విష్ణుసన్నిధానంబు నొందుదురు. సాయంకాల సమయంబులయందు తులసికి దీపం యిచ్చిన స్త్రీలకు కోరిన కోరిక గలుగును. తులసి బృందావనంబునకు అలికి ముగ్గుదీర్చి ఆ సాయంకాలమందు ఆరతి యిచ్చిన స్త్రీలకు శాశ్వతంబుగా అయిదవతనంబు గలుగును. సంతానపూజ గలిగి సంతోషంబున నుందురు. దేవా! అంత్యమందు తులసి దళోదకం యిస్తే దేహం పవిత్రంబై సద్గతి గలుగును. దేవా! తులసీ మహత్యం పఠియించిన వారికి కొన్ని జన్మాదులు గడచిపోగాను శాశ్వతంబుగా కైలాస సన్నిధానంబు గలుగును. తులసి వనమందు వున్నదళం దెచ్చి శిరస్సున ధరించినవారికి త్వరితంబుగా ఆదిత్యపురంబు గలుగును. ప్రొద్దుననే లేచి తులసిదర్శనంబు జేసినవారికి పాపంబులు తొలగును. ఈ కథ కృష్ణమాచార్యులు సంకీర్తన శాయగా వకయింట నలువురు కోడళ్లు నీళ్లకడవలు తీసుకువస్తూ వుండినవేళ ఆ యింటి పెద్దకోడలు యీ సంకీర్తన విందామనెను. రెండో కోడలు పూర్ణ కడవలు దించుకొని విందామనెను. కడమ యిద్దరు కోడళ్లు యీ సంకీర్తన కేమి యీ మాటల కేమి పోదాము రమ్మనిరి. గనుక యీ

సంకీర్తన విందామన్న కోడలు భూమండలమేలే రాజు కొడుకై జన్మించెను. పూర్ణకుంభములు దించి విందామన్న కోడలు చక్రవర్తియై జన్మించెను. కడమ యిద్దరు యిక్కడ సంకీర్తన వినక పోదాము రమ్మన్న కోడళ్లు అనామీకులయింట నూరు జన్మంబులు పందులై జన్మించిరి. గనుక యీ దివ్య నామస్మరణ యెవరు వ్రాశినా, యెవరు చదివినా, యెవరు పఠించినా, యెవరు విన్నా, గోసహస్రదానంబులు చేసిన ఫలంబు గలుగును. పితృపితామహులు విష్ణుసాయుజ్యంబు గాంతురు. సకల దోషములున్ను, సర్వత్రా తాజేసిన పాపములున్ను నివారణమై ఆపదలు దొలగును. ఆయురారోగ్య ఐశ్వర్యంబులు గలుగును. పుత్రపౌత్రాభివృద్ధి గలుగును,"

*   *   *   *

**"ఏ సూరి రజకుని యింట మృతానుజు**
**నడపించె బితృకాననంబు దనుక**
**నా బ్రహ్మరుద్రులకైన గన్పడనట్టి**
**నృహరి నాడించెను నిత్యమెవ్వ**
**డెవని శాపమున సర్వేశుని గుడియైన**
**నేడహములు కాలె నేకరీతి".**

అలాంటి కృష్ణమాచార్యులు రచించిన యీ 'తెలుగువేదం' త్వరలో ప్రకటింపబడితే* అది తెలుగువాఙ్మయాని కొక విశిష్టాలంకారం అవుతుంది.

* దొరికిన కృష్ణమాచార్యుల వచనాలను ఎం. కులశేఖరరావుగారి పరిష్కరణ, పీఠికలతో ఆం.ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురించింది. దొరికినవి నూరులోపే. (సంపాదకుడు)

# 4. తాళ్లపాక అన్నమయ్య

సంకీర్తన కవులలో కృష్ణమాచార్యులకు తరువాత పేర్కొనదగినవారు తాళ్లపాకవారు. వీరి కవిత తెనాలి రామకృష్ణకవికి గూడ ప్రశంసాపాత్రమైనది.

**"చిన్నన్న ద్విపద కెఱగును**
**పన్నుగ బెదతిరుమలయ్య పదమున కెఱగున్**
**మిన్నంది మొఱసె నరసిం**
**గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్."**

ఈ పద్యము వీరికి పద్యగద్య పదరచనయందు గల సామర్థ్యమును చాటుచున్నది. 'తాళ్లపాక వారి కవిత్వము కొంత నా పైత్యము కొంత' అన్న సామెత వీరి కవిప్రతిభకు విజయకాహళము. క్రీ.శ. పదునారవ శతాబ్దములో శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామివారి దేవస్థానములో వీరి వంశీయులు నాలుగు తరములవారు సంకీర్తనాచార్యులుగ వెలసిరి. వీరు నందవరీక స్మార్తబ్రాహ్మణులు. భారద్వాజగోత్రులు.

కడపమండలములో రాజంపేట తాలూకాలోని 'తాళ్లపాక' లో వీరి పూర్వులు నివసించుచుండిరి. తాళ్లపాక కవులలో తొలివాడగు తాళ్లపాక అన్నమయ్య బాల్యముననే 'తాళ్లపాక' వదలి తిరుపతిలో స్థిరనివాస మేర్పరచుకొనిరి. తిరుపతి చేరిన పిమ్మట వీరు వైష్ణవమతమును స్వీకరించి ముద్రాధారణాదిక మొనర్చుకొనిరి. అప్పటినుండి 'అన్నమయ్య' అన్నమయ్యంగారు లేక అన్నమాచార్యులు అయ్యెను. వీరు తమ పదునారవ యేటనుండి శ్రీస్వామివారి దేవస్థానములో శ్రీస్వామివారి సన్నిధిని దినమున కొక సంకీర్తనమునకు తక్కువకాని చొప్పున సంకీర్తనముల రచించి కీర్తించుచుండిరి. వీరిట్లు సుమారు ఎనుబదియేండ్లు అవిచ్ఛిన్నముగ శ్రీస్వామివారి సమక్షమున సంకీర్తనాగానము చేయుచుండిరి. వీరి శృంగార సంకీర్తనములకు తొలుత ఉన్న ఈ గద్య చూడుడు–

'స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు 1346 అను నేటి క్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదాఱు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు 1424 అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ 12 నిరుధానకు (తిరోధానానకు?) తిరువేంగళనాథుని మీదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగారసంకీర్తనలు"–

అన్నమాచార్యులు క్రీ.శ.1408 నుండి క్రీ.శ.1503 దాక శ్రీస్వామివారి దేవస్థానములో సంకీర్తనాచార్యులుగ నుండిరి*. క్రీ.శ. 1503 నుండియే యితని కుమారుడగు తిరుమలాచార్యుడు తన తండ్రి యాజ్ఞమేరకు స్వామివారి కంకితముగా సంకీర్తనములు రచించుచు వచ్చెను. కావున అన్నమాచార్యులవారు క్రీ.శ. 1503 లో నిర్యాణము చెందినట్లు ఊహింపదగును. తిరుమలాచార్యుల శృంగార సంకీర్తనములకు తొలుతనున్న యీ గద్య చూడుడు–

"శాలివాహన శకవర్షంబులు 1424 అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ 12 మొదలు గాను తాళ్లపాక అన్నమాచార్యులుంగారు తమ కొమారుండు తిరుమలాచార్యులను దినమొక సంకీర్తన శ్రీవేంకటేశ్వరునకు అంకితం చేశి చెప్పు మనంగాను విన్నపము శేశిన సంకీర్తనలు".

అన్నమాచార్యులు సంగీతసాహిత్యములయందసమాన పాండిత్యము గలిగియుండిరి. సంకీర్తనలక్షణముల నిర్వచించుచు వీరు 'సంకీర్తన' మని సంస్కృతమున నొక లక్షణ గ్రంథమును విరచించిరి. 'సంకీర్తన లక్షణకర్త యగుటచేతను, సంకీర్తనా రచనమున వీరికందపూర్వమైన నిర్మితి సామర్థ్యముండుటచేతను వీరు సంకీర్తనాచార్య' లని విఖ్యాతి బడసిరి. ద్రావిడాగమమగు నాలాయిర దివ్యప్రబంధమును వీరు సాంగోపాంగముగా

* అన్నమాచార్యులవారు జీవించిన కాలం 1408–1503. 1408 నుండే దేవస్థానంలో సంకీర్తనాచార్యుడుగా ఉన్నాడని చెప్పడం సరికాదు. (సంపాదకుడు)



అధ్యయనము చేసిరి. అందుచేతనే వీరు 'ద్రావిడాగమ సార్వభౌము' లని, 'పంచాగమచక్రవర్తి' అని బిరుదముల నందిరి.

వీరి మనుమడు చిన తిరుమలాచార్యుడు* (చిన్నన్న) యీతని చరిత్రమును ద్విపదలో రచించినాడు. అందు అన్నమాచార్యుల మహిమాదికము లెన్నో అభివర్ణింపబడినవి. తెలుగు కవులను గూర్చి ఇతరులు రచించినవి గాని, తమకు తామే రచించుకొన్నవి గాని చరిత్రములు తెలుగులో అరుదనియే చెప్పవచ్చును. 'అన్నమాచార్య చరిత్రము' అట్టి చరిత్రములలో ప్రథమ గణనీయమైన గ్రంథము. అందు ప్రఖ్యాత వాగ్గేయకారకుడు, కర్ణాటక సంగీతమునకు మూలపురుషుడునగు పురందరదాసులవారితో అన్నమాచార్యులకు మైత్రి కలిగి యుండినటుల పేర్కొనబడినది. అన్నమాచార్యుల సంకీర్తనములను, పురందరదాస కీర్తనములను జాగ్రత్తగా పరిశీలింపవలసి యున్నది. అట్టి నిశితపరిశీలనము జరగినయెడల వారి సంకీర్తనములలో, భావములలో సామ్యములు, ఇక ఎన్నో చరిత్ర సంప్రదాయ రచనాదులకు సంబంధించిన విశేషములు వెల్లడి కాగలవు. అప్పుడు కర్ణాటక సంగీతమునకు పురందరదాసు వలెనే అన్నమాచార్యులు కూడ ఎట్టి గట్టి పునాదులు వేసెనో తెలియగలదు.

అన్నమాచార్యులవారు సంస్కృతమున సంకీర్తన లక్షణమును, తెలుగున శృంగారసంకీర్తనములు, అధ్యాత్మసంకీర్తనములు, శృంగారమంజరి, శృంగార వృత్త పద్యాల శతకము (వేంకటేశ శతకము) లను రచించిరి. అందు, శృంగార సంకీర్తనములలో శ్రీవేంకటేశ్వరస్వామి నాయకుడు. కవి నాయిక. నాయికా నాయకుల శృంగారావస్థలు చిత్రచిత్ర వర్ణనలతో చమత్కారములతో అలరారుచున్నవి. అధ్యాత్మ సంకీర్తనములు భక్తిప్రధానముగా రచింపబడినవి.

* చినతిరుమలాచార్యుడు చిన్నన్నకాదు. చినతిరుమలాచార్యుడు అన్నమాచార్యచరిత్ర రాయలేదు. అన్నమాచార్యచరిత్ర కర్త చిన్నన్న. (సంపాదకుడు)

'కంసాంతక వేంకటగిరిపతేః ప్రశంసైవ పశ్చాదిహ నాస్తి'- త్రిదశ వంద్యుడగు తిరువేంకటపతి, వెదకి వెదకి సేవించుడి'- అన్న సందేశమును, జీవన పరమార్థమును ఆధ్యాత్మిక సంకీర్తనములు సంసార విషయలంపటులగు భక్తులకు బోధించుటకు ఉద్దేశింపబడినాయి. వీరి సంస్కృత సంకీర్తన లక్షణము కానరాలేదు.

అన్నమాచార్యుల సంకీర్తనములు, అతనివే కాక తాళ్లపాకవారి సంకీర్తనములన్నియు సంగీతమున, సాహిత్యమున సమాన ప్రాతినిధ్యము గలిగి అసమానమై వెలుగొందుచుండును. ఇక సాహిత్యదృష్టితో మాత్రము చూచిన వీరి రచనలు వెలలేని విలువరాళ్ళు. అపూర్వములయిన ప్రాచీన కవిప్రయోగముల నెన్నిటినో వీరు పుణికిపుచ్చుకొని తమ రచనముల కుదురు కొలిపిరి. ప్రాచీన కావ్యములను మిక్కిలి అక్కరతో శోధించి యందలి అపూర్వ పదజాలమును తమ రచనముల వెలయజేసి సాహిత్య విషయమునను తమ సంకీర్తనముల పుష్టి పరచుకొన్నారు. అందుచేతనే వారి సంకీర్తనములు, వారి రచనములు నేడు మిక్కిలిగా ఆదరింపబడుచున్నవి. చినతిరుమలాచార్యుడు తాను రచించిన 'అష్టభాషా దండకము' లోని గద్యలో అన్నమాచార్యులవారి పలుకులు సరస్వతీ వీణాలాపములవలె మధురములు, హృదయంగమములు, శ్రావ్యములు అని ప్రశంసించినాడు.

ఇటీవల అన్నమాచార్యుల శృంగారసంకీర్తనములు కొన్ని ప్రకటితము అయినవి.* అందలి యీ సంకీర్తనముల చిత్తగింపుడు.

పాలకురికి సోమనాథుడు పేర్కొనిన తుమ్మెద పదముల రచనవంటి రచన యిది. శ్రీ వేంకటేశ్వరుని తుమ్మెదగా సంబోధించి కీర్తించినది-

**శ్రీరాగం-ఏకతాళం**

**తొల్లిటివలెఁ గావు తుమ్మెదా యింక**
**నొల్లవుగా మమ్ము నో తుమ్మెదా**

* దొరికిన అన్నమాచార్యుల సంకీర్తనలలో శృంగార సంకీర్తనలే ఎక్కువగా ఉన్నాయి. అధ్యాత్మ సంకీర్తనలతోపాటు శృంగార సంకీర్తనలన్నిటిని తి.తి.దే ప్రచురించింది.



**తోరంపు రచనల తుమ్మెదా కడుఁ**
**దూరేవు గొందులే తుమ్మెదా**
**దూరిన వెఱుఁగవు తుమ్మెదా మమ్ము**
**నోరగాఁ జూడకు వో వో తుమ్మెదా**

**తొలుప్రాయపు మింద తుమ్మెదా కడుఁ**
**దొలిచేవు చేఁగలే తుమ్మెదా**
**తొలుకరి మెఱుఁగవే తుమ్మెదా యింక**
**నులికేవు మముగని వో వో తుమ్మెదా**

**దొరవు వేంకటగిరి తుమ్మెదా మా**
**తురుమేల చెనకేవు తుమ్మెదా**
**దొరకె నీ చనవులు తుమ్మెదా యింక**
**నొరు లెఱింగిరి గదవో వో తుమ్మెదా.**

శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిని ప్రాతఃకాలమున పాడిన మేలుకొలుపు పాట యిది.

**భూపాలం-**

**విన్నపాలు వినవలె వింత వింతలు**
**పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా**

**తెల్లవారె జామెక్కె దేవతలు మునులు**
**అల్ల నల్ల నంత నింత నదివో వారె**
**చల్లని తమ్మిరేకుల సారస్యపుఁగన్నులు**
**మెల్లమెల్లనె విచ్చి మేలుకొన వేలయ్యా**

**గరుడ కిన్నర యక్ష కామినులు గములై**
**విరహపు గీతముల వింతతాళాల**

పరిపరివిధములం బాడేరు రాగాల నిన్నదివో
సిరి మొగము దెఱచి చిత్తగించ వేలయ్యా

పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజభవాదులు నీ పాదాలు చేరి
అంకెల నున్నారు వేచి అలమేలుమంగను
వెంకటేశుడా రెప్పలు విచ్చి చూచి రావయ్యా,

స్వామివారికి నివేదన సమయమున చేసిన సంకీర్తన మిది-

**కాంభోజి**

ఆరగింపవో మాయప్ప యివే
పేరిన నేతులు పెరుగులును
తేనెలు జున్నులు తెంకాయపాలును
ఆనవాలు వెన్నట్లును
నూనె బూరెలును నురుగులు వడలును
పానకములు బహుఫలములును

పరమాన్నంబులు పంచదారలును
అరిసెలు గారెలు నవుగులును
కరజికాయలును ఖండమండెగలు
పరిపరి విధముల భక్ష్యములు

కడు మధురంబగు కమ్మఁ బూరణపుఁ
గుడుములు నిడ్డెనకుడుములును
సుడిగొను నప్పాలు సుకినప్పాలును
పొడిబెల్లముతోఁ బొరటుచును

కాయపురుచులకు గని యగు మిరియపుఁ
గాయలు నేలకికాయలును



పాయరాని యంబాళపుఁ గాయలు
నాయతమగు దధ్యన్నములు

ఒడికపుఁ గూరలు నొలుపుఁ బప్పులును
అడియాలపు రాజాన్నములు
బడి బడిఁ గనకపుఁ బళ్లెరములతోఁ
గడు వేడుక వేంకటరమణా.

ప్రబంధ రత్నావళిలో తాళ్లపాక అన్నమయ్య శతకము లోనిదని పేర్కొనబడిన 'అరిసెలు నూనె బూరెలును నౌగులు చక్కెర మండెగల్' ఇత్యాది పద్యము పై సంకీర్తనముతో సంవదించుచున్నది.

పవ్వళింపుసేవ యప్పుడో లేక "ఊంజల్" ఉత్సవ సందర్భముననో చేసిన సంకీర్తన మయి ఉండును- ఈ సంకీర్తనము జూడుడు.

**శంకరాభరణము**

గుఱు తెఱఁగిన దొంగ కూగూగు వీఁడె
గుడిలోనె దాగేని కూగూగు
నెలఁతల దోఁచేని నీళ్లాడఁగానే
కొలని దరిని దొంగ కూగూగు

చల్ల లమ్మంగ చనుకట్టు దొడికేని
గొల్లెతలను దొంగ కూగూగు
ఇల్లిల్లు దప్పక యిందరి పాలిండ్లు
కొల్ల లాడిన దొంగ కూగూగు

తావు కొన్న దొంగఁ దవిలి పట్టుండిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీ వేంకటగిరి చెలువుండో యేమొ
కోవిదుఁడగు దొంగ కూగూగు.

సంకీర్తనము శృంగార విషయకమే అయినను ఒక్కొక్కచోట అది నిగూఢార్థ ప్రతిపాదకమయి దుర్భేద్యముగా ఉండును. ఈ సంకీర్తనము చూడుడు:–

**మనములోని విభుఁడు మఱవఁ డేకాలంబు**
**నినుఁ గలయ నున్నాఁడు నీ కేలె వెఱవ**
**నెలనాళ్ల వాఁడొకఁడు నిర్మలంబైన వె**
**న్నెలల వాఁడొకఁడు మూన్నెలల వాడొకఁడు**
**నెలలు పంద్రెండైన నిజబాలుఁ డొక్కండు**
**నెలఁత యింతటి పనికె నీ కేలె వెఱవ**

**ప్రొద్దుపొడుపులదొకటి ప్రొద్దుగ్రుంకులదొకటి**
**ప్రొద్దువొద్దులకు రహి పొయ్యేటి దొకటి**
**పొద్దెతింగిన దొకటి పొద్దెఱుంగని దొకటి**
**నిద్దంపుఁ బువ్వులకు నీ కేలె వెఱవ**

**నిండుఁ జంచల మొకటి నిమిషమాత్రము దొకటి**
**వుండినట్లనెవుండి వుడివోవు నొకటి**
**కొండలలో నెలకొన్న కోనేటిరాయఁడు నీ**
**నిండుఁ గౌగిటి ఁ గూడె నీ కేలె వెఱవ.**

ఈ సంకీర్తనములోని చరణముల భావము స్పష్టముగా, సంపూర్ణముగా ఎరుక కందలేదు. వీరి సంకీర్తనములు సంగీత సాహిత్యములకు వాఙ్మయపుష్టి నొసగుటయే గాక ఇది రాగిరేకులపై వారి కాలముననే చెక్కింపబడుటచే ఆనాటి లిపి సంప్రదాయ రీతి భేదముల నెరుగుటకు దర్పణమువలె నుపకరించును. వారి సహాయమున ఆనాటి లిపి సంప్రదాయ చరిత్రమును విస్పష్ట పరిజ్ఞానముతో ఎరుగవచ్చును.

# 5. అన్నమయ్య జోల

తాళ్లపాకవారి కవిత తామ్రఫలకములలోనే ఉండి తలుపుచాటున దాగి ఉండలేదు. ముగ్ధమోహనముగా సింగారించుకొని అక్షర సుందరమై అలరారుచు దేశి సుమముల గొప్పు ముడిచి మేని మెరుగుల మేలి ముసుగు మిసిమివెలార్పగా తెలుగు తెరువుల ఒయ్యారముగా నడక సాగించినది. మూర్తిమంతమైన ఈ ముగ్ధసౌందర్యమునకు త్రిలింగములోని ముక్కోటి ప్రజానీకము మురిసిపోయినది. తెలుగు పలుకు నెలత ఈ తీరు తీయముల నలవరచుకొని తన నిలయమును కలకల నాడించినది.

అన్నమయ్య జోల అడుగడుగు దండాలవానినే కాదు. యావదాంధ్రమును ఉయ్యెల లూచి జోకొట్టి నిద్ర పుచ్చినది. తెలుగు నెలతలు ఈ జోల పాడి తమ బిడ్డల మురిపించి యేడుపుడిపి సుఖ శయిదల జేసినారు. తెలుగు సిసువు లీ జోల నాలకించి మైమరచి మిన్నులలో విహరించినారు.

**జో అచ్యుతానంద జో జో ముకుంద**
**రావె పరమానంద రామగోవింద. ॥జో.॥**

ఈ పల్లవితోడి జోలపాటను మన తెలుగు లోగిళ్లలో నేటికిని వినుచుందుము. తెలుగు నెలతల నోళులతో నిపజీవితమై ఇది నాటికిని, నేటికిని, సాక్షరముగా జాలువారుచున్నది. అమృతానందము చేకూర్చుచున్నది. చేకూర్చుకొనుచున్నది. వారి పరిపోషణమే లేకున్నచో నిది యేనాడో అడగారి ఉండెడిది. ఈ జోల పాడుట విని అవ్యయానంద మనుభవించుటే కాని ఈ రచన మెవరిదన్న జిజ్ఞాస నేటి దనుక ఏరికిని కలుగ లేదు. ఇందరి నోళ్లలో పడి నలుగుచున్నను ఈ రచనము అన్నమయ్య దనుట నేటికి నెవరికి తెలియకుండుట నిజముగా అచ్చెరువు కలిగింపగలదు! ఇది అడగారి పోకుండ తమమోము వాకిళుల నెలకొలిపి నిలిపిన తెలుగు నెలతలకు జోహారులు.

శ్రీ విస్సా అప్పారావు పంతులుగారి మాతామహులు తమ సొంతమునకై వ్రాసి ఉంచుకొనిన పాటలను పరిశీలించుచుండగా శ్రీ పంతులుగారి కిది

అదాటున దొరికినది. ఈ రచనము అన్నమయ్య దగుట గురుతించి పరమానంద భరితులై వారు ఈ జోలను శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి వినిపించిరి. శ్రీశాస్త్రిగారివలన దీని ఉనికి ఎరిగి శ్రీపంతులుగారి కడనుండి దీని ప్రతి వ్రాసి తెచ్చుకొని వారి అనుమతిపై ఇది ప్రకటించుచున్నాను. వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

**? రాగం-అటతాళం**

జో అచ్యుతానంద జోజో ముకుంద
రారా పరమానంద రామ గోవింద జో.

నందు నింటను జేరి నయము మీఅంగ
చంద్రవదనలు నీకు సేవచేయంగ
నందముగ వారిండ్ల నాడుచుండంగ
మంద పాకు దొంగ మా ముద్దురంగ

పాల వారాశిలో పవళించినావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవు కుదయించినావు
బాలుడై యుండి గోపాలుడైనావు

అట్టు గట్టిన మీగ డట్టె తిన్నాడె
పట్టి కోడలు మూతిపై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా 'నిదిదొంగ, కొట్టు' మన్నాడే

గొల్ల వారిండ్లకును గొబ్బునను బోయి
కొల్లలుగా ద్రావి కుండలను నేయి
చెల్లునా మగనాండ్ర జెలగి యాశా! యా
చిల్లతనములు సేయ జెల్లునట వోయి!



రేపల్లె సతులెల్ల గోపంబుతోను
'గోపమ్మ మీకొడుకు మా యింద్లలోను
మాపుగానే వచ్చి మా మానములను
నీ పాపడే చెఱిచె నే మందు మమ్మ!'

ఒకని యాలిని దెచ్చి నొకని కడబెట్టి
జగడములు గలిపించి సతిపతుల బట్టి
పగలు నలు జాములును బాలుడైనట్టి
మగనాండ్ర జేపట్టి మదనుడైనట్టి

అంగజుని గన్న మా యన్న యిటు రారా
బంగారు గిన్నెలో బాలు పోసేరా
దొంగ నీవని సతులు పొంగుచున్నారు
ముంగిట నాడరా మోహనాకారా!

గోవర్ధనంబెల్ల గొడుగుగా బట్టి
కావరంబున నున్న కంసు పడగొట్టి
నేడు మిథిలాపురము నేల జేపట్టి
ఠీవితో నేలిన దేవకిపట్టి!

అంగముగ దాళ్ళపాకాన్నయ్య చాల
శృంగార రచనగా జెప్పె నీ జోల
సంగతిగ సకల సంపదలు నీ వేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల!

సాహిత్యాలంకారముల జంజాటమునుండి చేయిగాళుల విదిలించుకొని ఇతని కవితాకన్య దేశి సొగసుల జేసికొని ఈ రచనలో సహజసుందరమై ఒప్పారుచున్నది. అన్నమయ్య శృంగారాధ్యాత్మ సంకీర్తనాది ఇతర రచనములను జూచి దీనిని జూచిన యెడల రెంటికి గల భేదము సుస్పష్టముగా గోచరించును.

సాహిత్యపు బలుపు లేనందుననే యిది సరళమై, సుందరమై అందరి హృదయముల నవలీలగా చూరగొనినది.

ఈ జోల బహుశః అన్నమాచార్యుల కాలమునందు శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానములో ఆనాడు భాగవతులలో బహుళ ప్రచారములో నుండిన 'అన్న ఊంజల్ తిరునాళ్ల' (హంసడోలోత్సవ) సందర్భమున అన్నమాచార్యులు శ్రీ స్వామివారిపై పాడినదై ఉండవచ్చును. సాళువ నరసింహరాయలవారు క్రీ.శ. 1473 విజయ లో ఈ డోలోత్సవమును తిరుమల దేవస్థానములో తొలిసారిగా జరిపిరి. అప్పటినుండి ప్రతివర్షము అది ఒక సంప్రదాయము క్రింద పరిణమించినది. ఈ డోలోత్సవము ప్రతివర్షమును తమిళమాసము చిత్ర శుక్ల షష్ఠినాడు ప్రారంభమై యేడుదినములు జరుగును. ప్రారంభ దివసమునకు పూర్వదినము రాత్రి అంకురార్పణము జరుగును. ఆ ఉత్సవదినములో శ్రీస్వామివారికి ప్రత్యేక కైంకర్యములు మహావైభవముతో జరుగును. ఈ వెచ్చములకై శ్రీసాళువ నరసింహరాయలవారు కలవాయి పర్రులోని దొమ్మరపట్టి అను గ్రామమును కూడ శ్రీస్వామివారికి సమర్పించిరట!

ఈ డోలోత్సవమిట్లు ప్రత్యేక దివసములలో ప్రధానోత్సవముగా మాత్రమే గాక బ్రహ్మోత్సవ దినములలో కడపటినాడును, మకరసంక్రమణ దినమునను జరుపునటుల సాళువ నరసింహరాయల వారే యేర్పరచిరి.

ఈ డోలోత్సవము సాళువనరసింహరాయల కాలములోనే తొలిసారిగా ప్రారంభింపబడుటచేతను, వారి కాలములోనే అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దేవస్థానములో సంకీర్తనాచార్యులుగ వెలయుచుండుటను ఈ జోల తదుత్సవ ప్రారంభ దినములలో పాడియుండ వచ్చునని యూహింపవచ్చును. సాళువ నరసింహరాయల వారిచే నూతనముగా ప్రారంభింపబడు ఈ డోలోత్సవ విషయము విని దేశము నాలుగుమూలలనుండి భాగవతులనేకులు విచ్చేసి తత్సందర్భమున అన్నమయ్య పాడిన ఈ జోలను విని పరవశులై తదాస్వాదమును జీవితమెల్ల ననుభవింప గోరి వారీ పాట నేర్చుకొని యుందురు.



తెలుగు నెలత లీ జోలను అనుదినము తమ నిసుగుల నిద్రపుచ్చుటకు పాడుచు దాని కమృతత్వమును ప్రసాదించియుందురు. ఈ పాట బహుళప్రచారము గాంచిన విధ మిదియే యై ఉండునని ఊహించుచున్నాడను.

అచ్యుతదేవరాయల కాలములో తాళ్ళపాకవారి కొన్ని గ్రామములు సర్వమాన్యములుగా చెల్లుచుండినవి. మెకంజీదొరగారు సేకరించిన లోకల్ రికార్డులలో ఇట్లు కలదు.

'నృసింహ్వారాయల కుమారుడు అచ్యుతదేవ మహారాయలు విజయనగర మందు వజ్రసింహ్వాసనారూఢుండై పృథివి సామ్రాజ్యం శెయుచుండగా కామలాపురం తాలూకాలో బ్రాహ్మల్కు యిచ్చిన అగ్రహారం లున్ను, వారి వారి నాయంకరాన్కు యిచ్చిన వివరం.

1. కామలాపురంన్కు దక్షిణం నాల్గు పరువుల దూరమున మాచనూరు గ్రామము.
2. యీ గ్రామాన్కి పడమర పరువు దూరమున పూర్వం ప్రౌఢదేవరాయల నాడు అల్లిదొన అగ్రహారికులకు యిచ్చిన పెంటపల్లి గ్రామం.
3. యిందుక్కు నైరుతి ౧ దూరమున తుంమ్మలూరు గ్రామం.
4. యిందుక్కు వుత్తరం పొడదుర్తి గ్రామం.
5. దువూరు తాలూకు కామనూరు గ్రామం.
6. చిటివెల తాలూకు తంగటూరు.

ఈ ఆరు గ్రామములుంన్ను తాళ్ళపాకవారికి సర్వమాన్యంగా నడుస్తు వుండెనని ఆ గ్రామస్థులు వాడుతు వున్నారు. గాని శిలాశాసనముల రుజువు అగపడలేదు. యీ తాళ్ళపాకవారు కవిశ్వర్లు బహుప్రఖ్యాతిగా జనులు వాడుకొనెది కలదు.'- తాళ్ళపాకవారి కానాడు ప్రజావర్గములో ఎట్టి పలుకుబడి ఉండెడిదో లోకలు రికార్డులలోని పై జనవాక్యమును బట్టి ఊహింపగలము.

తాళ్ళపాక అన్నమయ్య కుమారుడు పెదతిరుమలాచార్యుడు అచ్యుత దేవరాయలవారి జీవితకాలములో సంకీర్తనాచార్యుడుగ వెలయుచుండిన వాడగుటచే ఈ గ్రామములు కూడ నచ్యుతదేవరాయల వారిచే అతనికే ఒసగబడి ఉండవచ్చునని ఊహించుట సత్యదూరము కాజాలదు.

దేవస్థాన శాసన సంచయములో అచ్యుతదేవరాయలు పూండి, సంగమకోట అను గ్రామములను పెదతిరుమలాచార్యునకు తామ్రశాసనము చేసి ఒసగినట్లును, అతడు తనకు సర్వ మాన్యములుగా చెల్లుచుండిన యీ గ్రామములను క్రీ.శ. 1532 సం॥లో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి సమర్పించినట్లును పేర్కొనబడినది. కాని ఈ గ్రామముల ప్రసక్తి అందు గానరాలేదు. శాసనదృష్టాంతములు కానరాకున్నను లోకలు రికార్డులలోని జనవాక్యమును బట్టి తాళ్ళపాకవారికి ఆ యూరు గ్రామములును అచ్యుతదేవరాయలు ఒసగినట్లును అవి వారికి సర్వ మాన్యములుగా చెల్లుచుండినట్లును విశ్వసింపవలసియున్నది.

అన్నమయ్య రచనములు–ఇతనివే కావు–తాళ్ళపాకవారి రచనము లెల్ల సాహిత్యప్రాధాన్యము గలిగి వెలయుచున్నవి. తిరుపతి ప్రాచ్యవిద్యా పరిశోధనాలయాధ్యక్షులు తమ కడ నున్న తాళ్ళపాకవారి రచనముల నెల్ల వెలువరిచి నిజమైన శ్రద్ధ వహింపవలసియున్నది. ఇటువంటి గొప్ప గొప్ప సంస్థలు పుస్తక ప్రకటనమును వ్యాపారదృష్టితో గాక సేవాదృష్టితో లక్షింపవలసియున్నది. తెలుగువారైయుండి తెలుగుపరిశోధన విషయమున వారే ఇట్టి వైఖరితో నుండుట నిజముగా అనుశోచనీయము. తెలుగువారము మనము. లేని అవకాశములు లేకపోగా ఉన్న అవకాశములను గూడ సవ్యముగా వినియోగించు కొనలేక పోయిన యెడల ఇక చెప్పెడి దేమున్నది? ప్రాచీనకావ్య సముద్ధరణము గావించుకొని పరిశోధనమున ఇతర భాషలు ముందంజ వేయుచుండ మనము ఆకుచాటు పిందెల వలె మరగియుండి గుడుగుడుగుంచము లాడవలసినదేనా? ఒక సంవత్సరమునకు పూర్వ మెప్పుడో



ముద్రితమై గ్రంథము వెలువడగా అన్నమాచార్యుల శృంగారసంకీర్తనములు అను గ్రంథము ఇటీవలనే వెలువడిన మరొక గ్రంథముతో భారతికి గత మాసము విమర్శనార్థము పంపబడుట శ్రీప్రాచ్యవిద్యా పరిశోధనాలయాధ్యక్షులకు తెలుగు పరిశోధనముపై శ్రద్ధలేమి, వైముఖ్యములకు నిదర్శనము కాదా! తాళ్ళపాకవారి రచనముల ప్రకటనము కొంతకాలము నిలిపియుంపబడినదని వినుటచే ఇంతదూరము వ్రాయవలసి వచ్చినది*. మనసుండవలెను గాని, రాజుదలచుకొన్న దెబ్బలకు కొదవా? సమర్థులు, పరిశోధనమున పరినిష్ఠిత ప్రజ్ఞాధురీణులు తెలుగు పరిశోధనశాఖలో ఉండగా వారిని సంపూర్ణముగా వినియోగించుకొని వారిచే ఎంతగానైనను పరిశ్రమ చేయించి పుస్తకముల ప్రకటింప జేయవచ్చును. అట్లు చేసినవారు సాహిత్య ప్రపంచమునకు ఎంతేని సేవ చేసిన వారగుదురు. తాళ్ళపాకవారి రచనములనెల్ల పరిష్కరింపించి వెలువరిచిన సహృదయ సాహిత్య ప్రపంచ మెంతేని వారికి కృతజ్ఞము కాగలదు. లేకున్న ఆంధ్రప్రజానీకమునకు వారు నేడు కాకున్న ఏనాటికైనను సమాధానము చెప్పవలసియుండును. దేవస్థానాధికారులును తాళ్ళపాకవారి రచనముల ప్రకటనము నెడ ఇతోధికముగా శ్రద్ధచూపి అవి త్వరలో వెలువరుచు మార్గముల నరయుదురుగాక! ఏతత్కావ్య ప్రకటన నిర్వహణమున వారప్రమత్తులై యుందురుగాక!

* రచయిత ఈ గ్రంథం రాసేనాటికి పరిస్థితి అలా ఉండి ఉండవచ్చు. తరువాత తరువాత తాళ్లపాకవారి రచనలు దొరికినంతవరకు ముద్రితమైనాయి. అన్నమయ్య పెద, చిన తిరుమలయ్యల సంకీర్తనలన్నీ ప్రకటింపబడినాయి. (సంపాదకుడు)

## 6. గార్లపాటి లక్ష్మయ్య

స్వచ్ఛంద గతితో జాలువారుచున్న పదకవితా స్రోతస్వినిని శివకవులు తమ కృతిక్షేత్రముల పారించుకొని భక్తి సస్యముల నిండార పండించినారు. పదకవిత శృంగారరసవాహిని అగుట మాత్రమే కాదు. వేదాంతామృతసింధువు ఐనది. వేదాంత ప్రచారమునకు, భక్తి ప్రచురణమునకు పదకవితావాహిక చాలాగా సహకరింపగలదని తొలుత గురుతించినవారు శివకవులు. అందువలననే శివకవుల కవిత చాలవరకు పదకవితలోనే, పదకవితా ప్రభేదములలోనే పరగినది, ప్రచురమైనది. వస్తువు, కవిత, భాష, ఛందము– ఇన్నిటను వారు వేరు తెరగువారయిరి. ఈ వేరుపాటు వారిని, వారి కృతులను జనసామాన్యము చేరువకు గొనిపోయినది. ఆ పదములు, అందలి వస్తువు, గతి, భాష అన్నియు వారి చిత్తముల హత్తుకొనిపోయినవి. వారి జీవిత మార్గములనే మార్చి ముక్తిత్రోవ పట్టించినవి. ఇంతకన్న కవులు తమ కృతులవలన కోరదగిన ఉత్తమ ఫలమేమున్నది?

పాలకురికి సోమనాథ కవీశ్వరునికి పూర్వము నుండియే ఈ పదకవిత ప్రచారములో ఉన్నట్లు తెలియవచ్చుచున్నది. పండితారాధ్య చరిత్రములో ఆ యా పదరచన లెల్ల పేర్కొనబడినవి చూడుడు.

**"పదములు దుమ్మెదపదముల్ ప్రభాత**
**పదములు పర్వతపదము లానంద**
**పదములు శంకరపదముల్ నివాళి**
**పదములు వాలేశుపదములు గొబ్బి**
**పదములు వెన్నెలపదములు సెజ్జ**
**వర్ణనమతి గణవర్ణన పదము**
**లర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండ**
**బాడుచు నాడుచు బరమహర్షమున."**

**(పండితారాధ్య చరిత్రము)**

నాడు బహుళప్రచారమున ఉండిన ఈ పదరచన లెల్ల కాలగర్భమున కలసియుండబోలును. నేడవి దుర్లభములుగా నున్నవి. పై ద్విపదలు నాటి పదకవితా ప్రాచుర్యమును వెల్లడి చేయునవై ఉన్నవి.

శ్రీనాథుని కాలమున ఈ పదకవితకు బహుళప్రచారము కలదు. అతడు కడిది పురమును గూర్చి చెప్పిన ఈ పద్యము జూడుడు:

**"ముదివిటులు విధవలంజలు**
**పదకవితలు మాఱు బాస బాపనవారల్**
**చదువని పండితవర్యులు**
**కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్."**

ఇందు పేర్కొనబడిన 'పదకవితలు' శృంగారరసపరములు.

భక్తి ప్రతిపాదకములై, శైవమతదీక్షా శిక్షాప్రవణములైన 'ఏగంటివారి పదములు' శివదీక్షాపరులకు సుపరిచితములు. ఏగంటి నంజేశుడను శివయోగి పేర తదంకితములుగా ఈ పదములు కలవు. ఇతడు 'ఏగల్లు' పురవరాధీశ్వరు డట! ఈ పద్యము చూడుడు:

**"చలమునను సంసారసాగరంబున మునిగి**
**బలువైన లంపటము పాలైతిని**
**పలుమాఱు ఏగంటి పట్టణేశ్వర, నన్ను**
**ఎలమితోడుత జన్మమెత్త జేయకుమీ!"**

ఈ పద్యములను రచియించిన కవీశ్వరున కితడు ఆచార్యుడు. తన ఆచార్యునకు, తనకు గల గురుశిష్య సంబంధమును కవియే ఇట్లు చెప్పినాడు:

**"అంజనేటికి శివా యని శంభు నే గంటి**
**నంజయ్యదేవు కృప నాకు గలుగగనూ ॥అంజ॥**
**స విశేష త్రివిధ ప్రసాద మార్గమె చూపి**
**చెవిలోన మంత్ర రహస్యము చెప్పినాడూ**

భవరోగములు మాన్ప బాలుపడి నమ్మించి
తవిలి నా తలను హస్తము వెట్టినాడూ ॥అంజ॥
చ (చె?) రలింగమై వెలుగు శివయోగి యేగంటి
గురుమూర్తి నాదు దుర్గుణములు వాపినాడూ
స్థిరముగా నంజయ్యదేవుకృప నా మీద
గరుణ జీవన్ముక్తి గావించినాడూ" ॥అంజ॥

ఏగంటినంజయ్య శివయోగి మాత్రమేకాక సుకవి కూడానట! కాని అతని కవిత- పదకవిత కాబోలును- మన కెరుగరాదు. ఇది చూడుదు:

"నిజము శాంతము యోగ నిలకడ స్ఫూర్తి
కుజన జనసంఘంబు కూడుదపకీర్తి
సుజను దేకంటి గురు సుకవియె మూర్తి
భజభజ యనుట సద్భక్తులకు గీర్తి."

ఈ పదములలో చంద్రగిరి, చంద్రగుండము అని కొన్నియెడల పేర్కొన బడినది. ఈ పదముల రచయిత ఆ చోటుననుండి శివజ్ఞానము పడసెనట! ఏగంటి నంజయ గురువర్యుని నివాసమో, కాక అతడు జ్ఞానసిద్ధి నందిన స్థలమో అది అయి యుండును. ఈ పదము జూడుడు.

సూర్యచంద్ర వహ్నినడుమ శౌర్యమానె చిలుకగంటి
సూర్యదీప్తి గాయుచుండగా పల్లవి॥
యేగంటిలింగ-చూడ జూడాశ్చర్యమాయెరా యేగంటి
గండికోటనుండి చూడదండి ఉదయగిరి గంటి
దండి ఉదయగిరి మీదను ఏగంటిలింగ
ఉండగంటి 'చంద్రగిరి' ని 1
పాముపేరు చెప్ప విషము ఆడకాక కెక్కె గదరా
చీమ యెనుపోతు కడుపును ఏగంటిలింగా
ధీమసాన మ్రింగె గదరా. 2



..............................................

బలిమితోడుత చంద్రగుండము ప్రాంతముననొక దొడ్డినుండెడు
తెలిసి నాదముచేత నక్కడి ధేనువుల బిదికి
తెలిసి యనుతాపమున గాంచిన క్షీరముల గురువాక్య తక్రము
కలయబోసుక తోడు వెట్టిన ఘుట్టిపెరుగిదిగో."

..............................................

పరగ షడ్దళకమల భావంబు కీ లెఱిగి
అరసి బింబోద్భవం బమరజేసి
శిరమునను వెలిగెడి చంద్రమండల సోన
కరమర్థి నర్పించు ఘనులకే గాక.

..............................................

ఏగంటినంజయ గుర్వంకితముగా నున్న పదము అది. సుమారు నూటికి పైబడి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గలవు. అందు కొన్నిమాత్రమే ముద్రితము లయినవి. అవియు సరిగా, సమగ్రములుగా ముద్రితములు కాలేదు.

గార్లపాటి లక్ష్మయ్య అను శివకవి ఈ పదములకు కర్త. ఈ పదములు వ్రాత ప్రతులయందు 'లక్ష్మయ్యగారి వచనాలు' అని కలదు. 'ఏగంటివారి మంగళారతి' అనుప్రతిలో మంగళహారతి పదములో కవి తన పేరు చెప్పుకొన్నాడు.

"స్రష్టంబు విశ్వతశ్చక్షురుతముగ ననుచు
నిష్టించి పలుకగా నేర్పుమీఱ
అష్టవిధార్చనల హరినేత్ర మర్పించి
యిష్టార్థ ఫలమిచ్చె నీశా నీకు
జయమంగళం నిత్యశుభమంగళం
అరు దొంద వృషభవాహనుడు ఏగంటీశు

**దరయ లక్ష్మా భక్తవరదు డగుచు**
**పరికింప నేలిన ప్రమథగణములకు**
**సరస సాయుజ్య శివసమూహమునకు**
**జయమంగళం నిత్య శుభమంగళం".**

**.........................................**

తన పదములలోనే మరొకచోట ఇతడు తన పేరు చెప్పుకొన్నాడు.

**"చూడంగ జూడంగ సూక్ష్మరూపంబైన**
**జోడుగా దనయందు జ్యోతి వెలుగు**
**కూడి లక్ష్మణ! యోగికృప యెఱిగి యున్నపుడు**
**ఏడ నుండిన మనసు కేమి భయమూ."**

ఈ పదముల రచియించిన లక్ష్మణ కవీశ్వరుని యింటిపేరు గార్లపాటివారు. ఆ యీ విషయము పోలిసెట్టి లింగనకవి రచించిన నవచోళ చరిత్రము నుండి తెలియవచ్చుచున్నది. తత్కవీశ్వరుడు లక్ష్మణుని స్తుతించినాడు చూడుడు:

**" వీరభద్రేశ్వరు విజయసాహసము**
**వీర రసంబున విరచించె తానె**
**దాతయై కవులకు ధాత్రిలో నుత వి**
**ధాతయై మతి నెఱదాతయై మిగుల**
**పాటలు సద్భక్తిపరులు నుతింప**
**పాటికెక్కిన గార్లపాటి లక్ష్మణుని**
**వెలయగా వినుతించి విజ్ఞానమునను**
**గలుగు నాదిమ శివకవుల భజించి."**

లక్ష్మయ్య రచితముగానే తెలియవచ్చుచున్న 'శివజీవైక విధానము' అను గ్రంథమున 'ఇతి శ్రీ గార్లపాటి లక్ష్మార్య కృతౌ' అని కలదు. ఇందుకే ఈ పదముల రచియించిన లక్ష్మణ కవీశ్వరుని యింటిపేరు గార్లపాటివారని తేలినది.



ఈ కవీశ్వరుని కాలము తెలిసికొనుటకు గ్రంథస్థాధారములు లభించుటలేదు. ఇతని పదములలో పిడుపర్తిగురువర్యుని ప్రశంసయుండుట బట్టి ఆ పిడుపర్తి గురువర్యుడు ప్రసిద్ధుడగు పిడుపర్తి బసవయ్యయే అయి ఉండునని, అందుచే ఇతని కాలము 1753(?) ప్రాంతము కావచ్చునని శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారు వ్రాసిరి. (చూడుడు: భారతి రజతోత్సవ సంచిక) కాని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున 'పిడుపర్తివారి వచనములు' అనుపేర కొన్ని పదములు కలవు. అవి పిడుపర్తి మల్లికార్జున గుర్వంకితములు. ఏగంటివారి పదములలో గానవచ్చు పిడుపర్తి గురుప్రశంశా పదములు పై పిడుపర్తివారి వచనములలో చేరదగినవని, అవి లేఖకుల అజ్ఞానముచే ఏగంటివారి పదములలో లిఖింపబడి ఉండవచ్చునని ఊహించుచున్నాను. ఏగంటివారి పదముల రచయిత పోలిసెట్టి లింగనకవి పూర్వుడో, సమకాలికుడో అని మాత్రము చెప్పదగును. లింగనకవి కాలము నిశ్చయముగా తెలియదు. అందుచే ఈ కవి కాలము ఇదమిత్థమని తెలియరాకున్నది.

ఈ కవీశ్వరుని పదరచనము సూటిగా, సుకరముగా నుండును. వేదాంతబోధ జనరంజకముగా చేయుట సామాన్యులకు చేతకాని పని. వేదాంత పరిభాషా పదములతో రచనము క్లిష్టతరము గాకుండ తాను ప్రతిపాదింప దలచిన విషయమును ఉపమాన పూర్వకముగా, అవియు జనసామాన్యమున కందుబాటులో ఉన్నవిగా ఇతడు కూర్చును.

ఈ కవి ప్రతిపాద్య విషయము నెంత సులభముగా సూటిగా మనసు కెక్క రచించెనో చూడుడు:

**"ఓపితె పుణ్యముసేయు ఓపకుంటె యూరకుండు**
**పాపము సేయకు మంతె పదివేలు జీవుడా ॥ఓపితె॥**
**ఒరులతో చాడిచెప్పి యుడుగుర లందుకంటె**
**గరిమతో గోచైన గట్టేది మేలు**

వరుసతో కల్లలాడి వాచాలుడగుకంటె
ఆరయంగ మూగవా డయ్యేదిమేలు. ॥ఓపితె॥

పరులచే నప్పుచేసి పప్పుగూడు దినుకంటె
దొరకు నంబలి యొక్క దోసెడే చాలు
పరదైవముల గొలిచి పదయు సిద్ధులకంటె
ఓరిమెతో నేగంటి యొద్ద నుంటే చాలు" ॥ఓపితె॥

పాలకురికి సోమనాథకవీశ్వరుడు పేర్కొనిన తుమ్మెద పదములవంటి రచనమిది. మధురమై హృదయంగమముగ నున్నది- చూడుడు:

శ్రీ కంఠుడను పువ్వు తుమ్మెదా మూడు
లోకము లాయెను తుమ్మెదా
సాకారమైయుండు తుమ్మెదా పర
మేకాంతమున జూడు తుమ్మెదా

శివ శివ యనవే తుమ్మెదా
శివు దనగ విన మేలు తుమ్మెదా
శివుని భక్తులాకు తుమ్మెదా
శివ శరణన మేలె తుమ్మెదా ॥శివశివ॥

ముట్టిముట్టని పూవు తుమ్మెదా
ముట్టింది జగమెల్ల తుమ్మెదా
ముట్టి చూడలేవె తుమ్మెదా అది
ముట్టి పాయలేవె తుమ్మెదా. ॥శివశివ॥

యవ్వన మందవె తుమ్మెదా బహు
పువ్వ్వాల వాసనె తుమ్మెదా
కొవ్వి నీ వెఱుగవె తుమ్మెదా నీకు
నెవ్వి నేరము లేదు తుమ్మెదా. ॥శివశివ॥



ఆఱు ఱేకుల పూవు తుమ్మెదా అది
మీఱిన వాసనె తుమ్మెదా
వేఱుసేయక నీవు తుమ్మెదా శివు
జేరి భజించవె తుమ్మెదా. ॥శివశివ॥

యీళపింగళాలు తుమ్మెదా సుషుమ్న
నాళి మధ్యమున తుమ్మెదా
మేలి మెఱిగి నీవు తుమ్మెదా శివ
కేళి జరించవె తుమ్మెదా. ॥శివశివ॥

ఏడుగురు రాజులు తుమ్మెదా నీకు
చూడ బండ్లు జోదు తుమ్మెదా
చూడు పాడుజంపి తుమ్మెదా భక్తి
రూఢి కెక్కుమంటి తుమ్మెదా. ॥శివశివ॥

ఆశ పాపజాతి తుమ్మెదా వట్టి
ఆశ గోసివేసి తుమ్మెదా
మోసపోకు మంటి తుమ్మెదా భక్తి
రాశి కెక్కుమంటి తుమ్మెదా. ॥శివశివ॥

అష్టదళ జలజమున తుమ్మెదా నీవు
ఇష్టమున దిరుగవె తుమ్మెదా
కష్టము లెరుగవె తుమ్మెదా నీవు
స్రష్టవై యుండవె తుమ్మెదా. ॥శివశివ॥

తొమ్మిది వాకిళ్లు తుమ్మెదా నీవు
నమ్మి చరించవె తుమ్మెదా
మమ్మూల కోణాల తుమ్మెదా నీవు
నెమ్మది నుండవె తుమ్మెదా. ॥శివశివ॥

పది పాదేనింట తుమ్మెదా వెండి
పదినొండు తావుల తుమ్మెదా
మెదలక నిల్చిన తుమ్మెదా నిన్ను
కదలించ గలరటె తుమ్మెదా ॥శివశివ॥

ఎనసి తోటపువ్వు తుమ్మెదా నీ
వానక మానలేవె తుమ్మెదా నిన్ను
వానిచే జిక్కిన తుమ్మెదా తోట
వానిచే బడుదువె తుమ్మెదా ॥శివశివ॥

నింగి నేలవేయు తుమ్మెదా
గంగ గవురు లేని (నాడు) తుమ్మెదా
పొంగుచును నెరజోడు తుమ్మెదా వేయి
భంగుల నటియించు తుమ్మెదా ॥శివశివ॥

వేయుతేకులపువ్వు తుమ్మెదా అది
వెలుగును జగమెల్ల తుమ్మెదా
సద్గురు నడగవె తుమ్మెదా పువ్వు
సద్యచూపు నీకు తుమ్మెదా ॥శివశివ॥

గురునకు హరునకు తుమ్మెదా అం
తరువు ఏమిలేదు తుమ్మెదా
గురు పాదపద్మాలు తుమ్మెదా నిన్ను
దరిసించు మంటిని తుమ్మెదా ॥శివశివ॥

గురుడు నీ శిరమున తుమ్మెదా మా
గురుడు నీ శిరసున తుమ్మెదా
కరపద్మములు మోపి తుమ్మెదా
అరయ నేగంటీశు డుండునె తుమ్మెదా. ॥శివశివ॥



శివకవుల పదములిట్టివి. తుమ్మెద సంబోధనముతో నుండుట వింతగానే ఉన్నది. ఇందు 'తుమ్మెద' ఆత్మార్థమున ఆత్మ సంబోధనముగా వెలయుచున్నది. శివకవుల కృతులలోని ఆశ్వాసాంత గద్యలలో 'శ్రీపాద పంకజభ్రమ రామాయణ' అని గ్రంథకర్త పరముగా ప్రయోగింపబడు విశేషమునకును, వారి పదరచనములలో చూపట్టు ఈ తుమ్మెద పదములకును ఏదో సన్నిహిత సంబంధముండునట్లు గోచరించుచున్నది. తమ్ము శివపాదపంకజములలో భ్రమరములుగా దలపోసికొనుట శివకవులకు కడు ఇష్టము. శివకవుల ఆశ్వాసాంత గద్యలందెల్ల 'శ్రీపాద పంకజభ్రమ రామాయణ' అనియో, లేక తత్పర్యాయ సమాసపదమో ఉండును. వారి గద్యలు నేటికిని వారికి, వారిమతమునకు, వారికవితకు తుమ్మెదపదములతో గల సంబంధమును వ్యక్తము చేయుచున్నవి.

తుమ్మెద సంబోధనముల తోడివే కాక చిలుక సంబుద్ధితోడను పదములు కలవు. ఇచ్చట 'చిలుక' అనగా భౌతికశరీర మనెడి పంజరమున నున్న ఆత్మ పదార్థము. 'గూటిలో చిలకేదిరా, గూడు చిన్నబోయెరా' అన్నరీతి పదము లీ తెగకు జెందినవవే. ఏగంటివారి పదములలోని చిలుకపద మిది చూడుడు:

"చింత లన్నియు మాని యా శివ
చింతమీద నుండు చిలుకా
పంతగాళ్లనుగూడి ప్రతియాసలకు బోయి
పట్టువీడి రాకుమీ చిలుకా
మంతనంబున నుండి మతిచెడి యిల బుద్ధి
మరులు కొని రాకుమీ చిలుకా
వింతచదువులు చదివి విడువ కామీద
వేందాంతములు పలుకుమీ చిలుకా
చెలగి చెప్పెద బుద్ధి చేకొని విని నీదు
చలన ముడిగింపవె చిలుకా

**కులముతో వైరంబు కొఱగాదు మిక్కిలి**
**కూడు వెల్లక యుండు చిలుకా**
**మెట్టు మెట్టున నుండి మీదులకు మీదైన**
**మీది కొమ్మ నుండు చిలుకా**
**పట్ట బసలేని యాపదలకై కెమ్మోవి**
**పండ్లకే రాకుమీ చిలుకా**
**పట్ట ముట్టగ రాని బట్టబైలును తేనె**
**పండు ఉన్నది చూడు చిలుకా**
**గుట్టుతో నా మీద కుదురుకొని యీ దిగువ**
**కొమ్మలకు రాకుమీ చిలుకా**
**గురుతైన యేగంటి గురుపాదములు చేరి**
**గుఱి గడచి యా మీద చిలుకా**
**సిరులు మాయని తెలిసి జీవగుణమని యెఱిగి**
**చిగురుమేతల బోకుమీ చిలుకా**
**పరికించి పంచశరపాటులను బోక యా**
**గుణితోడ నేప్రొద్దు చిలుకా**
**భరితమై వెన్నెల బైటిపంజరములో**
**ప్రాణప్రదమై యుండు చిలుకా."**

........................................

ఇందలి పదములు కొన్ని పైకి సులభముగా, సువ్యక్తముగా తెలియ వచ్చుచున్నను నిగూఢార్థ బోధకములై ఉండును. ఆయా వేదాంతార్థములు, నిగూఢార్థములు జనసామాన్యమునకు అందుబాటులో ఉండుటకై యీ పదములపై ఒక భాష్యము కూడ వెలసినది. 'ఏగంటి భాష్యము' అనుపేర ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున ఒక ప్రతి కలదు. అందు ఏగంటివారి పదములలో ఒక్కదానికి మాత్రము భాష్యము విరచింపబడినది.



భావము మాత్రము ఉన్నరీతిని బట్టి అర్థము చేసికొన్న యెడల సుసంబద్ధముగా దోపదు.

**"కాంతాల పాలెములోన**
**చింతామాను పుట్టెగదరా**
**చింత అనలుకొనలు సాగగా యేగంటిలింగా**
**చింతపూసి పండు పండెరా.**
**ఆకసాన కోడికూసె**
**చీకటింట బ్రొద్దు పొడిచె**
**మూక చిత్తమధ్యమునను యేగంటిలింగా**
**యేకమై వెన్నెల గాసెరా**
**కానరాని యడవిలోన**
**వానలేని మడుగు నిండె**
**వానలేని మడుగు మీదనూ యేగంటిలింగా,**
**మానరాని యగ్ని పొడమెరా**
**ఆకులేని యడవిలోన**
**తోకలేని మృగము పుట్టె**
**తోకలేని మృగము కడుపునా యేగంటిలింగా,**
**యీకె లేని పక్షి బుట్టెరా."**

...................................................

అలభ్యము, అచింత్యము అయిన బ్రహ్మపదార్థమును నిత్యావశ్యక మయిన, సర్వత్ర సాధారణమయిన వస్తువునుగా సులభముగా తదర్థులకు కవి అందజేయుచున్నాడు-చిత్తగింపుడు:

**"పొందుగా తనువనెడి యడవిని**
**పొగడ త్రికూటంపుగిరి గల**

దందు యిరువైయేను ఆవు లవియు మేయగనూ
ముందు గాంచిన పదుగురికి దా మొదలయిన పరమాత్మనాథుని
మంద లోపల నుంచి తెచ్చిన ఘట్టి పెరుగిదిగో ॥పల్లవి॥
పెరుగు గొనరే అమ్మలారా, పెరుగు కొనరే వాడవారా
మెఱసి శివ యోగీశులు గోరెడి మిసిమిగల పెరుగూ॥పొందుగా॥
బలిమి తోడుత చంద్రగుండము ప్రాంతమున నొక దొడ్డినుండెడు
తెలిసి నాదముచేత నక్కడి ధేనువుల బిదికి
తెలిసి యనుతాపమున గాంచిన క్షీరముల గురువాక్య తక్రము
కలయబోసుక తోడు వెట్టిన ఘట్టి పెరుగిదిగో ॥పొందుగా॥
కోరికలు విడనాడి యీ దధి గుఱుతుగా గొని యనుభవించి
శూరునకు సంసారరోగము సులభమున బాయున్
ధీరుడగు శ్రీశైలనాథుని దివ్యతేజమునందు గలసిన
జేరి యైక్యపదంబు నొందెడు సిద్ధ మటుగాన."

కవి వాడవాడకు, ఇంటింటికి బోయి అమ్మలక్కల పిలిచి పిలిచి పెరుగమ్ముచున్నాడు. ఆ పెరుగు గురువాక్య తక్రము కలయబోసుక తోడుపెట్టినది. ఈ దధిని కొనుటకు కోరికలు విడనాడ వలయును. దీని కొన్నవారు శూరులు. వారికి సంసారరోగము సులభముగా పాయును. ఇట్టి 'మహిమ' గల పెరుగును కవి మనకు సులభముగా అందజేయుచున్నాడు. ఈ పెరుగును కొనవలయునని, అనుభవింపవలయునని ఎవరికి కోరిక పుట్టదు?

ఈ పదము 'రామజోగి మందు కొనరే' అన్న రామదాసు కీర్తనమును జ్ఞప్తి కెలయించుచున్నది.

కవిపాడిన శివలాలి ఇది. వేదాంతవిద్యా పరముగా, విజ్ఞానబోధకముగా ఉన్నది, చూడుడు.



"లా లనుచు ఊచేరు లలన లందఱునూ
ఫాలలోచన, నిన్ను బాన్పుపై నునిచి ॥లాలి॥
శ్రీ గురుని పాదములు చేరి సేవింతు
నాగభూషణ నిన్ను నాత్మలో నుంతు
ఆ గణాధిపు పాద మమర బూజింతు
బాగుగా ప్రమథ గణభావ మర్పింతు ॥లాలి॥
కరణములు నాల్గు వరకంబులు కాగ
పరగ దశవాయువులు పగ్గములు కాగ
ఉరులింగమూర్తి తానుయ్యాలలూగ ॥లాలి॥
ప్రణవ పంచాక్షరి పాన్పు తా కాగ
భరిత చిత్ప్రవణమె బాలీసు కాగ
చరలింగ చిత్కళలు దీపములు కాగ
పరమసద్గురు వందు పవళించుకోగ ॥లాలి॥
వరవీర శైవమై వనిత తా గాగ
వరభక్తిచెల్వమే వసుధ తా గాగ
పరమ సుజ్ఞానమే పాలిండ్లు కాగ
ఘనలింగరతి మనోకళల క్రియ కాగ ॥లాలి॥
లాలి చిద్రూపాంగ లాలయ్య లాలి
లాలి సజ్జనహృదయ లాలయ్య లాలి
శ్రీ పిడుపర్తీశ లాలయ్య లాలి
శ్రీ సర్వేశ్వరా లాలి లాలి." ॥లాలి॥

* * * *

పరంజ్యోతి స్వరూపుడయిన పరబ్రహ్మమునుగని అందరచే దర్శింపజేయుచున్నాడు. అదిగో, అల్లదిగో చూడుడని ఆ పరంజ్యోతి దర్శనమును

పలుకులలో చేయించుచున్నాడు. రచనమిది యెదుట నిజముగా పరంజ్యోతి దర్శనమునే చేయింప గలదియై ఉన్నది!

**"తళుకు తళుక్కున తారకమున గతి**
**తొలకరి మెఱపుల పొలుపునను**
**కళలరీతిని కనకపు భాతిని**
**వెలిగెడు దీపము విధము నున్నదీ ॥పల్లవి॥**
**అదిగో తారకమూ**
**అదిగో తారక మంతరిక్షమున ॥అదిగో॥**

**అత్యద్భుతమై యమృతాంకురమై**
**అత్యతిష్ఠ దశాంగుళమై**
**ప్రత్యక్షంబై పరిపరివిధముల**
**నిత్యశుభంబై నీ జగతి నున్నది ॥అదిగో॥**

**రవిచంద్రానల రంగస్థలమున**
**రవిశతకోటి విరాజితమై**
**కవగూడుక యేగంటి మృడుండను**
**భవతారకమై ప్రభతో నున్నది ॥అదిగో॥**

* * * *

కవి యీ మేలుకొలుపు పదముతో భక్తుల,పాఠకుల హృదయముల జ్ఞాన సూర్యోదయము కలుగజేసి సర్వజన హృదయాంతర్యామిని సర్వేశ్వరుని శంకరుని మేలుకొలుపుచున్నాడు.

**"శివ శివా మేలుకొనవే**
**మేలుకొనవే పవనపతివై మించి రేచక పూరకుంభక**
**నాళవీథుల నాదగానము లంటి సేయగనూ ॥శివశివా॥**



**అరయ నజ్ఞానంబు తిమిరం బరయ నరులకు జారచోరుల**
**సొరిది యవగుణ తారకావళి సొంపు లెడలెన్**
**దురిత తుహినము విరిసె సగుణస్తోత్ర పక్షులు కలయ బలికెను**
**విరివి హృదయాకాశవీథుల విశదమాయెన్ ॥శివశివా॥**

**ఎఱుక నొగలును మతియు గాడి వివేకచక్రము బుద్ధి యిరుసును**
**నిరవుగా గూర్చున్న మనరథ మింద్రియాశ్వములూ**
**విరతి వాగెయు ధృతి ననూరుడు విజ్ఞాన సూర్యుఁడెక్కె లోకము**
**పరగ సుధమ్నాచలమున నుదయ మాయెన్ ॥శివశివా॥**

**భ్రమను కలువలు ముకుళమాయెను**
**పరగ గుండలి నాట్యమాడెను**
**నమర మూలాధారకమలము లారు వికసించెన్**
**ధమితచిత్కిరణీ క్షణంబున**
**తత్వభూముల దళుకు లొదవెను**
**క్రమమునను నేగంటి లింగము కానబడియెన్ ॥శివశివా॥**

ఈ మేలుకొలుపుతో ఎందరవో నిద్రిత హృదయములు జాగృతి చెంది భగవదున్ముఖములయినవి. భక్తిప్రవణములయినవి. ఎండిన నేల లెన్నియో నిండార పండినవి. ఈ పంటలో పదరచయితలతో పాటు ప్రజలును భాగస్వాములు!

## 7. క్షేత్రయ్య పదములు

**కదిసిన నోరవోయి మతి కబ్బపుదొంతుల సత్పదార్థముల్**
**గదుకుచు నెట్టివారి బొడగన్నను గుట్టని స్నేహసౌఖ్యముల్**
**మదికి నసహ్యమౌ శునక మార్గమునం జరియింపుచున్న త**
**త్పదకవు లెల్ల మత్కవిత దప్పులు వట్టక యూరకుండుడీ.'**

అని సాహితీమందిరంలో రాటుదేరిన పాండిత్యం చాటున 'అరచాటగు నాంధ్ర వధూటి చొక్కపుం జనుగవపోల్కి' కనబడీ కనబడునట్టుగా దోబూచులాడే శృంగారాన్ని రచ్చకీర్చి నడివీధిపాలు చేసినారని కసికొద్దీ 'మదికి నసహ్యమౌ శునకమార్గమునన్ జరియించు' వారని కవి నిందావ్యాజంతో నోరార దూషించి ఒకానొక కవి పదకవులపై తనకుండే అక్కసునంతా ఒక్కమారుగా తీర్చుకొని 'తృప్తోస్మి' అనుకున్నాడు. నేటిదాక సాహిత్యవిమర్శకుల కైతేనేమి, కవి చరిత్రకారుల కైతేనేమి ఇంచుమించు ఇటువంటి భావమే వుండడంచేత పదకవిత్వానికి గాని పదకవులకు గాని లభింపదగినంత ఆదరం లభింపలేదు. వాఙ్మయశాఖల్లో పదకవిత్వశాఖ ఒకటి ఉందనైనా వారు తమ గ్రంథాల్లో ఉటంకించక పోవడం శోచనీయం.

అయితే నిజంగా జాతీయజీవనాన్ని పదకవిత్వం ప్రతిబింబించ గలిగినంతగా తక్కిన యే వాఙ్మయశాఖ కూడా ప్రతిబింబింప లేకపోయిందంటే విడ్డూరం యేమీలేదు. అసలు పదకవిత్వశాఖ తక్కిన వాఙ్మయశాఖల వంటిది కాక కేవలం దేశిసరకు. ఒక విధంగా యీ పదకవులందరూ పదకవిత్వం పేరిట తమ కాలంలోని రుచిరములైన సామాజిక జీవనఘట్టాలనే రచించినా రనడం తప్పు కాదు. భాష, ఛందస్సు, వ్యాకరణము, కథావస్తువు, పాత్రౌచితి అనే కట్టుబాట్లకు లోబడి రావలసి వుండడంచేత ప్రజావ్యవహారంలోని రుచిగల పలుకుబళ్ళూ, నానుడులూ, శ్రుతి సుభగాలయిన కాకువులు, వేళాకోళములు, వెక్కిరింతలు మొదలయిన వాటికి పద్య కవిత్వంలో లేని అవకాశం



పదకవిత్వంలో వుండడమే యీ కవిత్వాన్ని జాతికి సన్నిహితం చేసింది. అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి మొదలయిన పదకవుల సాహిత్యంలో మనకు ఈ విషయమే స్పష్టమవుతుంది.

ఇటీవల పదకవిత్వాన్ని గూర్చి పరిశోధనలు జరగడమూ, ప్రాచీన పదకవుల సాహిత్యం సవిమర్శంగా ప్రకటింపబడడమూ చాలా సంతోషింపదగ్గ విషయం. అన్నమయ్య పద సాహిత్యమంతా తిరుపతిలో సంపుటాలుగా ప్రకటింపబడుతున్నవి. ఆయన శృంగారసంకీర్తనలు ఇటీవలే ప్రచురింపబడినవి. అన్నమయ్యకు తర్వాత పదకవిత్వ పాకాన్ని పలచ బరచి జుర్ర బదను కావించిన మహనీయుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య సాహిత్యం మనకు విలువకట్టలేని సాహితీ భాండారం. మన జాతీయ జీవన సర్వస్వం అది.

త్యాగరాజ కీర్తనలను సవ్యాఖ్యానంగా ప్రకటించి ఆంధ్రజాతికి అందించిన ఆంధ్రగానకళాపరిషత్తువారూ, తన్నిర్వాహకులయిన శ్రీవిస్సాఅప్పారావు పంతులుగారూ క్షేత్రయ్య సాహిత్యాన్ని లభ్యమయినంతవరకూ సేకరించి అనేక నూతనాంశాలు తెలిపే విపులమయిన పీఠికతో ప్రకటించడం మన అదృష్టం.

క్షేత్రయ్య తన మేరువు పదంలో సుమారు నాలుగువేల ఇన్నూరో లేక నాలుగువేల ఐదువందలో పదాలు రచించినట్టుగా తెలుపుకొని వున్నా మనకవన్నీ లభించడం లేదు. ఇంతకు మునుపు అచ్చైన గ్రంథాలలో 241 క్షేత్రయ్య పదాలు మాత్రమే ముద్రింపబడినవి. తమ పరిశోధన వలన లభించిన సుమారు 90 క్రొత్త పదములను గూడ చేర్చి మొత్తం 330 పదములను శ్రీ అప్పారావుగారు ఇందులో ప్రకటించినారు. కొత్తగా లభించిన 90 పదాలతో, అమూల్యములయిన నూతన విషయాలను తెలిపే విపులమైన పీఠికతో ఈ ముద్రణం పూర్వముద్రిత గ్రంథాలన్నింటి కంటె ముచ్చటగానూ, గుణోత్తరంగానూ వున్నది. భానుదత్తుని రసమంజరికి ఎవరో అజ్ఞాత భావుకుడు క్షేత్రయ్య పదలక్ష్యాలతో రచించిన అనువాదం 'శృంగార రసమంజరి' కూడ యిందుతో ముద్రింపబడినది.

మువ్వగోపాల నామాంకితములై వున్నప్పటికీ రచననుబట్టి అప్రౌఢ రచితాలుగా కనబడుతుండడంచేత ఇందులో ముద్రింపబడిన పదాలలో కొన్ని ప్రక్షిప్తా లనదగినట్టుగా వున్నవి. ఈ విషయాన్ని సంపాదకులు కూడ పేర్కొన్నారు. ముద్ర మార్పు అతిసులభం కావడంచేత కాబోలు లేఖకుల అజ్ఞానంచేత వేణుగోపాల నామాంకితాలయిన సారంగపాణిపదాలు కొన్ని మువ్వగోపాలముద్రతో క్షేత్రయ్య పదాలుగా వ్రాత ప్రతులలోని కెక్కినవి. నిజంగా సారంగపాణి పదాలే అయి వుండి మువ్వగోపాలపదాలుగా వ్రాత ప్రతులలో ఎక్కిన నాలుగు పదాలు ఇందులో ముద్రితములై వున్నవి.

(1) అక్కరలేని కాపురమాయె (పుట-4)

మూడవచరణంలో

'తాను వేణుగోపాలు డాయె-దయలు దూరమాయె' అన్న ముద్రమార్పుతో ఈ పదమే సారంగపాణి పదములలో నున్నది. (చూ.ప్రథమభాగము. 54 వ పదము)

(2) ఇంటికి రానిచ్చేనా-యీ మేనితో

నింతి వాని దలచేనా (పుట-21)

అనుపల్లవిలో

'గొంటుకాడై వేణు-గోపాలుడు నాపై' అనీ తుది చరణంలో 'పని బూని వేణుగోపాలా యని పిలిచేనా' అనీ ఇదే పదం ముద్రమార్పుతో సారంగపాణి పదాలలో వున్నది. (చూ. ప్రథమభాగము-39 వ పదము)

(3) తన చిత్తము వచ్చినటుల దయసేయు మనవే (పుట- 120)

అనుపల్లవిలో

'వినవే కార్వేటినగర-వేణుగోపాలదేవునితో' అనే మార్పు మాత్రంతో ఇదే పదం సారంగపాణి పదాలలో వున్నది.

(చూ.ప్రథమభాగము 55వ పదము)



(4) తెలిసె నీ నెనరు లేని జాడలు (పుట-129)

అనుపల్లవిలో

'వలదు నిలుపు యీ మాటలకేమి

వచ్చె వేణుగోపాల నా సామి' అని ముద్ర మార్పుతో ఇది సారంగపాణి పదాలలో వున్నది. (చూ.ప్రథమభాగము. 43 వ పదము)

ఇదిగాక రాజగోపాల నామాంకితముగా మూవనల్లూరు సభాపతయ్యగారిచే రచింపబడిన యీ క్రింది పదము ఒకటి యిందులో ముద్రింపబడినది.

ఎవతె తాళునమ్మా యీ నడతల-

నే మందునె కొమ్మా (పుట-69)

అనుపల్లవిలో

'సవతి రాజగోపాలు కెక్కువేమొ' అన్నముద్రమార్పుతో ఈ పదము సభాపతయ్యగారి పదాలలో వున్నది. వావిళ్ల ముద్రణాలయమువారు ముద్రించిన క్షేత్రయ పదములలోని నాలుగుపదములు ఇందు ముద్రింపబడలేదు.

'శృంగారరసమంజరి' లో 'నా మేను నీమే ననుచును బలికిన' అను పదము శెట్టివణ్యము పదము అని కుండలీకరణలలో పేర్కొనబడియున్నది. కాని అది సభాపతయ్య పదము. ఇదిగాక శృంగారరసమంజరిలో ఉదాహరింపబడి ఫలానా వారివని గుర్తింపబడని 'ఎందుకు బొంకేవురా లేదని నాతో' -

'ఇచ్చిన మంచిదే యీకున్న మంచిదే' అను పదములు సారంగపాణి పదములు. తక్కిన పదములు కూడ ఎవరివో గుర్తింపబడవలసి వున్నవి.

గ్రంథసంపాదకులు తమ విపులమైన పీఠికలో క్షేత్రయ్య జన్మస్థలాన్ని సోపపత్తికంగా నిర్ణయించడం మాత్రమే గాక పదములను బట్టి ఒక విధంగా క్షేత్రయ్య జీవితచరిత్రను పోల్చుటకు ప్రయత్నించారు. ఇదిగాక పదకవిత్వ

చరిత్రము, సంగీతశాస్త్రములో క్షేత్రయపదముల విశిష్టత, క్షేత్రయ మధురభక్తి, క్షేత్రయ పదములలో పూర్వ పదకవుల ఛాయలు మొదలైన అనేక విషయాలను గూర్చి చర్చించడంలో సంపాదకులు అమూల్యములయిన అనేక విషయాలను తెలిపారు.

క్షేత్రయ జన్మస్థలం కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామమే అనీ, అక్కడి మువ్వగోపాల స్వామికి అంకితములు గానే క్షేత్రయ్య తన పదములను రచించినాడని సంపాదకులు ఇందులో నిరూపించారు. కాని క్షేత్రయ జన్మస్థలం చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకాలోని మొవ్వ గ్రామమనే అధునాతనుల వాదాన్ని ఖండించడంలో నిమగ్నులై మువ్వ ఉత్తరార్కాడు జిల్లాలోని మూవపుర (Moovapura) మని వ్రాసిన కీర్తనాచార్య సి.ఆర్. శ్రీనివాస అయ్యంగారి వాదమును సంపాదకులు విస్మరించినటుల వున్నది. ఆ వాదాన్ని కూడా సోపపత్తికంగా ఖండించి వుంటే బాగుండేది. ఇతర స్థలాల్లో ఎక్కడా మొవ్వగ్రామం వున్నట్టుగా గుర్తింపబడకపోవడం, కృష్ణాజిల్లాలో మొవ్వ గ్రామం వుండడం, క్షేత్రయ్య మువ్వపురిగోపాల అని పేర్కొనడం ఆ గ్రామంలో మువ్వగోపాలస్వామి దేవాలయం వుండడం, అందులో క్షేత్రయ్య వంశీకులు అని చెప్పుకుంటున్న వారు వుండడం, మువ్వకు దగ్గరలోనే వున్న కూచిపూడిలోని భాగవతులు సాంప్రదాయికంగా పాడి అభినయిస్తూ వుండడం వారి వాదానికి బలమును చేకూరుస్తూ వున్నవి. కానయితే నేడు మొవ్వగ్రామంలో వుంటున్నవారి ఇంటిపేరును బట్టి క్షేత్రయ్య ఇంటిపేరు 'మొవ్వ' వారని నిర్ణయించడం కొంత సాహసమే. ప్రబలములయిన కారణాలే క్షేత్రయ్య నివాసస్థలం కృష్ణాజిల్లాలోని మొవ్వగ్రామమే అని నిరూపించగలుగుతున్నా సంపాదకులే పీఠికలో క్షేత్రయ్య పాడిన పాదములను బట్టి క్షేత్రయ్య దర్శించినవిగా గుర్తించిన దైవతములు, క్షేత్రములు, చాలవరకు దత్తమండల ప్రాంతములలోనివై వుండడం విచారింపదగిన విషయం. అందులోనూ కొన్ని అప్రసిద్ధములయిన, సాధారణంగా దక్షిణదేశ యాత్రికునికి మార్గంలో తగులని గ్రామదైవతములమీద క్షేత్రయ్య



పదాలు చెప్పి వుండడంచేత క్షేత్రయ్య ఈ ప్రాంతాలవారే యేమో అనే సందేహానికి కూడా అవకాశం కలుగుతూ వుంది. క్షేత్రయ్య ఈ ప్రాంతాలవాడు అనే ప్రవాదం కూడా ఈ సందేహానికి కొంత బలం. తాళ్ళపాకతిమ్మక్క సుభద్రాకల్యాణంలో–

**పుండరీకాక్షుడా–పురుషోత్తముడ**

**మురవైరి వందిత–మువ్వగోపాల**

**నారద వినుత యా–నందముకుంద**

**మత్స్యావతార నా–మనవి చేకొనుము'**–అన్నచోట పేర్కొన్న 'మువ్వగోపాల' అనే పదం కూడ యెక్కడో కృష్ణాజిల్లాలో వుండే మొవ్వలోని మువ్వగోపాలస్వామిని పేర్కొనునది కాక తిరుపతి ప్రాంతంలోని మువ్వగోపాలస్వామినే పేర్కొనేదిగా వుండి ఈ వాదానికి ప్రాణం పోస్తూ వుంది. ఇక్కడ ఒక్కచోట మాత్రం మువ్వగోపాల అనే పదానికి మువ్వలు ధరించిన గోపాలుడని కాని, మువ్వల వేణుగోపాలుడని పేరుగల కార్వేటినగర వేణుగోపాలుడని కాని అర్థం చెప్పుకోవడం అసహజంగా అగుపించక పోదు. ఇదిగాక చిత్తూరు జిల్లాలోని 'మువ్వలవారిపల్లె' జమీందారీ గ్రామము నేడు గుర్తింపబడనంత మాత్రాన గవర్నమెంటు రికార్డును తప్పనజాలము కదా! క్షేత్రయ్య తిరిగిన స్థలములు సంపాదకులొసగిన పట్టికను బట్టి విజయనగరము వద్ద తుంగభద్రాతీరమున ఉన్న హేమాద్రి, కడప, కడపజిల్లాలోని ఇనంబ్రోలు, కర్నూలులోని పాలగిరి, తిరుపతి, తిరువళ్లూరు, సత్యవీడు† (ఇది చిత్తూరి జిల్లాదని యున్నది. అది సరి కాదు. చెంగల్పట్టు జిల్లాలోనిది), చక్కెరపురి, (యిది చక్రపురియై యుండును. ద్విపద నలచరిత్రకారుడైన చక్రపురిరాఘవాచార్యుల తాత చక్రపురి దొడ్డయాచార్యులు షోలింగరులోని కందాళదొడ్డయాచార్యుల శిష్యుడు * చక్రపురి దత్తమండల ప్రాంతములలోనిదై యుండును.) కంచి, శ్రీరంగము, మధుర, శ్రీశైలము, కోవళ్లూరు, చిదంబరము, మహాదేవపట్టణము ఇత్యాదులు.

† ప్రస్తుతం సత్యవేడు చిత్తూరు జిల్లాలోనే ఉంది. (సంపాదకుడు)

*చూడుడు నలచరిత్ర ద్విపద–పీఠిక– ; పండితారాధ్యచరిత్ర పీఠిక పుట 140

ఇందులో దక్షిణదేశములోనివి మినహాయించగా తక్కిన స్థలములన్నియు దత్తమండల ప్రాంతములవే అయి యుండుట గమనార్హము. 299 వ పదములో 'వేదపురి నిలయు' దని కలదు. ఈ వేదపురి ఎక్కడిదో తెలియరాలేదని సంపాదకులు వ్రాసిరి. అది బహుశః 'వాదపురి' అయియుండును. చిదంబరమునకు వాతపురి, వాదపురి అనుపేళ్లు కలవు. క్షేత్రయ్య చిదంబరమునకు పోయి తిల్లగోవిందుని మీద పదములు చెప్పినవాడే కనుక 'వాదపురి'– చిదంబరమగు ననుట సమంజసమే అగును. రావిపాటి తిప్పన్న త్రిపురాంత కోదాహరణములో 'వాదపురి' పేర్కొనబడినది.

క్షేత్రయ్య దర్శించిన స్థలములను బట్టి మాత్రమే కాక అతడు తన పదములలో వాడిన భాష, నానుడులు, పదప్రయోగములు, కారకములు కూడ కొన్ని అతనికి దత్తమండల ప్రాంతీయతను ధ్రువపరచుచున్నవి.

13 వ పదములో–

"పామాడి జోగివలె పాయె (పోయెననుటకు) నా బ్రతుకు" ఇందు పేర్కొనబడిన పామాడి లేక పామడి అనంతపురముజిల్లా లోనిది. ఆ గ్రామములో మెట్టవేదాంతులు ఎక్కువ. వారిటు ఇహమునకు అటు పరమునకు చెడినవారగుదురు. అందుచే నా బ్రతుకు పామాడి జోగి బ్రతుకువంటి దైనదని ప్రియవంచిత అయిన నాయిక అనుచున్నది. దత్తమండలములలో వ్యవహారమున నున్న ఈ సామెతను వాడిన క్షేత్రయ ఆ ప్రాంతముల వాడనుట సత్యదూరము కాజాలదు. ఇదిగాక, వక్కలాకులు, పద్దు (పంతము అను నర్థములో), లోకాస్తమానమైనట్లు, రెండు దలచుట, మోడిచేసుకొనుట, ఎగబోయుట, పాలకుడిగి, నిత్యనిత్యము, పూలంగిసేవ, కుయ్యకు, పటాని పూలపావడ, చెప్పి చాలాయె అనే ఈ పదాలు దత్తమండలాలలో కానవస్తున్నవి.

ఇందుచేత క్షేత్రయ్య జన్మస్థలం మొవ్వ గ్రామమే అయివుండినా జీవితకాలంలో చాలాభాగం రాయలసీమ ప్రాంతాలలో తిరిగి జీవితపు రుచులు



అనుభవిస్తూ తంజావూరుకు వెళ్ళివుంటాడని అనుకోవడమో, యీ ప్రాంతాలలోనే నేడు గుర్తింపబడని మువ్వగోపాలస్వామి ఆలయం వుండే 'మువ్వపురి' వుండి ఉండునని అనుకోవడమో సమంజసం అవుతుంది.

సంపాదకులు క్షేత్రయ్య రచించిన కొన్ని పదములను బట్టి అతడి జీవితచరిత్ర ఇట్టిదని చెప్ప బూనడం ఒకవిధంగా సాహసమే అవుతుంది. కవీశ్వరుని చరిత్ర అందదుకులుగా మనకు లభించినప్పుడు అతడి రచనలో అతని జీవితంలోని ఘట్టాల ఛాయలుగా కనబడే వృత్తాంతాన్ని బట్టి కవి జీవితచరిత్రను పోల్చుకోవడం, పూర్వచరిత్రను పరిపుష్టపరచుకోవడం కొంతవరకూ సమంజసమే అయినా మొదటి నుండి తుది దాకా అంతా వూహలతోనే కథ అల్లడం చాతుర్యమయితే కావచ్చుగాని చరిత్ర కాజాలదు. వరదుని మీద క్షేత్రయ్య రచించిన పదాలను బట్టి సంపాదకులు క్షేత్రయ్య జీవితచరిత్ర ఇట్టిదై వుంటుందని వూహించి చెప్పిన కథ కేవలం కట్టుకథ. క్షేత్రయ్య జీవితచరిత్ర అట్టిదే అయివుంటుందని మనం నిశ్చయించడం సమంజసం కాదు. విశేషించి క్షేత్రయ్య విజయరాఘవనాయకునిమీద చెప్పిన 'సామాన్యము గాదె వాని పొందు' అనే పదంలోని విషయాన్ని క్షేత్రయ్య జీవితచరిత్రకు సంబంధించినదిగా చెప్పడం సమంజసంగాదు. ఆ పదంలో క్షేత్రయ్య తన విషయం చెప్పుకోలేదు. విజయరాఘవనాయకుని విషయం చెప్పినాడు. నామమాత్రంగా విజయరాఘవ నాయకుణ్ణి పేర్కొని తన విషయమే అందులో చెప్పుకొన్నాడని చెప్పడం కుదురదు. ఎందుకంటే విజయరాఘవ నాయకుడు నిజంగా అట్టివాడు. ఆ పదంలోని విషయం విజయరాఘవ నాయకుడికి అక్షరాలా సరిపోతుంది.

శృంగారరసమంజరిని గూర్చి వ్రాస్తూ 'పదములను వ్రాయుటలో అలంకారశాస్త్రములోని రసమంజరిలోని శృంగార ప్రధానములగు సర్వలక్షణములకును లక్ష్యములను వ్రాయుట క్షేత్రయ్య యొక్క అభిప్రాయమని సంపాదకులు వ్రాయడం కూడ సత్యం కాదు. కాంతాజనం యొక్క మనస్తత్వమూ, వారి అభిరుచులూ, రహస్యాలూ, పలుకులూ, కులుకులూ చక్కగా ఎరిగివుండిన

క్షేత్రయ్య రసతన్మయుడై తన ఎరుకనంతా ముంచిఎత్తుతూ భావావేశంతో పదాలు రచించినాడు గాని రసమంజరిని దగ్గర పెట్టుకొని అందులోని లక్షణాలకు లక్ష్యాలుగా పదములు రచించలేదు. శృంగారరసమంజరికారుడు రసమంజరిని అనువదిస్తూ అందలి లక్షణాలకు లోబడే కొన్ని మువ్వగోపాల పదాలను, ఇతర పదాలను లక్ష్యాలుగా పేర్కొన్నాడు. వివిధ నాయికా నాయక లక్షణాలకు సరిపోలుతూ వున్న లక్ష్యాలు మువ్వగోపాల పదాలలోనూ, ఇతర పదాలలోనూ వుండడం గుర్తించి శృంగార రసమంజరికర్త ఆయా నాయికాది లక్షణాలకు లక్ష్యాలుగా కొన్ని పదాలను పేర్కొనినాడు. అంతేకాని క్షేత్రయ్య రసమంజరిలోని లక్షణాలకు లక్ష్యాలు వ్రాసే వుద్దేశంతో ఈ పదాలు రచించలేదు.

క్షేత్రయ్య అన్నమయ్యను అనుకరించాడని చూపిన ఉదాహరణములలో పోలిక లంతగా కానరావడం లేదు. ఆ ఉదాహరణలు ఒకరినొకరు అనుకరించినట్టుగా గాక వారివారి ప్రత్యేకతతోనే ప్రతిభాసిస్తున్నవి. పచ్చి శృంగారాన్ని బాహాటంగా తనివిదీర తన మనసార పదములలో ముంచెత్తిన క్షేత్రయ్య పదాలలో అధ్యాత్మతత్వమున్నదని గాని, అందు మధురభావ మిళితమైన రాధాకృష్ణతత్వము- అదే మధురభక్తి-ఉన్నదని గాని చెప్పడం అత్యుక్తి. క్షేత్రయ్య కళామధురమూర్తి! రసైక చక్షుష్కుడయిన భావుకుడు!

అనేక తాళపత్రాలు, వ్రాతప్రతులు పరిశోధించి ముందు అచ్చయిన గ్రంథాలలో లేని సుమారు తొంభై పదాలను సేకరించి అకారాది క్రమంలో మొత్తం మూడువందల ముప్పై పదాలను చక్కని కాగితాల మీద ముచ్చటగా ముద్రింపించి క్షేత్రయ్య సాహిత్యాన్ని మన కందించిన శ్రీవిస్సా-అప్పారావు పంతులుగారు వందనీయులు. వారి అమూల్య కృషి ఫలోన్ముఖం కావడానికి కారకులయి ఈ అమూల్య గ్రంథాన్ని ఆంధ్రలోకాని కర్పించే భాగ్యం ఆంధ్ర గానకళాపరిషత్తు పొందింది. క్షేత్రయ్య పదప్రయోగములను గూర్చి శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు వ్రాసిన కృతిప్రశంస, శ్రీజమ్ములమడక మాధవరామశర్మగారు 'క్షేత్రయసాహిత్యము' అనే పేరుతో వ్రాసిన వ్యాసమూ



ఇందులో ప్రకటింపబడినవి. క్షేత్రయ్య పదప్రయోగ విశేషాలలో కొన్నింటిని మాత్రమే శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు దిఙ్మాత్రంగా పేర్కొన్నారు. ఇంకా క్షేత్రయ్య ప్రయోగించిన అనేక పదముల స్వరూపాలను గురించి, వాటి విశేషాలను గురించి చెప్పవలసిన సంగతులు చాలా వుండిపోయినవి. ఈ పదములలోని నానుడులను, సామెతలను ఏర్చి శ్రీ విస్సా-అప్పారావుగారు ప్రత్యేకంగా ప్రకటించి భాషాపరిశోధకులకు చాలా సౌకర్యం చేకూర్చారు. అచ్చువేయబడిన పదాలు ఇంక కొంత ప్రామాణికంగా పరిష్కరింపబడి వుంటే బాగుండేది. యతిస్థలాలు కొన్ని స్థలాల్లో సరిగా గుర్తింపబడకపోవడం, చరణములలోని పాదవిభజన కొన్నిచోట్ల సరిగా లేకపోవడం అర్థదృష్టితో కొన్ని తప్పులు దొరలడం, మొదలైన కొన్ని చిన్నచిన్న పొరబాట్లు మినహాయిస్తే సంపాదకులు ఈ గ్రంథ పరిష్కరణంలోనూ, ముద్రణంలోనూ చూపిన ప్రత్యేక శ్రద్ధ ప్రశంసనీయం.

గ్రంథభాగంలోని ముద్రణ స్ఖాలిత్యాలు కొన్ని-

101 వ పదము రెండవచరణ మిట్లున్నది.

**" సరివారు గైకొన్నట్లు యెచ్చైన**
**సరిగ కోకల సరసముగాను**
**యింటి వెచ్చానికై పదిరూక లమర్చినావా**
**యిక యేమో యొక**
**మంచి వలువతోనే అల్లునికి**
**ధర నైశ్వర్యము వచ్చితే అ-**
**ర్థరాత్రి గొడుగు బట్టినట్లు-**

106వ పదములో-

**'మువ్వగోపాల నీ- మనసు దెలిసె లేరా'** అని ఉండవలెను. మువ్వగోపాల అని ముద్రితము.

131 వ పదములో-

మూడవ చరణములో ప్రథమ పాదము

**'చెలియ మువ్వగోపాలుడైన శ్రీ వేంకటేశుని'** అని ఉండవలెను.

137 వ పదములో-

**వలచిన దాని గూడి-వాడిందు రాడాయె**-అని ఉండవలెను.

151 వ పదములో-

మూడవ చరణములోని పాదములు తారుమారుగా ముద్రింపబడినవి. ఆ చరణ మిట్లుండవలెను.

**మదనునికేళికి బెదరే వేమె**
**బెదరి భయంబున జూచే వేమె**
**మమతదీర ముద్దీయ వదేమె**
**మడుపు లీయ చెయ్యాడ దదేమె-**

157 వ పదములో-

**మానినిరో నిన్న-మాపటివేళలో**-అని ఉండవలెను. నిన్ను అని ముద్రితము.

172 వ పదములో-

ప్రథమ చరణములో

**కన్నెల వీడముతో-కాటుక మోవితో**
**వెన్నుని కీల్జడ-వేటుతోను-**

అని యున్నది. **'వెన్నున'** అని మాత్రము తప్పొప్పుల పట్టికలో సవరింపబడినది.

**'కన్నుల వీడెముతో-కాటుక మోవితో**
**వెన్నున కీల్జడ- వేటుతోను'-**

అని ఉండదగును.



వీడెము వేసికొన్న నోటితో ఎవతో మువ్వగోపాలుని కన్నుల ముద్దు పెట్టుకొనినది. అందుచే అతని కన్నుల కామె పెదవులమీది వీడె మంటినది. ఇతడా నాయిక కాటుక కన్నులను ముద్దు పెట్టుకొనగా ఇతని మోవికి ఆమె కన్నులలోని కాటుక అంటినది. కనుక **'కన్నుల వీడెముతో-కాటుక మోవితో'** అనుట సమంజసము. రెండవ చరణములో **'నిద్దుర మబ్బుతోను'** అని ఉండవలెను.

189 వ పదము-

**వలచేది యొకరి కోసమా? - ఓర్వలేని-చెలులంటేనే రోసమా** అనే పల్లవితో ప్రారంభము కావలెను. ఇది అనుపల్లవిగా ముద్రితము-

198 వ పదములో-

**చెలగి మోమున మోము-జేర్చి ముద్దాడుచు నుండ**-అని ఉండవలెను.

235 వ పదములో

ప్రథమచరణ మిట్లుండవలెను.

**తియ్యని కెమ్మో వాని-తేనె లానుచును**
**సయ్యాటమున ప్రొద్దు-జరపనొప్పేవా**
**పయ్యెద తొలగించి-పాలిండ్లపై నొక్క**
**చెయ్యెన వెయ్య నొప్పేవా**

241 వ పదములో కడపటి చరణము.

**'మువ్వగోపాల రమ్మని-ముద్దుబెట్టి కూడగాను**
**పువ్వుబోణి మోవి తేనె-భుజియించిన చవి దలచి'**

అని ఉండవలెను. ఈ రెండు పాదములకు మధ్య రెండవ చరణములోని **'మరువ వెరవు గొనరట'** అను పాదమునకు పాఠాంతరము కాబోలు **'ముదువ వెరవుగాన నకట'** అను పాదము తప్పుగా పడినది.

245 వ పదములో కడపటి చరణము.

**'సకియ నీ చన్గవలు**
**సంగటి కొండలందురు గాని**
**కొండలైతే-**
**కోటతలుపు లేవే**
**యిక నేమి సేయుదును మువ్వగోపాల-**
**యిదిగో పాలిండ్లపై**
**తర్కింప రవికముడి తలుపు గాద'**
అని ఉండదగును.

251 వ పదములో-

**'మాలిమి తోడను-మువ్వగోపాలస్వామి'** అని ఉండవలెను.

252 వ పదములో

**'బాళి తాళ జాలలేనని తా-బలికినదే గురుతు'** అని ఉండదగు. **తానని నదే గురుతు** అని ముద్రితము.

261 వ పదములో

**'మూవగోపాలా-ముచ్చట లేలా**
**నా విధిగాని ని-న్నన బనిలేదు'**

అని ఉండదగు పల్లవికి అనుపల్లవికి ప్రాసమును ఇతడు ప్రతిపదమునకు పాటించినాడు. మువ్వగోపాల-అని ముద్రితము.

267 వ పదములో

రెండవ చరణమున ఆరు పాదములు కలవు. మూడవ పాదము 'అలసి **మువ్వగోపాలుడు-అనిశము ననుగూడి'** అన్నంతవర కుండవలెను. కడపటి రెండు పాదములకు ఈ చరణమునకు సంబంధము లేదు. అది వేరొక



చరణములోని తునుకయై ఉండును. మూడవ చరణము ప్రారంభము **'యేప్రొద్దు ప్రాణవిభుల'** అని ఉండవలెను. దాపున గూడున్న- అన్నదానితో ప్రాసము.

282 వ పదములో

**'చెలువుని జూచి మోహించి-**
**చేకొని యెవతె యున్నదో'**

అని ఉండవలెను. **చేకొన దెవతె** అని ముద్రితము. అర్థము కుదరదు.

306 వ పదములో

**పగదాయ పూవింటివాడు-**అని ఉండవలెను. **పగదాయె** అని ముద్రితము.

విజయరాఘవ ముద్రలో 9వ పదము కడపట.

**'కేడెంపు వజ్రాల కమ్మలు ఆ రాణికైతే**
**జోడించిన వుంగరమ్ములు నాతో నైతే**
**జాతిగానె యిచ్చకమ్ములు-ఓరోరి జాణ'** అని ఉండదగును.

ఇప్పటివరకు ఉపలబ్ధము లయిన పదాలన్నీ ఒకచోట చేర్చుకోవడం జరిగింది గనక ఇక తరువాత క్షేత్రయ్య రచనా రీతులను బట్టి ఆ యా పదాలను ప్రామాణికంగా పరిష్కరించుకొనడం మన వంతు. బహుశ్రమ కోర్చి ఈ పదాలను సేకరించి చక్కగా ముద్రించి రసిక ప్రపంచాని కంతటికీ అందజేసిన శ్రీ అప్పారావు గారికి ఆంధ్రలోకం ఋణపడి వుంది. సంప్రదాయపద్ధతిని స్వరపరుపబడిన క్షేత్రయ్య పదములను గూడ ఆంధ్రగానకళా పరిషత్తువారు త్వరలో ప్రకటింతురుగాక!

# 8. విజయరాఘవపదములు

శ్రీకృష్ణరాయల కాలమున ప్రోదిగొని తీగసాగిన ప్రబంధకవిత విద్యానగరము నుండి తంజావూరున కెగబ్రాకి మూడు పూవులు ఆరు కాయలు కాచినది. రాయలనాటి ప్రబంధములలోని శృంగారము రసికులకు వెఱ్ఱి పుట్టించినది. ప్రజా హృదయముల చక్కగా గురుతించిన తంజావూరుకవులు తమకావ్యములలో శృంగారమును పచ్చిదేర పిచ్చిదేర వర్ణించినారు. అవి చదివి నాటి ప్రజ రస తన్మయమైనది. ప్రజల మనః ప్రమాణస్థితికి దిగివచ్చిన ఆయా కవీశ్వరులను హృదయములలోనే కొండాడినది. అంతటితో ఆగలేదు. అంతటితో వారికి తనివి కలుగలేదు. పండితమాత్రైక వేద్యముగా నున్న ఆ ప్రబంధకవిత వారి కందుబాటులో లేకుండినది. శృంగారోన్ముఖమయిన నాటి ప్రజాహృదయము దీనిని గాదని ఇంక దేనినో వెదకసాగినది. ఇంక ఏదో వచ్చి దీని చోటున పీఠము వేయవలయునని దాని తలపు. సాహిత్యములో ఒక ప్రశాంత పరిణామము దాని వాంఛితము. సాహిత్యములో ఒక నవయుగమున కది ఎదురుచూచుచుండినది.

శ్రీ పదమున కొండకొమ్మున నిలిచి కో యని యెలుగెత్తి అన్నమయ్య కలకంఠము పాడిన పదము లింకను ప్రజాశ్రవణ కుహురములయందు ప్రతిధ్వనించుచునే ఉండినవి. సాహిత్యమాకందపు లేజివుళ్ల మెక్కి వగరెక్కిన ఆ కలకంఠము కలస్వనము వారికి రుచింపలేదు. అందులో వగరెక్కువ అని వారి తలపు. వారికి కావలసినది తీయందనము. తత్ఫలితముగా సాహిత్యపు బలుపు తగ్గించుకొని పదకవిత తీయదనముతో పలుచబారినది. తమ అభిరుచి ప్రమాణమునకు కవితను దింపుకొని ప్రజ పరితృప్తి చెందినది. రాజాస్థానములలో పండితజన సమక్షమున అభినయ విద్యావిశారదుల అంగబలముతో కవిజనాశీర్వాదముతో పదకవితకు పట్టాభిషేకము జరిగినది. తన తోడబుట్టువులు తనకొదిగి బరాబరు లొసగుచు తొలగి నిలుచుండగా పదకవిత



కవితా సింహాసనమెక్కి రసిక జనహృదయ సామ్రాజ్యముల జనరంజకముగా ఏలినది.

అది క్రీస్తుశకము పదునేడవ శతాబ్దము. పుణ్యలోపముచేత భూమిపై అవతరించిన దేవతలు– నాయకరాజులు దక్షిణకాశ్మీరమను చోళమండలమును పరిపాలించుచుండిన కాలమది. తెలుగు పదకవిత ఈ నాయకరాజుల కాలమున వీరి ఆదరణము వలన పెంపొందినది. నాయకరాజులు సంగీతసాహిత్యముల యందు నిష్ణాతులు. అందులో నచ్యుతప్పనాయుని కుమారుడు రఘునాథనాయకుడు సంగీతశాస్త్రమును లక్ష్యలక్షణసహితముగా నేర్చిన మహాపండితుడు. జయంతసేనాది రాగములకు, రామానందాది తాళములకు నితడు సృష్టికర్త. 'రఘునాథమేళ' అను వీణ నితడు నిర్మించినాడు. విజయరాఘవ నాయకుడితని కుమారుడు, మహాపండితుడు, సంగీతసాహిత్యనిధి. ఇతడు

**'తన తండ్రియే కులదైవం బటంచు**
**ననిశంబు గొల్చు మహారాజయోగి**
**శత సహస్రాధిక సకుటుంబ విప్ర**
**సతతాన్న దానదీక్షాధురంధరుడు**
**జీర్ణకర్ణాటక సింహాసనంబు**
**బూర్ణించి నిలిపిన పురుషరత్నంబు**
**కమనీయ రుక్మిణీకల్యాణ ముఖ్య**
**సమధిక నాటికా సంధాయకుండు'–** మరియు,

**'చతురంభోధిపరీత భూవలయ వా**
**స్తవ్యావనీ దేవతా**
**తతులభ్యంజన భోజనాదులను మో**
**దం బందగా బ్రహ్మాసం**
**తతి బాలించు నృపాలు'– డితండు,–**

ఇతని కవిత్వము,–

**ఒక్కొక యెడ జీనిచక్కెరపానకం**
**బానినట్లాహ్లాద మావహిల్ల**
**నొక్కొకయెడ దాని నెక్కొన విరవాది**
**సరము లెత్తినరీతి బరిమళింప**
**నొక్కొకయెడ జవులుప్పతిల్లగ మంద**
**మారుతంబులు వీచు మహిమ చెలగ**
**నొక్కొకయెడ మేన జొక్కు సంపాదించు**
**వెలది వెన్నెల తేట విధము మించ'**–ఉండును.

శృంగారరస తరంగిత పదకవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, విజయరాఘవ మహీపాల విరచిత కనకాభిషేకయు, మిగుల శృంగారంబు గన్పట్ట పదములు మృదురసాస్వాదము లగుచు రాణింప రచియించినదియు నగు పసుపులేటి రంగాజమ్మ, భారతికిం ప్రతి వచ్చునది ఇతనికి కూర్చు ప్రేయసి. మహారసికుడయిన ఆ మహారాజు సదాకాలము ఆమెతో వినోదించు చుండువాడట! పతివ్రత యయిన పట్టపురాణి ఈమెను నిందించుచు దాసి మూలమున ఏదో కబురు పంపినది. అపుడీమె చెప్పిన పద్యము.*

**ఏ వనితల్ మముం దలప నేమిపనో! తమ రాడువారు గా**
**రో! వలపించు నే ర్పెఱుగరో! తమ కౌగిలిలోన నుండగా**
**రా వది యేమిరా విజయరాఘవ! యంచిలు దూటి బల్మిమై**
**దీవరకత్తెనై పెనగి తీసుక వచ్చితినా తలోదరీ!**

ఇతని రసికతను సౌకుమార్యమును పేర్కొనునది మరొక పద్యము:–

**"రాజనిభాననా! సరసురాలవు జబ్బుగ నల్లినా వదే**
**మే"– "జడ యింతకంటెవలెనే"–"వలెనే, బిగియించి యల్లవే**

* చాటుపద్య మణిమంజరి ప్రథమభాగము



**యో జవరాల! వేరె పని యున్నది"."దోసమె దోసమే మహా**
**రాజగు నట్టి యవ్విజయ రాఘవు మై చిగురాకె కోమలీ!"**

చెంగళ్వకాళయ అను కవీశ్వరు డితనిపేర అనేక కావ్యములు రచించినాడు. విజయరాఘవచంద్రికావిహారమును రచించిన కామరసు వెంకటపతి సోమయాజి యితని 'పట్టంపుకవి'. గురురాజ పట్టభద్రుడు శతక్రతు శ్రీ కుమార తాతాచార్యుల వారు ఇతని గురువు. చంద్రరేఖ, కృష్ణాజమ్మ, రంగాజమ్మ ఇతని ఆస్థాన కవయిత్రులు.

పదకవిత కితని కాలములో లభించినంత ఆదరణ మంతకు మునుపు గాని, తరువాత గాని లభింపలేదు. నాడు గజ్జెకట్టి పదము పాడని వారిది పాపము! రసికుడైన ఇతడు తన కవీశ్వరులచే యక్షగానముల రచింపజేసి, దానిని తంజావూరి నాటకశాలలో ప్రదర్శింపజేసి, బిరుదు పాత్రలకు శారదాధ్వజాదు లొసగి సత్కరించువాడు. తెలుగులో చక్కని కవిత చెప్పనేర్చిన కవులు కూడ పదకవులకు నాడు లభించుచున్న సన్మానము విని పదకవిత్వ రచనమునకు తొడగిరి. విజయరాఘవుడు స్వయముగా అనేకపదముల విరచించినాడు.

ఇతని ప్రేయసి రంగాజమ్మ శృంగార రసతరంగిత పదకవిత్వ మహనీయమతిస్ఫూర్తి. పదకవితాచక్రవర్తి క్షేత్రయ్య తన పదములచే ఇతని ఆస్థానిని రసప్లావితము కావించినాడు.

క్షేత్రయ్య కృష్ణామండలములోని 'మొవ్వ' గ్రామవాస్తవ్యుడు. 'మొవ్వ' లోని గోపాలస్వామి పేర ఇతడు పదముల విరచించినాడు. తంజావూరులో పదకవితకు కలుగుచున్న ఆదరణ విని, ఇతడు "మొవ్వ' నుండి బయలుదేరి మార్గమున పుణ్యక్షేత్రములు దర్శించుచు, ఆ యా క్షేత్రదైవతముల మీద పదములు రచించి పాడుచు, తంజావూరును చేరుకొనినాడు. తంజావూరిలో నాడు

రఘునాథనాయకుని యేలుబడి సాగుచుండినది. క్షేత్రయ్య రఘునాథనాయకుని దర్శించి ఈ పద్యము జెప్పినట్లు ఆంధ్రకౌముదిలో కలదు.

**'మువ్వగోపాల భక్తేన క్షేత్రకవినా ఉక్తత్వాచ్చ'-**
**'తము దామె వత్తు రర్థులు**
**క్రమ మెఱిగిన దాతకడకు రమ్మన్నారా**
**కమలంబు లున్నచోటికి**
**భ్రమరంబుల నచ్యుతేంద్రు రఘునాథ నృపా!'**

రఘునాథనాయకు డితని చేరదీసి ఆదరించినాడు. మట్లవారి సంస్థానమునందుండిన కొంటెకోణంగి కవిచౌడప్పయు తంజావూరున కరుదెంచి రఘునాథనాయుని దర్శించినాడు. అప్పుడు అతడు చెప్పిన పద్యము-

**నేరుతు నని మాటాడను**
**వారిజభవునంత వానివశమా తంజా**
**వూరి రఘునాథనాయుని**
**వారి సభను గుందవరపు గవిచౌడప్పా!**

రఘునాథనాయుని ఆస్థానము నాడు కవితా కళాస్థానము! చేమకూర వేంకటకవి రఘునాథాంకితముగా విజయవిలాసమును రచించి సభాస్థలిలో వినిపించినాడు. వేంకటకవి పద్యమిది నాటి రాజపురుషుల కెల్లరకు ఉపస్థితము.

**ఎగు బుజంబులవాడు మృగరాజమధ్యంబు**
**పుడికి పుచ్చుకొను నెన్నడుము వాడు**
**నెఱి వెంద్రుకలవాడు నీలంపు నికరంపు**
**మెఱుగు జామనచాయ మేనివాడు**
**గొప్పకన్నులవాడు కోదండగుణకిణాం**
**కములైన ముంజేతు లమరువాడు**



**బవిరిగడ్డమువాడు పన్నిదం బిడి డాగ**
**వచ్చు నందపు వెన్నుమచ్చవాడు**
**గరగరనివాడు నవ్వుమొగంబువాడు**
**చూడగలవాడు మేలైన సొబగువాడు**
**వావి మేనత్తకొడుకు గావలయు నాకు**
**నర్జునుండు పరాక్రమోపార్జునుండు-**

అన్నమయ్య సతి తిమ్మక్క రచించిన * సుభద్రాపరిణయములోని మంజరిపాదము లీక్రిందివి పై వేంకటపతి పద్యముతో సంవదించుచున్నవి.

**'ఎగుబుజమ్ముల వాడు మృగరాజు నడుము**
**నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు**
**గరగరనివాడు చక్కనివాడు నతడు**
**గొప్పకన్నులవాడు కోదండగుణకి**
**ణాంకంబులౌ బాహు-లమరినవాడు**
**వెన్నున మచ్చగల విభవంబువాడు**
**బవిరిగడ్డము వాడు పన్నిదం బిడిన**
**వెన్ను పగడసాల వెస నాడవచ్చు**
**చిగురొత్తు చెంద్రిక చెలగు పాదములు'...**

'విజయవిలాసము'ను రచించుచున్న వేంకటకవి అంతకు పూర్వమే తిమ్మక్కచే రచింపబడి స్త్రీజన పాఠ్యముగా నున్న 'సుభద్రాకల్యాణము'ను చూచియే ఉండు ననుటకు సందేహము లేదు. తిమ్మక్క రచితములగు ఈ మంజరి పాదములను వేంకటకవి విజయవిలాసమున ఉపయోగించుకొని ఉండునని

* దీని నిటీవలనే శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యాపరిశోధనాలయములో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిరి.

తలచుటలో దోషముండదు. వేంకటకవి పద్యమును వినిన క్షేత్రయ అట్టిదే ఒక పదమును రచించినాడు. ఇది చూడుడు-

**యదుకులకాంభోజిరాగము- ఆదితాళము**

**పల్లవి**

ఎంత చక్కనివాడే- నా స్వామి వీడెంత చక్కనివాడే

**అను పల్లవి**

ఇంతి మువ్వగోపాలుడు సంతతము నా మదికి
సంతోసము చేసెనే ॥ఎంత॥

**చరణములు**

*మొలకనవ్వులవాడే- ముద్దుమాటలవాడే
తళుకారుచెక్కుట- ద్దములవాడే
తలిరాకు జిగిదెగ- దగుమోవి గలవాడే ॥ఎంత॥

చిఱుతప్రాయమువాడె- చెలువొందు విదియ చం
దురు గేరు నొసలచే- మెఱయువాడే
చెఱకువిల్తుని గన్న- దొరవలె నున్నాడే
మెఱుగు చామనచాయ- మేనమరువాడే ॥ఎంత॥

పొదువుకెందామర పెం- పొదవు పదముల వాడే
కొదమసింగపు నడుము- కొమరమరువాడే
మదకరికరముల- మఱపు చేతులవాడే
సుదతి మువ్వగోపాలు డెంత- సొగసుగలవాడే ॥ఎంత॥

రఘునాథనాయకుడు క్రీ.శ.1633 లో పరమపదించిన వెనుక అతని కుమారుడు విజయరాఘవనాయకు డేలిక కాగా ఇతడాతని దర్శించి అతనిపై

* ఈ చరణంలో చివరిపాదం లోపించింది. (సంపాదకుడు)



చలువచప్పరములో నుండి వేయి పదముల రచించి అతనిచే బహుమతి పడసినాడు. క్షేత్రయ పదమిది చూడుడు.

**మేరు పదము**

**యదుకుల కాంభోజి రాగము**

**ఆదితాళము**

**పల్లవి**

వేడుకతో నడచుకొన్న విటరాయడు
ఏడుమూడు తరములనుండి-యేదున్న కాణాచట

**అనుపల్లవి**

కూడుకొని మువ్వగోపాలుడు-కృపగల్గి నా విభుడు ॥వేడుక॥

**చరణములు**

మధుర తిరుమలేంద్రుడు-మంచి బహుమాన మొసగి
యెదుట గూర్చుండుమని- యెన్నిక లిమ్మనెనె
యిదుగో రెండువేల పదము- లెంచుకొమ్మనగ
చదురు మీద నున్నసామికి- సంతోష మింతింత గాదె ॥వేడుక॥

హొళి మీఱ తంజావూరి- అచ్యుత విజయరాఘవేంద్రుని
సొలుమనుజుల వెంబడిని- సరస పొడగాంచి
చలువచప్పరములో- చక్కగ వేయిపదముల
పలుకరించగానె- బహుమాన మిప్పించె నా వేళ ॥వేడుక॥

గోలకొండ పహదుషా- కొకవేళ నిలిచి
తొలసిమూర్తివారు- పిలిచినవేళ
వెలయ మువ్వగోపాలుడు- వెయ్యిన్నేనూరు పదములు
నలువది దినములలోగ నను- గలసి వినిపించెనే ॥వేడుక॥

ఈ పదములవలన క్షేత్రయ్యకవి మధుర తిరుమలేంద్రుని మీద రెండువేల పదములు, తంజావూరి విజయరాఘవునిపై వేయిపదములు, గోలకొండ పహదుషావారిపై వెయ్యిన్నేనూరు పదము మొత్తము నాలుగువేల అయిదువందల పదములను రచించినట్లు తెలియుచున్నది. ఇందు తంజావూరి విజయరాఘవనాయునిపై ఇతడు రచించిన వేయి పదములలో పది పదములు మాత్రమే నేడు లభించుచున్నవి.

క్షేత్రయ్య విజయరాఘవ నాయకుని రసికతను వర్ణించిన పదమిది-

**1. కాంభోజి- చాపు**

**పల్లవి**

**సామాన్యము గాదే వాని పొందు సామాన్యము గాదే**

**అనుపల్లవి**

**యేమి నేరని భామలు వాని కాసించేరె**
**యేమందు విజయరాఘవుడే సామి సుమ్మి**
**భూమియందు వాని గుణము లెన్న**
**రామలకు వీనుల విందు- ఓ చెలియ ॥సామా॥**

**చరణములు**

**పాయపు హొంతకారి గావలె- వాని ముద్దు**
**పదము వ్రాయ జదువ నేరవలె- కవితారచన**
**సేయ స్తుతర మీయవలె- ఆ వగలయందు**
**గాయకురాలై యుండవలె- ఓ చెలియ ॥సామా॥**

**ఆటకు మేటియు గావలె- తంబుర**
**గోటమీటి రాగమాలాపించవలె- వానిపై సొగసు**



**పాటలు వినికి చేయవలె- మనసు దెలిసి**
**మాటాడ నేరవలె- ఓ చెలియ ॥సామా॥**

**కప్పురపు బాగా లియ్యవలె- వాతెరతేనె**
**చిప్పిల్ల సగమా కియ్యవలె- తమి హెచ్చువేళ**
**తప్పక కెమ్మోవి నొక్కవలె- విజయరాఘవు**
**నప్పుడే పైకొని కూడవలె- ఓ చెలియ! ॥సామా॥**

కడపటి చరణమునకు పాఠాంతరము.

**చక్కెర కెమ్మోవి నొక్కవలె- అంతవానికి**
**దక్కిదక్కించుకోవలె- తమి హెచ్చేవేళ**
**గ్రక్కున వాని గూడవలె- వాడలిగితే**
**మ్రొక్కి వేడుకొనగా వలె- ఓ చెలియ! ॥సామా॥**

విజయరాఘవనాయకునిపై క్షేత్రయ్య రచించిన ఇతర పదములు శృంగారరస గుళికెలు, రసికుల కాస్వాద్యములు. *

**2. కాంభోజి- త్రిపుట**

**పల్లవి**

**గజరాజగమన యా- కపటము నే నే మెఱుగ**

**అనుపల్లవి**

**విజయ రాఘవేంద్రుని- వితము లీలాగే ॥గజరాజ॥**

**చరణములు.**

**చీనిగజ నిమ్మపండ్లు- చిలుకముక్కు నొక్కులచే**
**కానుక పంపించినందుకు- కారణమేమే**

* పయి పాదములన్నియు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాలలోని వ్రాతప్రతులనుండి సేకరింపబడినవి.

కానుక గాదే నీగుబ్బ- లూని పట్టి చందమామ
కూన లుంచేనన్న- గురుతు లీలాగె ॥గజరాజ॥

కొండొక చవి చూచి- కొఱికిన తియ్యమామిడి
పండు కానుక చేసిన- భావ మదేమే
పండు కానుక గాదె నీ- కండచక్కెర మోవి
పండుగంటి చేసేనని- పలికినలాగే ॥గజరాజ॥

వీరాధివీరు డచ్యుత- విజయరాఘవేంద్రుడు గంట
బారీ మొలనూ లంచిన- భావ మదేమే
బారి మొలనూ గాదె నీ- భావజు సామ్రాజ్యమెల్ల
తోరణము గట్టుకొన్న- దొరతనమింతే ॥గజరాజ॥

**3. భైరవి- త్రిపుట**

పల్లవి

ఇటువంటివాడు రానేలే- యిలాగైతే
మేటివేడుక తనమే

అనుపల్లవి

విటరాయ డచ్యుత- విజయరాఘవు డెంతో
వెఱచునమ్మదానికి- ఓ చెలియ ॥ఇటువంటి॥

చరణములు*

అలివేణిరో తనరాక చూచి చిలుక-
అయ్య వచ్చినాడంటేను- అందు
కళికీని నా యిల్లు దానింటి పొరుగని
చిలుకను దండింతువా

* ఈ పదంలో ఉన్నవి మూడు పాదాల చరణాలు (సంపాదకుడు)



ఇలలోన నిటువంటి మగవారి నడతలు-
ఎందైన కనుగొంటివా- ఓ చెలియ ॥ఇటువంటి॥

ఈ రాతిరి మా యింట పావురము
హెచ్చుతమి గలిగియుండ
సారె నా యుపరతి సద్దైతే పలుకక-
యూరకుండునటే
ఆ రతికూజిత మాపె వినీ నని-
అళికీ నేనేమి సేతునే- ఓ చెలియ ॥ఇటువంటి॥

కలికిరో అచ్యుత విజయరాఘవేంద్రుడు-
కంతుకేళి కూడగా
పలుమారు చప్పర గిలుకల పట్టెమంచము-
ఘలు ఘలు ఘలు మనగా
మెలతరో ఆ సద్దు ఆపె వినీనని-
మెల్లనే ననుగూడెనే- ఓ చెలియ ॥ఇటువంటి॥

**4. కాంభోజి- ఆది†**

పల్లవి

సుదిన మాయెనే యా ప్రొద్దు-సుదినమాయెనే యా

అనుపల్లవి.

మదనావతారునిసేవ- మనకు గలిగెనే ॥సుదిన॥

చరణములు

ప్రొద్దున నిలువుటద్దము- బొడగన్నఫలము- ఈతని
ముద్దుమోము జూడగలిగె- ముద్దులగుమ్మ ॥సుదిన॥

† ఈ పదము ముద్రితము

ఈ ప్రొద్దు పూర్ణ కుంభము- లెదురైన ఫలము- ఈ
భూపాలకుంజరుని నే- బొడగంటినమ్మ ॥సుదిన॥
ద్విజరాజుల సేవించిన- దివ్యశకునము అచ్యుత
విజయరాఘవేంద్రుని యా- విడిదిలో గంటి ॥సుదిన॥

**5. కాంభోజి- త్రిపుట**

పల్లవి

బాల పంద్రెండేళ్ల- గోల సుమీ యిక
తాళదు గాసికి- దయ లూరను

అనుపల్లవి

లాలించు మీ ముద్ద- రాలిది గాయకు
రాలుగాదు విజయ- రాఘవసామి ॥బాల॥

చరణములు

కొమిరె మరునిచేతి- కూన సుమీ నీకు
అమరిన చిత్రపు- అతివ సుమీ
సమరతి యుపరతి- చౌశీతి బంధముల
క్రమము నేర్పెదవొ కాక- కొసరేవొ గనుక ॥బాల॥

తొయ్యలి బంగారు- తునుక సుమీ- మరు
కయ్యాన గొసరకు- నెయ్యముతో
తియ్యని మోవిచ్చి- దిద్దుకొందువుగాని
శయ్యపట్ల రారాపు- సలుపకుమీ జాణ ॥బాల॥

తరుణులలో మేలు- తరముసుమీ నిన్ను
మరుకేళి జొక్కించు- మగువసుమీ



కరియాన విజయరా- ఘవ యెట్టి దొరకైన
దొరకని యా యింతి- దొరకె నెఱజాణ. ॥బాల॥

**6. కాంభోజి- త్రిపుట**

పల్లవి

ఇంతా నా పొరుగింటనె- తావు లేనట్ల
యింతా నా పొరుగింటనె

అనుపల్లవి.

ఇంతి! విజయరాఘ - వేంద్రుని వేడుకతన ॥మింత॥

చరణములు

ప్రొద్దుబోదు గా- బోలు చాలునమ్మ దాని
యొద్దనున్న సుద్దులే- అందుచేత-
నిద్దుర బట్టక- నే నుంటే దానికి
ముద్దుమీద ముద్దులే- అది
కద్దోలేదో మా- కలికి నడిగెదనని
సద్దు వినలేకను- సకియ యూరకుండితి ॥ఇంతా॥

వారిజాక్షిరో! నే విన- వలె నంటను
కేరడంపునవ్వులే- దానింట న
వ్వారి కుంకుమ క-స్తూరి గాక మితి
మేరలేని పూవులె- సారె
సారెకు దానింటి వా- సన అందువచ్చితె
యోరువజాలక- యువిద యింట నుండితి ॥ఇంతా॥

భావజుకేళి నా- పదతి గూడెదువేళ
పావురంపు బలుకులె- అదియుగాక

ఆ వేళ ననువీడ- నని నమ్మిక లిమ్మని
యాపెకెంత కులుకులే- యిక మీద
నా వద్దికి రాదో- నాతో మాటలాడదో
యీ విజయరాఘవు- డెలమితో నుండేది ॥ఇంతా॥

### 7. కాంభోజి- త్రిపుట

పల్లవి

గిలిగింత లయ్యీరా- చక్కని సామి- చ
క్కిలిగింత లయ్యీరా

అనుపల్లవి

గిలిగింత లయ్యీరా- కలికి విజయరాఘవ
మొలకచన్నులు పంటి- మొనను నొక్కకు మెల్ల ॥గిలిగిం॥

కురులుగూడని చిఱుత- పరువాన నన్ను నీ
వరులుమరులు రేచి చాల- నలయింపుచు
విరవాజిశయ్యపై- మరుని యంత్రములచే
పరిపరివగబలుకు- పలుకు నా చెవిసోక ॥గిలిగిం॥

వలువనేరని లేత- వయసున నన్ను నీ
పలుకులను చొక్కుపొడి చల్లి- కళరేచును
మొలనూలు దూసిపోక- ముడిలోపల చేయివేసి
జిలిబిలి సేతలు నీవు- సేయకుమయ్య మ్రొక్కేను ॥గిలిగిం॥

అక్కఱ దెలియని- యరవిరి పాయానా
దక్కిన వానివలె- తప్పు మ్రొక్కులు మ్రొక్కుచు
పక్కలోనె పవ్వళించి- బాస లెన్నైన జేసి
యక్కునజేర్చి లోదొడ- లందు నొక్కకు మెల్ల ॥గిలిగిం॥



### 8. సైంధవి- చాపు *

పల్లవి

దొంతరవీడెముతో నా- చెంత రాకుర నీకు నాయానా

అనుపల్లవి

ఇంతకు నే దాళగలనా- యేర విజయరాఘవ జాణ! ॥దొంతర॥

చరణములు

జగ్గు గుల్కు మైబుక్కాతావి- చప్పరించిన నీదు కెమ్మోవి
నిగ్గులొసగి లత్తుకఠీవి- నీటుతోడనూ
యెగ్గుచేసి నా యెదుర- యీలాగు నాతో బొంకుదుర
దర్గర నిల్వకు పదర- దానికేను తాళగదర ॥దొంతర॥

సిబ్బెంపు గుబ్బల పోటు- చిమ్మరేగిన కీల్జడవేటు
మబ్బుమీఱిన నిద్దుర పాటు- మఱపుతోడను
దబ్బఱ లాడేవు చాల- దానిదే గదర యీ శాల
గబ్బితనము నీకేల- కలికితో మాటాడు మీ వేళ ॥దొంతర॥

చక్కని విజయరాఘవ ధీరా- సామిగా నన్నేలితివౌరా
తక్కులాడింటికి పోరా- దయతోడనూ
ఎక్కడి వీవాడిన విరులు- చిక్కుబడెను నీ కంఠసరులు
నిక్కము దానిపై మరులు- నీవు దానింటికే తరలు ॥దొంతర॥

### 9. సైంధవి- ఆదితాళము

పల్లవి

మేరగాదుర నీ విడిదికి- పోరా మ్రొక్కేరా ॥మేర॥

* ఇది ముద్రితము

చరణములు

మంటమారి మామకు న- న్నంటే మిగులరోసము
ఒంటి వెడలనీదు బావ- వింటే చాల మోసము
వెంటవెంట తిరిగేవు నా విభు- డింటనే నివాసము
కంటకుడు నా మఱది- కంటేను ప్రయాసము ॥మేర॥

సుదతియైన మా యత్త యా- సుద్ది నాడే విన్నది
వదినె నమ్మజాలదు తల- వాకిటనేయున్నది
పదర వల దీప్రొద్దు నీ- పద్దుచెల్లుచున్నది
అదిగో యీ వీధికొనను- ఆరుదూరొచున్నది ॥మేర॥

పల్లకి దొరవైతే నా- పయటలో చెయివేతురా
ఇల్లాలనక కలసిమెలసి- యింత గాసిచేతురా
యిల్లు వెడలనీదు సవతి యింతరట్టుసేతురా
తెల్లవారెను విజయరాఘవ- ధీరా యేమి సేతురా ॥మేర॥

**10. సావేరి- త్రిపుట**

పల్లవి

హితవైనచోటనే- హితవింతే కాని నే
నింపోదు నటర

అనుపల్లవి

వితరణగుణశూర- విజయరాఘవధీర
విందురా నామాట- లోరోరిజాణ ॥హిత॥

చరణములు

ముచ్చటై నేనొక్క- ముద్దు బెట్టెద నంటే
మో మెర్ర జేసితివి



పచ్చి దేరగ నది- పలుకెంపులుంచితే
బాగాయ ననియుంటివి- ఓరోరి జాణ ॥హిత॥

ఇందు నే చెయిబట్టి- యింటికి రమ్మంటే
యెంతనో కసరితివి
సందిట గోరులా- సకియ యుంచితే చాల
సంతోషపడి యుంటివి- ఓరోరి జాణ ॥హిత॥

ఇసుమంతసేపు న- న్నేలి విజయరాఘవ
యింటికి బొమ్మంటివి
రసికుడా దానింట- రాత్రి నాలుగుజాలు
రమ్యముతో నుంటివి- ఓరోరిజాణ. ॥హిత॥

* * * * *

రాగములలో తోడిరాగముపై క్షేత్రయ్యకు మక్కువ ఎక్కువ.తోడుగూడి పాడుటకు తోడిరాగ మెత్తినదని అతని అభిప్రాయము. ఈ పదము జూదుడు-

**కాంభోజి- త్రిపుట**

పల్లవి

ఎన్నటికొ నే నా కొమ్మను జూచేది
ఎన్నటికో నా మనసు చల్ల నయ్యేది ॥ఎన్నటి॥

అనుపల్లవి

వన్నెలాడి బన్నసరులు నా యురముపై
నూగాడగా నుపరతి గలసేది ॥ఎన్నటి॥

చరణములు

మేటి చందురకావిపావడపై బసిడి
పట్టుచేలము చాల పసమీఱ గట్టి

**కోటివేలకు గొన్న తాటంకముల నొప్పు**
**కోమలి చెక్కిళ్లు– కొసరి ముద్దాడేది. ॥ఎన్నటి॥**

**మోము మోమున జేర్చి మోవితేనియ బీల్చి**
**వేమారు నా మనసు నొకటిగా జేర్చి**
**కామశాస్త్రము చదివి కథలు చెప్పుచు నేను**
**కామినిని నెమ్మది గలసి కౌగిట జేర్చేది ॥ఎన్నటి॥**

**జోడుగూడి తోడురాగము పాడుచు**
**మేడపైనుండి మేలు మేలనుచు**
**వేడుకలతో దాని విడువక యెప్పుడు**
**తోడ బంగారు తూగుటుయ్యాల లూగేది ॥ఎన్నటి॥**

**చెలియరో మా మువ్వగోపాలరాయుడ**
**యెలమి నేల రాదని పలుకరించిన**
**చెలియ లందఱుగూడి నలినాక్షి వెతజూచి**
**నేడు రేపని రాక కెదురు చూచేది ॥ఎన్నటి॥**

* * * * *

పదరచనములకు పదరచయితలకు మొన్న మొన్నటి దాక తెలుగు సాహిత్య చరిత్రములో తగిన ఆదరము లభింపలేదు. పదముల సారస్యము గుర్తించి సాహిత్యములో వానికి సముచితస్థాన మొసగబడవలయునని తొలుత గుర్తించిన మహాపండితులు శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారు. ఆచార్యులవారు క్షేత్రయ్య పదములను మరల మరల పాడించుకొని విని ఆనందించు చుండువారట! క్షేత్రయ్య పలుకు పొంకమునకు ముగ్ధులై వారు వానికి ప్రామాణికతను చేకూర్చిరి. శబ్దరత్నాకరములో అన్నెకారి, అక్కఱకాడు, అన్నెము, కన్నెతికము అనుపదములకు క్షేత్రయపదముల నుండి ప్రయోగములు చూపి



వానికి పండితాదరణము లభింపజేసినారు. తమ ప్రౌఢవ్యాకరణములో క్షేత్రయ్య ప్రయోగములకు సాధుత్వము సిద్ధింపజేసినారు. తమ నిఘంటువులో క్షేత్రయ్య పదములలోని ప్రయోగములను ఇవ్వడాన్ని గురించి ఎవరో పండితు లాక్షేపింపగా, ఆచార్యులవారు* క్షేత్రయ్య యక్షరాక్షరమును ప్రమాణమే. క్షేత్రయ కవి కానినాడు తెలుగులో ఇక కవీశ్వరులు కవీశ్వరులు కారనిరట! ఆచార్యులవారికి క్షేత్రయపై గల ఆదరమట్టిది! క్షేత్రయపదముల యెడగల కవితా గౌరవ మట్టిది. ** 

---

* ఈపేరిట శ్రీ వే.ప్రభాకరశాస్త్రిగారు 'ఆంధ్రపత్రిక' లో రచించిన వ్యాసము జూడుడు.
** ఈ వ్యాసమునందలి చారిత్రక విషయములు 'తంజావూరు ఆంధ్రరాజుల చరిత్రము' నుండియు, 'కొందఱు తంజావూరు కవులు– పండితులు'– అను గ్రంథమునుండియు గ్రహింపబడినవి.

# 9. మరొక పదకవి- వంగలసీనయ్య

ఆంధ్రసాహిత్యచరిత్రమున దక్షిణదేశాంధ్రసాహిత్యము ఒక మధురాధ్యాయము.'గీతి సాహితీ మోహనవాణులు చెవులువట్టి యాడించిన' ఆర్జవశీలుడు రఘునాథనాయక రసికశేఖరుని ఆదరమున ప్రోదిగొని ఆంధ్రకవితా కల్పలత తంజావూరున క్రొంగ్రొత్త ప్రబంధకుసుమముల ప్రసవించినది. ఆ కుసుమములు క్రొత్తలు. సౌరభము మత్రమే కాదు. వానికి వర్ణాడంబరమును హెచ్చు. 'ప్రతి పద్యమునందు చమత్కృతి గలుగం జెప్పనేర్చిన' చేమకూర కలకంఠము దక్షిణదేశాంధ్ర సాహిత్య కేదారమున కవితాకల్ప శాఖిక మీదనుండి క్రోల్చిన మధురస్వరము తెలుగువారికి నాడు సమ్మోహనాస్త్రమయినది.

గీతిసాహితీ రసజ్ఞులచే తంజనగరము రసప్లావిత మగుచుండగా తంజాపురాంధ్ర నాయక రాజ్యమునకు తోడబుట్టువు మధుర మైసూరు రాజులతోడను, విజయనగర చక్రవర్తులతోడను నిరంతర యుద్ధములందు మునిగి తేలుచుండినది. దేశమున శాంతిలేదు. అందుచే తంజాపురమునందువలె మధురలో సంగీతసాహిత్యములు వెంటనే అభివృద్ధి గాంచలేదు.

తిరుమల నాయకుని కాలమున మధుర బలవంతమై, సుభిక్షమై విజయనగర చక్రవర్తుల అధికారమును కూడ ధిక్కరించి వర్ధిల్లినది. అప్పటినుండి మధుర సంగీత సాహిత్య కళలకు నిలయమయినది. తంజనగర ప్రభువుల వలెనే తిరుమలనాయకుడు తన రాజసభలో సంస్కృతాంధ్ర తమిళ కవులను, విద్వాంసులను చేర్చి ఆదరించి నాడు. రుక్మిణీపరిణయము, సత్యభామా సాంత్వనము అను తెలుగు ప్రబంధములను రచించి తిరుమలనాయకుని కుమారుడయిన ముద్దుఅళగిరికి కృతియిచ్చిన కామేశ్వరకవి తిరుమలనాయకుని వలన రాజసన్మానము పడసినాడు. నాటినుండి మధురనాయక రాజులకు సాహిత్యపోషణము, కవితావినోదము ఒక మధురక్రీడ అయినది.



తిరుమలనాయకుని మనుమడయిన విజయరంగ చొక్కనాథుని కాలము మధురాంధ్ర సాహిత్యమునకు ఒకమేలి పూలకారు. అతని కాలమున సంగీత సాహిత్యకళలు బాగా అభివృద్ధిగాంచినవి. విజయరంగ చొక్కనాథుని బాల్యములో మధుర రాజ్యమునకు చాల చిక్కులు కలిగినవి. యుద్ధముల వలన దేశశాంతి లేకపోయినది. దేశములో కరువు, అంటువ్యాధులు చెలరేగినవి. కాని విజయరంగ చొక్కనాథుని పితామహి అయిన మంగమ్మగారును, ఆవిడ క్రింద దళవాయిగను, ప్రధానామాత్యుడుగను నుండిన నరసప్పయ్యగారి చాకచక్యము వలనను ఆ చిక్కులు తొలగిపోయి దేశములో శాంతి యేర్పడి సుభిక్షమయినది. విజయరంగ చొక్కనాథుడు రాజ్యమునకు వచ్చునప్పటికి దేశము ప్రశాంతమై అతడు విద్యాగోష్ఠితో ప్రొద్దుపుచ్చుట కవకాశము కలిగినది. అతడు స్వయముగా శ్రీరంగమాహాత్మ్యము, మాఘమాహాత్మ్యము అను గ్రంథములను తెలుగువచనమున రచించినాడు. ఆయన రాజసభలో కవులు, గాయకులు అనేకులుండిరి. ఆయన సామంతులలో కొందరు తెలుగులో గ్రంథములు విరచించినారు. వీరిలో సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు ప్రముఖుడు. అతడు జైమినిభారతము, సారంగధరచరిత్రము అను వచనకావ్యములను, అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము అను ప్రబంధములను విరచించినాడు. అతని స్నేహితుడు శేషము వేంకటపతి తారాశశాంకవిజయమును రచించి విజయరంగ చొక్కనాథుని మంత్రులలో ఒకడైన వంగలసీనయామాత్యున కంకిత మిచ్చినాడు. వెలగపూడి కృష్ణయ్య మాలతీమాధవీయము, భానుమద్విజయము అను తెలుగు ప్రబంధములను, వేదాంతసారసంగ్రహమను తెలుగు వచనగ్రంథమును రచించినాడు. ఇతడు విజయరంగ చొక్కనాథుని దళవాయిలలో ఒకడగు సాంబయామాత్యునికి దగ్గర బంధువు. శృంగార రాధామాధవము, రాధికా సాంత్వనము అను ప్రబంధములను రచించి చొక్కనాథుని కాలములో మధుర రాజాస్థానములో నుండిన మేదండ్ల వేంకటపతికి మేనల్లుడు. వెలిదండ్ల ముద్దళగిరికవి విజయరంగ

చొక్కనాథుని కోరికపై సుదంతాపరిణయమను ప్రబంధమును రచించి శ్రీరంగనాథస్వామి కంకిత మిచ్చినాడు. మిత్రవిందాపరిణయము, కార్తికేయమాహాత్మ్యము అను రెండు తెలుగుప్రబంధములను, భాగవత రామాయణ వచనములను రచించిన కుందుర్తి వెంకటాచలకవి విజయరంగ చొక్కనాథుని ఆస్థానములో రాజసన్మానము పొందినాడు. పెద్దపూడి యెఱ్ఱయకవి యువజనహృదయరంజనమను గ్రంథమును రచించినాడు. ఆ కాలముననే తిరుమలకవి చిత్రకూటమాహాత్మ్యమను తెలుగు నాటకమును రచించి క్రొత్తదారి త్రొక్కినాడు. శ్యామరాయకవి రామాయణ వచనమును, శ్రీపతిరామభద్రకవి హాలాస్యమాహాత్మ్యమును విరచించిరి.

విజయరంగచొక్కనాథుని కాలమున తెలుగు సాహిత్యమట్లు బహుముఖముల అభివృద్ధిగాంచినది. అతని కాలమున ప్రబంధము లనేకములు రచింపబడినప్పటికిని ప్రధానముగా తెలుగున వచనవాఙ్మయ మతని కాలముననే ప్రారంభమయినదని మనము తలపదగి ఉన్నది. అతని రాజాస్థానములో తెలుగు వచనమునకే ఎక్కువ రాజాదరణము కలిగినట్లు తెలియుచున్నది.

వచన వాఙ్మయమునకే కాక 'మధుర' పదసాహిత్యమునకు కూడ పట్టుగొమ్మ అయ్యెననుట క్రొత్తగా తెలియవచ్చిన విషయము. పదసాహిత్య చక్రవర్తి క్షేత్రయ్య మధుర తిరుమలేంద్రుని దర్శించి

*** మధుర తిరుమలేంద్రుడు**
**మంచి బహుమాన మొసగి**
**యెదుట గూర్చుండు మని**
**యెన్నిక లిమ్మనెనే**
**యిదుగో రెండువేల పదము**
**లెంచుకొమ్మనగ**

* చూడుడు. విజయరాఘవ పదములు– భారతి– వికృతి భాద్రపదము (1950 ఆగస్టు–సెప్టెంబర్).



**చదురుమీద నున్నసామికి–**
**సంతోష మింతింత గాదె॥ ॥వేడుక॥**

అతనిపై రెండువేల పదములు విరచించినాడు. క్షేత్రయ్య రాకతో మధురలో పదసాహిత్యమునకు ప్రచార మెక్కువయినది. మధుర పదరచనములకు మధురానగర ప్రజ చెవికోసుకొనసాగినది. సంగీత సాహిత్య రసజ్ఞుడయిన విజయరంగచొక్కనాథుడు పదసాహిత్యములోని మాధుర్యమును చవిచూచినాడు. అతని రాజాస్థానము పదకవితకు రంగస్థల మయినది. పదకవితా పట్టభద్రు లెందరో అతని రాజాస్థానము నలంకరించిరి. వారి పదరచనముచే రాజాస్థానము రసతన్మయ మగుచుండినది.

**కురంజి- ఆది**

**పల్లవి**

**శివదీక్షా పరురాలనురా– నే**
**శీల మింతైన విడువ జాలనురా**

**అనుపల్లవి**

**శివశివ గురునాజ్ఞ మీఱనురా– నే**
**శ్రీ వైష్ణవుడంటే చేరనురా ॥శివ॥**

**చరణములు.**

**వడిగ వచ్చి మతము జొరవకురా– శి**
**వార్చన వేళ తలుపు దెరవకురా**
**మడుగు కావి చెఱగు దియ్యకురా– నన్ను**
**మాటిమాటికి నోరు ముయ్యకురా ॥శివ॥**

**అజ్జజూచి చను లదమకురా– నా**
**సెజ్జగొలుసు బట్టి గదమకురా**
**బుజ్జగించకు పసి గోలనురా– నా కె**
**మ్మోవి నొక్కకు భక్తురాలనురా ॥శివ॥**

**పంచాక్షరీ జపశీలనురా– కూకి**
**పలుకులు నే వినజాలనురా**
**కొంచపు వగల గుందించకురా– మ్రొ**
**క్కుదు రుద్రాక్ష సరులు– ద్రెంచకురా ॥శివ॥**

**మోము మోమునను జేర్చకురా– నీ**
**నామము తోడ భూతి గూర్చకురా**
**వేమఱు తొడ భిక్ష వేడకురా– పోపో**
**రా మన్నారు రంగ మల్లాడకురా ॥శివ॥**

నుదుట విభూతిరేఖ, మెడను రుద్రాక్షసరులు తాల్చి కావిమడుగు కట్టిన నట్టువకత్తె ఈ పదము పాడి అభినయించుచుండగా రసపారవశ్యము నందని రసికులుండరనుట అతిశయోక్తి కాదు. కాని అంతటి రసపారవశ్యము కలిగించిన ఆ పదమును రచియించిన పదరచయిత యెవరో తెలిసికొనుట కది వారికి సమయము కాదు. సముచితమును కాదు. పై పదమును పాడి అభినయించుచుండగా జూచినవారు పలుపురుందురు. వారిలో ఒక్కరును ఆ పదరచయిత ఎవడో తెలిసికొనుటకు ప్రయత్నించి యుండరు. అది వారి పనికాదు. పరిశోధకుల పని అది.

'మన్నారురంగ' ని మకుటముతో నున్న పై పదము 'మధుర' లో వెలసిన దనుట మధురాంధ్ర సాహిత్యమున కొక ప్రశస్తి! విజయరంగ చొక్కనాథుని మంత్రులలో ఒకడును, శేషమువెంకటపతి రచించిన తారాశశాంక విజయమునకు కృతిపతియు అగు 'వంగలసీనయ్య' ఈ పదమునకు రచయిత అనుట క్రొత్తగా తెలియవచ్చిన విషయము! ఈ పదమొక్కటే కాదు. 'మన్నారు రంగ' మకుటముతో అత డనేక పదముల విరచించినాడు. అవి 'మన్నారు రంగని పదములు'. అతడు శ్రీరంగములోని శ్రీరంగనాథస్వామి భక్తుడు. రంగనాథస్వామికే 'మన్నారురంగ' దని పేరు. ఈ పద్యము చూడుడు.



**శ్రీరంగపతి పదాంబుజ**
**సారంగచ్చిత్త! చిత్తజాత జయంతా**
**కారా! కవి మందారా!**
**క్షీరాంభోనిధి గభీర! సీనయధీరా!**

శశాంక విజయము తృతీయ–1ప.

ఇతడు మన్నారురంగని పదములను రచించినట్లు శేషము వెంకటపతి రచించిన తారాశశాంకములోని ఈ క్రింది పద్యముల వలన తెలియవచ్చుచున్నది.

**శ్రీ మన్నరు రంగాధిప**
**నామాంకిత గేయకల్పనా స్తుతమతికిన్**
**రామానుజ విజయాంక గ**
**వీ మధుర సమోదమాన వేంకటపతికిన్**

**షష్ఠ్యంతపద్యము.**

**శ్రీ మన్నరు రంగాధిప**
**రామానుజ గుణగణాంక రచనాముదితా**
**హేమాచల మలయాచల**
**సీమాచర సుకవిచంద్ర! సీన సుధీంద్రా!**

**పంచమాశ్వాసము. 1ప.**

వంగలసీనయామాత్యుడు 'ఘన నయదేశీయ కమనీయ గ్రామ మూర్ఛనా బహువిధ విన్యాస ధన్యా సమాన తాళమాన నానా నూన తాన వితాన భంగీ తరంగిత సంగీత విద్యా విశారదుండు', వీణా నినాద వినోద భూలోక నారదుండు' సరస పద పద్య గద్య రచనాభోజుడు.'

ఇతడు గొప్ప గాయకుడు. ఈ పద్యములు చూడుడు.

**"హా హా హూ హులు గాన గర్వమున హా హా హూ హు వంచున్ స్వరా**
**రోహ ప్రక్రియగా దురంగతనులై రూప్యంబు నానన్ వృథా**

**సాహంకారులు మర్త్య గాయకులు జోడా నీకు చాండేశ్వర**
**స్నేహాలంకృత! వంగలాన్వయమణీ! సీనా! కవి గ్రామణీ!" పీఠిక 57**

**వంగల కుల కుంభవారాశి జనియించి**
**కన్నుల కామోద గరిమ నించి**
**యందంద సకలకలాభ్యాసియై మించి**
**జైవాతృకత్వ ప్రశస్తి గాంచి**
**కౌముదీ ప్రజ్ఞాన గౌరవంబు వహించి**
**సతతంబు కవిసమాచరణ మించి**
**యిమ్మైన గానామృతమ్ములు గురియించి**
**యరికులంబుల గర్వమపహరించి**
**యతిశయిత లక్షణాఢ్యత నతిశయించి**
**ధాత్రి రామానుజ మహాచరిత్ర ఘటన**
**కలన గువలయ వికసనకళ ధరించి**
**సీన ఘనకుండు సర్వజ్ఞశేఖరుండు.**

**శశాంక విజయము. పీఠిక 22**

**"కల్పకసమ దానకళా**
**కల్పక నిజపాణి పద్మ! కాంచనపద్మా!**
**కల్పక సత్కవివినుతా**
**కల్పక! సత్కీర్తినూత్న! గాయక రత్నా!"**

**ద్వితీ. 145**

ఇతని తమ్ముడు వేంకట పెరుమాళ్లు. అతడును గొప్ప గాయకుడు. సంగీత గాయకుడు. సంగీత కళానిధి. ఈ పద్యములు చూడుడు–

**"స్ఫుట పటిమార్భటీ నినటి ఘుస్మర జిన్మకుటీ పుటీ సుధల్**
**ఘటముల గుమ్మరించి రన ఘుమ్మన రాట్సభ జంత్రగాత్రముల్**



**పటుమతి విన్కి జేయుచు శలాపటలిన్ సలిలంబు జేసి వేం**
**కట పెరుమాళ్ల ధీరుడు జగన్నుతుడౌ సరసత్వ మేర్పడన్ పీఠిక.59**

**"ఇళయ పెరుమాళ్లు రాముని**
**వెలయన్ భజియించురీతి వేంకట పెరుమాళ్**
**సలలిత గీతకళానిధి**
**విలసితమతి గొలువ సీనవిభుడు చెలంగున్".**

**పీఠిక.60**

పై ఉద్ధరణముల వల్ల విజయరంగ చొక్కనాథుని మంత్రులలో ఒకడును, తారాశశాంక విజయకృతిపతియు అగు వంగలసీనయ్య గొప్ప గాయకుడనియు, అతడు మన్నారు రంగని పదములను విరచించెననియు తెలియుచున్నది. 'సంగీత దర్పణము' లో 'శివదీక్షాపరురాలనురా' అన్న పదము ఘనంసీనయ్య అను వానిచే రచియింపబడినట్లు పేర్కొనబడియున్నది. అది యెట్లో తెలియదు. బహుశః వంగలసీనయ్య అనుటకు పొరపాటుగా ఘనం సీనయ్య అని పేర్కొనబడి ఉండును. పై పద్యములలో ఒక దానియందు 'సీనఘనకుండు సర్వజ్ఞశేఖరుండు' అనియున్నది కదా! 'సీన ఘనకుండు' అన్నపదమే ఘనం సీనయ్య అని పేర్కొనబడియుండును.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో శృంగార పదరచనము లనేకములు కలవు. కాని అవియెల్ల చెదరులు చెదరులుగా పలుప్రతులయందు కానవచ్చుచున్నవి. ఒక ప్రతియందు కానవచ్చినవే మరొక ప్రతియందును గానవచ్చుచుండును. కొన్ని ప్రతులయందు గ్రొత్త పదములును లభించుచుండును. వాని నెల్ల ఒక క్రమములో సమకూర్చుకొనుట పరిశోధకుల కర్తవ్యము. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో వివిధ ప్రతులయందు చెదరులు చెదరులుగా ఉండిన మన్నారు రంగని పదములనెల్ల ఒకచోట సేకరించి ఇందు ప్రకటించుచున్నాడను. వంగలసీనయార్యుని పదములనెల్ల ఒక్కచోట సమకూర్చుటయే ఈ నా ప్రయత్నములోని ఉద్దేశము.

**1. పున్నాగవరాళి- ఆది**

పల్లవి

తావచ్చునో లేక నే- రావలెనో యందాక

అనుపల్లవి

నా వేడుక చెల్లించే మ- న్నారు రంగసామి ॥తా॥

చరణములు

నన్నంటి యిటు రాక- యెన్నాళ్లైన పరాక
కన్నెరో వినవె ముక్కాకగా నున్నది మరుకాక
కన్నవారిని వేడుకొంటిని
వన్నెకాని నెనరెల్లను గంటిని
అన్నిటికిన్ని నీ- కన్న వేరే చెలి
యున్నదా నా వెత- లన్ని దీర్చుటకు ॥తా॥

తెలిసెలే నీ నిజాలు- నిచ్చలు నొంటిగా జాలు
నెలత యెంతైన పలుచూలు- నే నంటెనే చూలు
నిలుపరాని వలుపున గడుసొక్కితి
చెలు లెందఱనో బతిమాలితి ॥తా॥

చెలువుని ముంగల- నిలిచి మదిని గల
కలక దీర్చుకో- వలె నీ వేళ
దైవము పగదాయ- నా పైన- దయలేదాయ
యేవేళ లేని మటుమాయ- తానే సతమాయ ॥తా॥

పూవుబోణి యూరకె నెఱ నమ్మితి
పొందినప్పుడె తెలియక మే నమ్మితి



యీవల నావల- పెటుల దాతునె
పోవె తెలుసుక- రావె గ్రక్కున ॥తా॥

మరొక ప్రతిలో ఈ క్రింది పదములు కానవచ్చుచున్నవి.

**2. నాటకురంజి రాగం- ఆదితాళం**

పల్లవి

ధారుణి దొరలిండ్లను బుట్టుట పగ
వారికైన కొఱగాదమ్మ

అనుపల్లవి

పేరు బాడి మ- న్నారు రంగనికి
పెండ్లిసేయు టెన్నటికో తెలియదు ॥ధారు॥

చరణములు

తలిదండ్రుల మమతలు కొన్నాళ్లు
తటి జూచుచు కొన్నాళ్లు
కులధర్మంబులు విచారించు
కో వలె నంచని యవి కొన్నాళ్లు
అలరు ప్రాయమళికి గాని విరితన
మాయగా విధిమాయగా ॥ధారు॥

మగగాలేని సోకక కొన్నాళ్లు
మరియాద దక్కెను కొన్నాళ్లు
నగరివారమని లేని
బిగువు విన్నాణములచే కొన్నాళ్లు
పొగరు తమక మడవి గాయువెన్నెల
పోలికై తుద జాలినైతిని ॥ధారు॥

హావుసు తోచి తోచక కొన్నాళ్లు
అనుభవ మెఱుగక కొన్నాళ్లు
సవసవగా రతికేళి ముచ్చటలు
సఖియలచే విని కొన్నాళ్లు
అవురవురా ఆడతనమె- పగటిదివ్వె
అలసితి మతి సొలసితి॥ ॥ధారు॥

### 3. యెరికల కాంబోది పదం

పల్లవి

నిన్నన ఫలమేమీ- ఒకరినైనా తా
నిందించ చలమేమీ

అనుపల్లవి

నన్నన వలయునె
యెన్నైనా గాని
మన్నరురంగ నీ వన్నిట
మంచివాడవు పొమ్ము సుమ్మీ

చరణములు

తొలుతనె యిటువంటి వాడవని
తెలియకనె వలచియుంటి
చెలువుడా యిది యేటి చిన్నెలు
అలనాటి వలపులు మిగులసొలపులు
చెలులమది చపలంబు గాదె
అలిగి విడనాడ విడనియ్యదు
కలుగునా నీకు నావల్ల సు
ఖంబు మించిన కలియుగంబున ॥నిన్నన॥



నల్లని మొగవాని కలనైననుగాని
నమ్మరాదనుమాట
చెల్లబో నిజమాయ కల్లగాదు నేటి
కల్లను జనుల వల్లను
యెల్లకాలము మరులు న
న్నింత వింతల కెమ్ముజేసెను
వల్లగా వలచివచ్చిన జ
వ్వనులు చులుకన గారె విటులకు ॥నిన్నన॥
కలకాలము వట్టి ఆడికెల లోను
గా భువిని బుట్టి
పలుమారు విధిదూరి పలువరించి వేసారి
అలసితి మిగుల సొలసితి
యిలను మగువలు మరులు తగులై
మెలగి యుండుట పలుకువిని మా
తలను వ్రాసి ధాత యిటు దం
ధనల పొందలరింప జేసెను. ॥నిన్నన॥

సంగీత సర్వార్థసార సంగ్రహము అను గ్రంథములో మన్నారు రంగనిపదములు కొన్ని ముద్రింపబడినవి. ఆ గ్రంథము క్రీ.శ.1908 లో చెన్నపట్టణమున ముద్రింపబడినది. అందు ముఖపత్రమున ఇట్లున్నది.

'సంగీత విద్య నభ్యసించువారల కత్యావశ్యకం బగునట్లు సర్వగీత వర్ణ పదాద్యనేక ముఖ్యవిషయములం గూర్చబడిన సంగీత సర్వార్థసారసంగ్రహమను గానశాస్త్రము. ఇయ్యది సంగీత విద్యా కుశలులగు పెక్కండ్రు విద్వాంసులచే పరిష్కరింపబడి టి.చెంగల్వరాయనాయడు అండ్ సన్స్ వారిచే స్వకీయ మురహరి ముద్రణాలయంబున సర్వజనుల మనోహరార్థముగా ముద్రించి ప్రచురింపబడియె. చెన్న పట్టణము, 1908. ఈ గ్రంథము ధర 12 అణాలు"-

పయి గ్రంథమునందు సారంగపాణి పదములు, కస్తూరిరంగని పదములు మొదలగు ఇతర పదములతో బాటు మన్నారు రంగనిపదములును ముద్రింపబడినవి. పై గ్రంథములో ముద్రితములై ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందలి వ్రాతప్రతులలో కానరాని మన్నారు రంగని పదములీ క్రింద నొసగబడుచున్నవి.

**1. నీలాంబరి రాగము-త్రిపుటతాళము**

పల్లవి

మగవాడు తలచితే సుఖము

అనుపల్లవి

మగువలే మగవారి మాయల
మరిగి తరిగిన నేమి ఫలమమ్మా-యతి చులకనమ్మా

చరణములు

సకలవిద్యలు నేర్చిన- నెంత
సౌందర్యవతియైన
నొకనివలలో జిక్కతేను- యీ
వూరటచెల్లు టెట్లానో
అకట! నీ వెంత జంతవు- నా
యకుని నడవడికెలు
దెలియువేళ నది యొక్కమేలా॥ ॥మగ॥

చెల్లి! ప్రాయపు చెలులు లేరా- వా
రెల్ల నీ వలె తిరిగేరా
చెల్లునా యిదినీకు మానమే
సొమ్ము నా మాట నమ్ము



నే నెంత వేడిన నీ వల్ల
వానిపై తమి నిలుపలేవు
నీ నెనరు మదిదాచుకోవు- పసి
దానివలెనే భ్రమల జెందేవు
చాన! విను మన్నారు రంగ
శౌరితో కలసినది
యెవ్వతైన తెలుసుకొన్నదైన॥ ॥మగ॥

**2. శంకరాభరణము- త్రిపుట**

పల్లవి

వాడెవరో మన మెవరో
వనితరో యీ వట్టి- వాదేల పోపోవె

అనుపల్లవి

నాడు నాడే మ- న్నారురంగని చెలిమి
కూడదని మ- ల్లాడ లేదటవే- యిపుడేటి దిటవే

చరణములు

నెనరువా దనుకొంటివా- వాని పొలకువ
నేటివరలో గంటివా- యేటిమాట
యనుకూలు దవునంటివా- దానిపై- వాని
యాసకు మితి గంటివా- పదివేలైన
వినవె యింతట తెలివి వలదా
తను వెఱుంగని శివము గలదా ॥వాడె॥

తెలిసె వాని యిక్కువ- వానికి మనకు
తిరిగి గలదా మక్కువ- యిపు డింతగ

వలచినదే తక్కువ- పో పొమ్మనవే
వాడైతేనే యెక్కువా- రాగరాగ
పలుకుటే సందేహ మాయను
పసిడికైదువు లేమి సేయును ॥వాడె॥

తిరిగి తిరిగి యేటికే- యాడిపాడి
తీరినదా నాటికే- వేవేగముతో
తిరిగేది పైపోటికే- వాడీ వగల
తేలించినది నూటికే- మన్నారు రంగని
యెఱిగి తిరుగా చెలిమి జేతుర
యిసుక పాతఱ త్రవ్వ జూతుర ॥వాడె॥

### 3. దర్బారు రాగము- ఆది తాళము

పల్లవి

మగవాడని యాడదని ఒంటిబడి
మనసు నిలుప వశమా- యెవరికైనను

అనుపల్లవి

పగలు జేయు మన్నారు రంగడే
వరాహసామిని నన్ననలేల
బిగువులు తగువులు వావివర్తనలు
వీరాలాపములు సభలో గాని

చరణములు

మంచి వయసు దొరక దనుచు బలికే-
మాటల కేమి మోసమో
కంచుపదను వంటి దింతె తమకము
కలిగిన దంటే రోసమా



యించువిలు బారి కోర్వరా దను-
టెల్ల నొకరి కోసమా
పొంచి పొంచి దొరకరాని సంగతి
పొసగి తేను మరి దోసమా ॥మగ॥

ఆడికలకు వెరచినటుల బూటక-
మమరికలకు తా వచ్చునా
యీడుగాని వానిచేత దొరకిన-
నెవతైన మనసిచ్చునా
చూడలేక యొరులు దూరుకొనగా వ-
చ్చునా నోరేమి నొచ్చునా
యాడకాడ దెలియవలెను గురునిల్లా
లాపనులకును జొచ్చునా ॥మగ॥

మౌనమందియున్న నెన్నడైనను-
మది కళంకము దీరునా
పైన మెఱుగనట్టి వలపు దాచిన-
వడ్డి వాసులకు బారునా
నేను నా వరాహసామి నెనసిన-
నెనరింతింతన వచ్చునా
తాను తానే దెలియవలె సుఖ మెం-
దరికైన పనికొచ్చునా ॥మగ॥

వంగల సీనయార్యుడు రామానుజ మతావలంబకుడు. అతడు రామానుజ చరిత్రమను ప్రబంధమును గూడ రచించినాడు. 'రామానుజ దివ్యచరిత్ర ప్రబంధసాహితీ మోహితానల్ప సంతోష విశంకట వేంకట నగాధీశ్వరు' డనియు,'రామానుజ విజయాంక కవీ మధుర సమోదమాన వేంకటపతి '

అనియు,'రామానుజ గుణగణాంక రచనా ముదితు' డనియు అతడు తారాశశాంక విజయమున పేర్కొనబడినాడు. వైష్ణవ భాగవతాగ్రేసరు డయిన ఇతడు మన్నారు రంగనిపై శృంగారపదములను మాత్రమే కాక భక్తిమయ పదరచనమును గూడ గావించి యున్నాడు. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులలో అట్టి పదములు కానవచ్చుచున్నవి చూడుడు.

**1. నీలాంబరి- ఆది**

పల్లవి

నిను సేవించిన- కనుల నెవ్వరిని
గననొల్లను శ్రీరంగా రంగ

అనుపల్లవి

నను నీ సన్నిధికిని రప్పించుక
మనుమయ్య శ్రీరంగా

చరణములు

శరణాగతుడను- గరుణజూడుమీ
దఱి మఱవకు శ్రీరంగా రంగ
అర నిముసము మిము- దరిసింపక మన
మిరవొందదు శ్రీరంగా రంగ ॥నిను॥

జపమని వేఱొక- తపమని యెఱుగను
అపరాధిని శ్రీరంగా రంగ
చపలచిత్తుడను- కుపితుడ పాపిని
కృపసేయవె శ్రీరంగా రంగ ॥నిను॥

మన్నరురంగ ప్ర- పన్నవత్సల ప్ర-
సన్న వరద శ్రీరంగా రంగ



యెన్నటికిని నను- మన్నించెద వా
పన్న వరద శ్రీరంగా ॥నిను॥

**2. భైరవి పదం- చాపుతాళం**

పల్లవి

పలుకవేమిరా- సామి నే నిజముగా
వలపు నిలుపలేనురా

అనుపల్లవి

నిలుపరాని ప్రేమ- నేనెంతో వేడిన
నీ కింత దయలేదుగా- రంగేశా॥ ॥పలుక॥

చరణములు

చెలువుమీఱ నీదు- సిగనిండా విరజాజు
లెలమిచుట్టుచు నే- నెంతో చెంత జేరినా
నిలు నిలుమనేవు- అది యే మనిన
తొలగజూచేవు- యెన్నడు లేని
అలుకసేయ మేరగాదురా- నేటి
కల్లా యింకా నిదుర రాదురా- వలదుర
చల మికను మరు డిదిగొ విరి-
శరములను గొని నను మనము చెదరగ
బలిమి వదలగ నేయదొగెను రా రంగేశా ॥పలుక॥

పరిమళించు మంచి- పన్నీరు గంధము
నెఱతనమున మేన- నెమ్మి బూయవచ్చితే
కరములు దోసేవు- మరి నీ వెంతో
కరకరిని జూచేవు- నీ యెదపైని

**కరుణ మీర నన్ను జేర్చరా- సామిగ**
**కౌగిలించి మోవి గ్రోలరా- నీపై**
**మరులు మఱి మఱి చాల ప్రబలను**
**మదిని కినుకలు వల దనుచు పలు-**
**మరును నిను నే వేడవేడగను రంగేశా ॥పలుక॥**
**తీరుగా కొనగోట నే క-స్తూరి తిలకము నీ నుదుట**
**దిద్దబోతే మోము నోరజేసేవు- నీలో నీవె**
**దూరుకొనేవు- నాపై లేని**
**నేరమేమైనాను యెంచితో లేకనే**
**నెందైనాను పోగా- మన్నించితో- వే**
**మారు నిను సమరతి నెనయు స**
**మయమునను నిను గాని యొరులను**
**చేర నవినది యపుడె మఱచితివా- రంగేశా ॥పలుక॥**

ఇప్పటివరకు ఉపలబ్ధము లయిన మన్నారు రంగని పదములు తొమ్మిది ఇందు ప్రకటింపబడినవి. ఈ పదములను విరచించిన వంగలసీనయ్య క్రీ.శ. 1706 మొదలు 1732 వరకు మధురను రాజధానిగా పాండ్యమండల మేలిన విజయరంగచొక్కనాథుని మంత్రులలో ఒకడు. అగుట నీ పదములు క్రీ.శ. 1706-32 సంవత్సరముల నడిమికాలమున రచియింపబడినట్లూహించుట అసమంజసము కాదు. ఈ పదముల ఉపలబ్ధి వలన క్షేత్రయ్యకు తరువాత సారంగపాణికి పూర్వము మధురలో వెలసిన పదసాహిత్యోపలబ్ధి జరిగినట్లయినది.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో మన్నారు రంగని పదములతో పాటు ఆ కాలముననే వెలసిన విజయరంగ చొక్కనాథుని మీది పదములు కొన్ని ఉపలబ్ధము లగుచున్నవి. విజయరంగ చొక్కనాథుని



ఆస్థానమున ఆనాడు సంగీతవిద్యా విశారదులయిన పదకవితా పట్టభద్రు లనేకులుండిరనుట నిర్వివాదము. రసజ్ఞ శేఖరుడయిన ఆ మహారాజు మీద ఎవడో అతని ఆస్థానములోని కవీశ్వరు డాపదములను విరచించి యుండును. మన్నారు రంగని పదములను విరచించిన వంగలసీనయామాత్యు డతని ఆస్థానిలోని వాడే కనుక విజయరంగ చొక్కనాథుని మీది పదములను గూడ మహారాజు మీది ఆదరముచే అతని కోరికపై ఆతడే రచించి ఉండునని తలచుట సమంజసమే అగు ననుకొందును. అవి యన్య రచితములుగా నిరూపింపబడుదాక ఈ నిర్ణయము సముచితమని యంగీకరింప దగును. విజయరంగ చొక్కనాథుని మీది పదములీ దిగువ ప్రకటింపబడుచున్నవి-

**1. సావేరి- ఆది**

**పల్లవి**

**ఏరా నీ కౌగిలీయ- వేరా ఓరోరి**

**అనుపల్లవి**

**వేఱుసేయ మేరగాదు- యిప్పుడు**
**విజయరంగ చొక్కనాథ భూపాల**

**చరణములు**

**సారె కోవిలలు రొదసేయ**
**చలువ తెమ్మెరలు పై డాయ**
**మారుడు విరితూపుల నేయ- నీ**
**మనసు దాతురా విటరాయా ॥ఏరా॥**
**నిన్న రేయి వెన్నెలబైట**
**నెనరు మీఱ నాడిన మాట**

వన్నెకాడ! మఱచితి విచ్చోట- నీవు
వగలు సేతురా యిచ్చోట ॥ఏరా॥

విరుల శయ్యపై దమిమీఱ
విజయరంగ చొక్కవజీర!
హరువు మీఱ నేలితి వౌర! నీ
హవుసు చెల్లెరా హంవీర! ॥ఏరా॥

## 2. కేదార గౌళ

పల్లవి

అతివచేత బిలువ నంపిన పనియేమి
ఆనతీయర సామి

అనుపల్లవి

చతురు డారంగ- కృష్ణ ముద్దువీరేంద్రా
వితరణ గుణసాంద్ర- విజయరంగ చొక్కేంద్ర!

చరణములు

అలనాడు చెప్పిన మాటలు యేమి
అతివతో గూడి యుందువురా నా సామి
లలన యింటికి పోక రాక యేమి
రట్టేల చేసేవు రారా నా సామి ॥అతివ॥

అదిగో! చూడు నీ మోవిపై గాటు
అదిగాక వీపున దాని జడవేటు
పదరక యురమున గుబ్బలపోటు
బాగాయె యిది నీకు యేమో నెరనీటు ॥అతివ॥



ఎవ్వతె పెట్టిన మందురా నీకు
యింత చేసితి వేమందు- నిందుకు
రాజశేఖర విజయ- రంగ చొక్కేంద్ర
రమణిని నంపిన పనియేమి నా సామి ॥అతివ॥

## 3. రాగం? తాళం?

పల్లవి

నీ మీద వలువని నెలత యెవ్వతెరా

అనుపల్లవి

రామమనోహర! విజయరంగ చొక్కనాథనరేంద్ర!

చరణములు

సదయుడ! నీవు నన్ను సరసకు రమ్మనిన
హృదయేశ! పోకముడి వదలీరా
మదనావతార! న- న్నదిమి మోవి నొక్కిన
మదన మందిరము- పదనయ్యారా॥ ॥నీమీద॥

అనువున నీవు న- న్నలమి కౌగిలించిన
తనువెల్ల పులకరిం- త లమరీరా
మొనసి నీదుమోము- ముద్దుబెట్టి నంతలో
నెనలేని కోరిక- లినుమడించీరా ॥నీమీద॥

వింతరతుల నన్ను- విజయరంగ చొక్కేంద్ర!
కంతుకేళిని గూడి- కలయవేల
చింతలెల్ల దీరి- చెలువుడా నా మనసు
సంతత సుఖానంద- జలధి తేలీరా ॥నీమీద॥

## 4. యెరికల కాంబోధి పదం

పల్లవి

ఎటువలె వలపించేవె- ఓ భామ నీ
వెటువలె వలపించేవె

అనుపల్లవి

విటరాయడైన మా- విజయరంగ చొక్కేంద్రుని ॥ఎటు॥

చరణములు

పదచాళి నటియించి- భారము కనుపించి
పదము లభినయింతువా- వాని నె
మ్మది దెలిసి మెప్పింతువా- నా ముందర
పదిరి యెమ్మెలు పలికే- విది యేటి యోచనే
హృదయేశు డన్నిట- నెనలేని నెఱజాణ ॥ఎటు॥

కవితాలు రచియించి- కల్పనలు పొసగించి
హవుసుగా వినిపింతువా- వానిచేత
అవురౌరా! యనిపింతువా- మా చెంగట
సవురు మెఱయించేది- చాలున యీ చిన్నె
లువిదా! చెల్లునా వాడు- నవరస రసికుడె ॥ఎటు॥

నిక్కుగుబ్బలగుమ్మి- నిండు కవుగిట గమ్మి
పక్కమచ్చిక సేతువా- వాని రతుల
సొక్కించి తరియేతువా- యీ లాగున
మిక్కిలి నిను నీవె- మెచ్చుకొనే వేమె
చక్కని పతి యువతీ- జనపాంచాలుడే ॥ఎటు॥



## 5. యెరుకల కాంభోజి- ఝంపెతాళం

పల్లవి

తరుణిరో మరుకేళికి యీ పదివేల
బిరుదులూ నీకె చెల్లునే

అనుపల్లవి

అరుదుగా- ముద్దు చొక్క-
అదెరా యిట్లా సమరతుల
దురుసు అణుకువ లంటివీ- చెలియా ॥తరు॥

చరణములు

అదిమి భుజముల శిరము-
గుదియించి యణచుకొని
సదమదపు సమరతుల-
పొదవి యెంతో నిలిచితే
అదెరా విడు విడువకు మని-
గుది వెన్ను తాకులచే
నదిమి నా చెక్కు చఱచి-
యెదురు గమకించి నపుడె ॥తరుణి॥
తొందరవళి రికసద్దు (?)-
తోర మీ గళవరము
పడితిరో దానిజాతి-
పలుకుబడి గాదా
అదరి యమృతపు చెలమ-
హంసవాల లాడినటుల

కదువేదుకతో చెలియ-
పదక యొసగిన యపుడె ॥తరుణి॥

మోము మోము యెద యెదయు-
మోవి మోవి నను జేర్చి
ఆముకొని మిగుల తియ్యక-
సాముగత్తెవు గనుక
కోమలి లయ తప్పనియ్యక-
కుఱుచ నిడుపులతో
ఓ ముద్దుచొక్క యనుచు-
నుపరతి నను కలసి నపుడె ॥తరుణి॥

### 6. యెరికల కాబోధి పదం

పల్లవి

ఉపమగా నే సేయు- నుపచారములన్నియు
అపచారములై తోచెనా

అనుపల్లవి

విపుల సద్గుణసాంద్ర!- విజయరంగ చొక్కేంద్ర!
వింతలాయ మనవి- వినరా చక్కని సామి!

చరణములు

నిలువుటద్దము దెచ్చి- నిలువరించితి గాని
నెలవంకలేమని- పలుకరించితినా
కలపము మైనిండ- నలువరించితిగాని
పలుకెంపు లేమని- పలికితినా బాగాయ ॥ఉప॥



పసిడి శాలువ దెచ్చి- పయిని గప్పితి గాని
పసుపు దుప్పటేమని- పలుకరించితినా
కుసుమంపు సురటి చే- కొని విసరితిగాని
పసి చెమట లేమని- పలికితినా బాగాయ ॥ఉప॥

చెలువుగా శృంగార- శేఖరుడ వంటి గాని
తెలవారు దాక రతి- కలసితి నంటినా
లలితు డైనట్టి శ్రీ- రంగేశు డంటి గాని
యల కృష్ణమూర్తివని- పలికినా బాగాయ ॥ఉప॥

విజయరంగ చొక్కనాథుని మకుటముతో నున్న పై పదములో తుది చరణమున శ్రీరంగేశుడు పేర్కొనబడుట మన్నారు రంగని పదములను రచించిన వంగల సీనయ్యయే యీ పదములను గూడ రచించెననుటకు సమర్థమైన ఆధారమగుచున్నది.

నరసప్పయ్య విజయరంగ చొక్కనాథుని పితామహి యయిన మంగమ్మగారి కాలమున బేరెన్నిక గన్న దళవాయి! ఇతడు విజయరంగ చొక్కనాథుని కాలమున గూడ ఉండినాడు. ఇతడు అఖండ మేధాశాలి. దళవాయిగా మాత్రమే కాక ప్రధానామాత్యుడుగా గూడ ఉండి దేశపరిపాలనము నతి సమర్థతతో జరిపిన ఇతడు తెలుగు నియోగి బ్రాహ్మణుడు. గొప్ప శూరుడు. అనేక యుద్ధములు చేసి జయించినాడు. దేశారిష్టములు కలిగినప్పుడు వానికి ప్రతిక్రియలు చేసి దేశమును కాపాడినాడు. ఈయనను గూర్చిన కథ లనేకములు కలవు. ఇతని మీది పదమొకటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతులలో కానవచ్చుచున్నది.

**పూరిరాగం- ఆదితాళం**

ఒళువెల్ల దెలిసె లే లేరా- వోరోరి జాణ

అనుపల్లవి

దళవాయి నరసవజీరా- దాతలరాయ నీ ॥ఒళు॥

చరణములు

నిన్న దానినేలు- కొన్న వగలెల్ల నేను
విన్న చిలుక తాళి- మొన్న యిచ్చి సుప్ర-
సన్న సరసాన నున్న ॥ఒళు॥

రాక యేతురా ప- రాక దానికె సరిగా
కోక లిచ్చితే...........
లేక నేనందాక ॥ఒళు॥

వరుస దప్పక నన్ను- వరుసమాన యేలి యొక
వరుస సొమ్ము లొసగ నీ- సరిపాటి యెవ్వారు
సరస దళవాయి నరస ॥ఒళు॥

విజయరంగ చొక్కనాథుని తండ్రి రంగకృష్ణముద్దువీరప్పనాయకుడు. అతడు క్రీ.శ. 1682 మొదలు 1689 వరకు రాజ్యపాలనము గావించినాడు. అతని మీది పదములు రెండు ఉపలబ్ధము లగుచున్నవి. కర్త యెవ్వరో తెలియరాదు.

**1. ఘంటారవం- త్రిపుట**

పల్లవి

తలచుకొన్న నా మనసు- ఝల్లుఝల్లనీనే
తల్లడ మందీ నే మందునే

అనుపల్లవి

చెలువరంగ రమ్మని- చేరదీసిన నేస్తము

చరణములు

నెలత! నిన్నటిరేయి- నీ వంటి సరసులతోను
చెలిమి మిక్కిలి యింత- సేయరాదనుచు ఆ



పలికిన మోమునే- పలుమారు చూచి చూచి
తలవంచుకొని హా- దైవమా యనిన మాట ॥తల॥

రతికేళి నెనసిన
రమణి నిదుర లెమ్మని
అతివ యూరికి పోయి వచ్చే
నని నందుకు ఆ
వెతతో దిగ్గునలేచి
వేగమె నన్ను కౌగిలించి
అతి దయచే కా నిమ్మని నో
రాడక నే నూరకున్నది ॥తల॥

వదరక పోవే ముద్దురంగ
ప్రాణేశయని యుపరతుల
మదనకేళిని గూడిన
మగువ గనుక ఆ
ముదిత నీవు పాడిన
పదములు తలచుకొంటె
కదిసిన రూపమెల్ల
కన్నుల గట్టినట్లున్నది ॥తల॥

**2. బిలహరి- చాపు**

చాలు చాలు నన్నంటకు- జాణరాయ నీ
మేలు దానితో జగ- డాల కోపమేమయ్య
యిచ్చకము లాడరాకు- యికనేల నే నీకు
పచ్చితేనె మోవిగంటికి- పదివేలదండములు

**మొక్కలితనము బూని- మోహంపు దొరసాని**
**చెక్కిటనుంచి నీ గోరుజూచి- చిత్తము చల్లనాయె**
**యెలమితో నన్ను గూడి- యిప్పుడా మాయలాడి**
**కలసిమెలసి వచ్చేదాక- తెలియదా ముద్దురంగ.**

ప్రబంధ వచన సాహిత్యశాఖలు మాత్రమే కాక పదసాహిత్యశాఖ కూడ మధురలో చాలగా అభివృద్ధి చెందిన దనుట కీ పదరచనములు ప్రబల ప్రమాణములు. ఆంధ్రసాహిత్యచరిత్రములో దక్షిణదేశాంధ్ర సాహిత్యమును గూర్చి విస్తార పరిశ్రమము జరుగలేదు. తంజాపురాంధ్రసాహిత్యమును గూర్చి మాత్ర మిటీవల కొంత విస్తారముగానే పరిశ్రమము జరుగుట సంభవించినది. కాని మధుర, పుదుక్కోట మున్నగు రాజస్థానముల వెలసిన సాహిత్యమును గూర్చిన వివరములు లేనిది దక్షిణదేశాంధ్ర సాహిత్యచరిత్రము సమగ్రము కాజాలదు. మధురాంధ్ర * సాహిత్యములో చేరదగిన పదసాహిత్య స్వరూపమును తెలుపుటయే ఈ వ్యాసోద్దేశము.

* ఈ వ్యాసమునందలి చారిత్రక విషయములు 1945 వ సంవత్సరమున భారతిలో శ్రీ దిగవల్లి వేంకటశివరావుగారు రచించిన 'మధురనేలిన తెలుగు నాయక రాజులు' అను వ్యాసము నుండి గ్రహింపబడినవి.

## 10. కస్తూరి రంగని పదములు

లక్షణకవి అయిన కస్తూరి రంగకవి లక్షణచూడామణి అనబరగు ఆనందరంగ చ్ఛందమును, సాంబనిఘంటువును, కృష్ణార్జునసంవాదమును రచించుట మాత్రమే గాక కొంత పదరచనమును చేసినాడు. పదునెనిమిదవ శతాబ్దారంభమున పుదుచ్చేరిలో ఫ్రెంచి రాజప్రతినిధిగా ఉండిన డూప్లే దొరగారి విజయములను గూర్చియు, పై డూప్లే దొరగారి ఆస్థానిలో 'దుబాసి' గా ఉండిన ఆనందరంగని విజయములను గూర్చియు ఇతడు గేయముల రచించినట్లు తెలియుచ్నుది. డూప్లే దొరగారి ఆస్థానిలో ప్రసిద్ధ గాయకుల గేయములను పాడుచుండిరట! ఈ విషయము 'ఆనందరంగపిళ్ల డైరీ' యందు పేర్కొనబడినట్లు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము 'డిస్క్రిప్టివు' కేటలాగులో ఇట్లు పేర్కొనబడినది.

'ఆనందరంగని విజయములను గూర్చియు డూప్లే విజయములను గూర్చియు వ్రాసిన గేయములు (ఫ్రెంచి రాజప్రతినిధిగా బుదుచ్చేరిలో వసించిన) పై డూప్లే దొరగారి యాస్థానిలో ప్రసిద్ధగాయకులచే పాడ బడెనని 'ఆనందరంగ పిళ్లడైరీ అను గ్రంథమునుండి తెలియవచ్చుచున్నది.'

కస్తూరి రంగకవి వాఙ్మయశాఖలయం దన్నిటను తనకు సముచిత స్థానము సంపాదించుకొను తలపున గాబోలు కృష్ణార్జున సంవాద మనెడి ప్రబంధమును, లక్షణచూడామణి అను లక్షణగ్రంథమును, సాంబనిఘంటువును రచించినట్లు తెలియుచున్నది. పదరచనము గూడ కావించి ఇతడు పదరచయితల యందును ప్రఖ్యాతి వడసినాడు.

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో 'కస్తూరి రంగని పదములు' అనుపేర ఈ శృంగారపదములు కానవచ్చుచున్నవి. ఇవి సవరని భాషతో చక్కని రచనముతో ముద్దులొలుకు చున్నవి.

### 1. ఎరుకుల కాంభోజి

అలుకలే కాని వేడుకలు చెల్లక పోయె
నాసించినందు కొకసారి
కలికిరో నా పాలి కస్తూరిరంగపతి
గడిదేరెనే మేర మీఱి- ॥ఓచెలియ॥

ఎన్నటికి నా ప్రాణనాథు డితడే యనుచు
నెంచినందుకు ఫలము వచ్చె
వన్నెకానికి మేలుబడి నందు కిపుడు నా
వలపు నన్నింతటికి దెచ్చె
కొన్ని దినములకైన గుణము కల్గునొ యనిన
గోప మంతంతకును హెచ్చె- వాని
యెన్నికలు సూచి మనకేల నని యుండితే
నిల్లిల్లు తా దిరుగ జొచ్చె- ఓచెలియ ॥అలుక॥

నెలకొక్క సారి యేమరియైన నిటువచ్చి
చెలిమి చేసేది లేదాయ- ఆ
యెలనాగ బోధనలచే నేర్చుకున్నాడె
యెచ్చటను లేని మటుమాయ- నా
వలపు లంగడి బెట్టివచ్చె నింతేకాని
వాని కేడదె నెనరు సేయ
తెలిసి తెలియని జాడ నుండి మనకేలనని
మెలగుచున్నాడె యీ చాయ- ఓచెలియ ॥అలుక॥

ఇందటిలో మేటియై యున్న నా బోటికా
యిటువంటి కొదువ ఓ చానా!



యిందు బింబాననకు నా వెతలు జూచితె
మది నెఱుక లేదాయె యింతైన
అందటికి వారి వా రక్కఱలె గాని మీ
దయ్యేది తెలియదింతైన
నన్నిందెనసినట్టి కస్తూరి రంగేశు
డిట్లేచితె నొకరి నన నౌన- ఓచెలియ ॥అలుక॥

### 2. సురటి- త్రిపుట

ఇందెందు వచ్చితిరా యల దానిల్లు
ఈ వీధిగాదు పో! పోరా!
మందరగిరిధరుడైన మా కస్తూరిరంగ
కుందరదనను మదిగోరి యిందు వచ్చితివో ॥ఇందెందు॥

ఎచ్చైన వెన్నెలలో నిల్లు ఎఱుగక నీవు
మచ్చెకంటిని దగిలి మైమఱచినావొ
మచ్చికతోడుత మనసు చల్లగ జేసి
గ్రుచ్చి కౌగిలించిన కోమలి నే గాను. ॥ఇందెందు॥

నడిరేయి జామువేళ నాతి నీవును గూడి
నడచుకొన్న చిన్నెలు తెలిసెరా జాణ!
వడివడిగా వీధిలో వగలుసేయుచు రవిక
ముడివిడువ వచ్చేవు ముచ్చువానివలెనె ॥ఇందెందు॥

మదనలాహిరి మించి మదహత్తివలె జూ
చెదవు కస్తూరిరంగ! చెయి బట్టకురా
మదనకేళిని గూడి మమత రెట్టించెదవు
ఉదయమాయెను వేఱయువిద యెదురుజూచీని ॥ఇందెందు॥

### 3. ముఖారి రాగము

ఆవల వాడొక తనువాసించె నంటెనె
వాని బిలుతువటె
కావలసితె వచ్చీని కస్తూరిరంగడు ॥ప॥

మాట పట్టు మీఱనంట మనవిగా వేడుకొంట
నేటివరకు మా యింట నెనరుతోడను
నీటుగా దుండలేదొ నీ మనసున లేదొ
పోటిజేసి నేడింత కోటి ధన మొసంగిన ॥ఆవల॥

వారివారి మాటవిని వాడిందు రానని
ఓరచేసుక యుంటె సారెసారెకు
చేరి నే బిలువబోతే సిగ్గు లెస్సా దక్కునే
యూరెల్ల నెతిగియున్న నన్నుకాదను ॥ఆవల॥

గడియసేపు చాల పోరి కస్తూరి రంగ డీసారి
దుడుకున నను గూడి దొరలీవితోను
బడలితి విక చాలు విడిదికి బొమ్మని
అడుగు బాసిన వెనుక నక్కఱ దీరెనంటె ॥ఆవల॥

### 4. కాంభోజి

వల పంటేనే సామాన్యమా- కస్తూరి రంగ
కలిమి కలిగుండవలె- నిండు జాణైన
చెలికా డొక్కడుండవలె- ఇంటివారిచే
నలి తిండిలేకుండ నుండవలె- మన యిద్దఱి
తలపు చేకూడుండవలె- ఓ చెలియరొ 1.

ఊరొక్కటై యుండవలె- అదియుగాక
తీరొక్కటై యుండవలె- తలవాకిలి



సారె కెదురై యుండవలె- సరివారిలోను
ఆరు దూరు లేకుండ- కస్తూరి రంగ 2.

అంతరంగమై యుండవలె- మదనశాస్త్ర
మంతయు నేర్చి యుండవలె- మనసు లేకమై
సంతోసాన నుండవలె- శేషశాయి కృపను
కంతుకేళి కూడుండవలె- ఏ పనికైన
పంతమాడి నట్లుండవలె- కస్తూరి రంగ 3.

డూప్లే దొరగారి విజయములను గూర్చియు, ఆనందరంగని విజయములను గూర్చియు ఇతడు రచించిన గేయములు దొరకవలసియున్నవి. లక్షణకవులు, ప్రబంధకవులు ఈ పదరచనము నాచరించు చుండిరనుటకు లక్షణకవి కస్తూరిరంగకవి విరచితములగు ఈ పదములే సాక్ష్యము పలుకుచున్నవి. వినోదముతో బాటు విజ్ఞానమును గలిగించుచు ప్రజాసామాన్యమునకు సాహిత్యాభిరుచిని, కళాభిజ్ఞతను పెంపొందించు ఈ పదకవిత్వమునకు, పదకవులకు నేటిదనుక సాహిత్యములో సముచితస్థానము లభింపకుండుట శోచనీయము.

దొరికిన పదసాహిత్య సంపదను పరిశీలించి చూచిన ప్రాచీన కాలమున ప్రజాసామాన్యము పదరచనములకు బ్రహ్మరథము పట్టుచుండి రనుటను ఈ పదరచనములు ధ్రువపఱుచుచున్నవి. పురాతన పదరచయితలచే రచియింపబడి చెదరులు చెదరులుగా నున్న యీ పదరచనముల నెల్ల నొక సంపుటముగా ముద్రింపదగినవి. ఈ పదరచనములు ప్రజా సామాన్యమునకు విద్యావినోదముతో సాహిత్యాభిరుచిని, కళాభిజ్ఞతను గలిగించుచు అనితరానంద సంపాదకములయి, నిత్య నవీనములయి నెగడుచున్నవి.

# 11. ఆంధ్రాష్టపదులు

పద్మావతీ చరణచారణ చక్రవర్తి జయదేవకవి గీతగోవిందము ప్రపంచసారస్వతములోనే ఒక మహత్తర సృష్టి. సంగీతసాహిత్యముల సరస సమ్మేళనమున కదియొక అమరోదాహృతి. అద్వైతరసానందానుభూతికి అదియొక సురుచిర యోగము. సుమధురశబ్దవిన్యాసము, సురుచిరభావస్ఫూర్తి, సుందరచ్ఛందసౌందర్యము సౌందర్యానుభూతిలో సమైక్యమై సచ్చిదానంద సందర్శనానంద రసానుభూతిలో మనలను తన్మయుల జేయును.

గీతగోవిందమును ప్రియమార పాడుకొని భారత ప్రజ మురిసిపోయినది. రాధాకృష్ణుల పవిత్రప్రణయమూర్తులను హృత్ఫలకములలో చిత్రించుకొని రసతన్మయ మైనది. వ్రాతప్రతుల యందు అష్టపది భావానుకూలము లగు చిత్తరువుల చిత్రించుకొని ఆనందించినది. క్రీస్తుశకము పదునారవశతాబ్దినాడు భారత ప్రజ గీతగోవిందము వ్రాతప్రతిలో జిత్రించుకొనిన చిత్రములు జయదేవకవి కవితామూర్తి కొక మంగళనీరాజనము. అంతటితో భారతప్రజ పరితృప్తి చెందలేదు. గీతగోవిందమును దేశభాషలలోనికి పరివర్తనము కావించుకొని పరితోషమందినది. భావస్ఫూర్తికి భంగము కలుగకుండ, సంగీతసారస్యమునకు సంగతి చెడకుండ శబ్దవిన్యాసము జజ్జువారకుండ, రసానందము డిందువడకుండ గీతగోవిందస్థాయికి ననువదించుట అది అంత సుకరము కాదు. [తెలుగులో గీతగోవిందమునకు తెలుగు సేతలు ప్రాచీనులే కావించినవి రెండు కలవు. కార్వేటినగరసంస్థాన కవీశ్వరుడు, కవిరాజ కంఠీరవ బిరుదాంకితుడు అగు ఋగ్వేది వెంకటనారాయణకవి రచించినది ఒకటి. కదళీపుర నివాసి ఓగిరాల వెంకటరత్నదాసకవి రచించినది మరియొకటి.]

ఋగ్వేది వెంకటనారాయణకవి కార్వేటినగర సంస్థాన కవీశ్వరుడు. చంపూరామాయణమును రచించిన ఋగ్వేది వేంకటాచలకవి ఇతని తండ్రి. కార్వేటినగరాధీశ్వరుడగు వెల్లంటి కసవభూపాలుని ప్రోత్సాహమున ఇతడు



గీతగోవిందమును తెనిగించినట్లు చెప్పుకొనినాడు. ఇతడు లక్షణాపరిణయము, కృష్ణవిలాసము మొదలగు సంస్కృత ప్రబంధములను; మదనగోపాలవిజయము మొదలగు తెలుగుకబ్బములను రచించినట్లు తెలియుచున్నది. ఇతడు కవిరాజ కంఠీరవ బిరుదాంకితుడైనట్లు చెప్పుకొనినాడు. చూడుడు–

**‘గుణనిధి వేంకట నారా**
**యణ ‘కవిరాజనృసింహు’ దార్యోక్తులచే**
**జణులగు సత్కవిజనములు**
**ప్రణుతింపగ నాదినష్టపది రచియించెన్.**

అష్టపది నాంధ్రీకరించిన తొలికవి ఇతడు. తన కావ్యమును–

**ఏతాదృశ గుణరత్న స**
**మేతునకు సమస్తభువన హేతునకు నత**
**వ్రాత గృత పారిజాతున**
**కాతతరణ విజయచణిత హరిజాతునకున్**
**వ్రజయువతీలోలునకు బం**
**కజదళవర్తీక్షణాంశు కల్లోలునకున్**
**సుజన కృపాలునకున్ జిత**
**కుజశిశు (పాలునకు) మదనగోపాలునకున్**

అంకితము చేసినాడు. మరియు

**శ్రీరాధావనితాది వల్లవమృగాక్షీరాజి విద్యుల్లతా**
**వారంబై తగ....యడదీవ్యన్నీలధారాధర**
**స్ఫారాకారత నుండు నా మదనగోపాలుండు వెల్లంటి కా**
**వేరిక్ష్మావర నందనుం గసవ పృథ్వీనాథునిం బ్రోవుతన్.**

అని వెల్లంటి కసవభూపాలుడు తన పోషక ప్రభువగుటను పేర్కొనినాడు.

సంగీత సాహిత్యములకు సమానాదర మొసగి కవితాగానకళలను ప్రోత్సహించి కళాసేవ గావించిన కార్వేటినగర సంస్థానమే ఈ తెలుగు సేతకును ప్రభవమగుట ఎంతయు సమంజసము. జాతీయ పదసాహిత్యమునకు కాణాచి అయిన సారంగపాణిపదములును, సంగీతసాహిత్యముల సరస సమ్మేళనముచే రసానందము కూర్చు ఈ గీతగోవిందానువాదమును కార్వేటినగర సంస్థానమునకు గర్వకారణములు కాగలవు. సంగీతమునకు, సాహిత్యమునకు ఆ సంస్థానము గావించిన సేవ అపారము.

గీతగోవిందమున కిది పద్యానువాదము. ఆదినుండి ఏకాదశాశ్వాసము వరకే ఉండి అసమగ్రముగా ఉన్నను ఉన్నంత వరకే అనువాదము నిర్దుష్టముగా, సరసముగా, సరళముగా ఉన్నది. అష్టపదులలోని భావసంపద చెడకుండ, సులభముగా, సరసముగా, చక్కని శయ్యతో ఇందలి పద్యములు హృదయంగమములుగా ఉన్నవి.

**మచ్చునకు గొన్ని పద్యములు–**

**శృంగారాధిక యైన రాధిక బహుస్త్రీయుక్తుడై చుంబనా**
**లింగాది స్మరకేళుల న్విభుడు కాళిందీ తటాంతాటవిన్**
**రంగుల్మీఱ జెలంగినట్టి చరితన్ వర్ణింప వర్ణించె ద**
**ద్భృంగిన్ శ్రీజయదేవధీరు డిది సౌభాగ్యంబు మీ కీవుతన్.**

**అరమోడ్పుం గనుదోయితో శ్రమజల వ్యాసక్త గాత్రంబుతో**
**జిఱునవ్వు ల్నును జెక్కుటద్దములు రాజిల్లన్ గగుర్పాటుతో**
**సరసీజాస్త్ర రణాంత విభ్రమ వికాసంబుల్ ప్రకాశింపగా**
**మురువై దోఁచు మురారిఁ జూపు కుశలంబుల్ గూర్చు మా నెచ్చెలీ!**

**సురత కళా రసాలసత సోలుచు సమ్మదవార్ధిఁ దేలుచున్**
**వరతనువల్లి శయ్యపయి వ్రాలుచునుండగఁ బ్రేమనిండగాఁ**



**గరము రహించు నన్నెనసెఁ గంసహరుం దరమోడ్పుఁజూపుతా**
**మరలు చెలంగ నవ్విభుని మన్నన యెన్నడు గల్గు నెచ్చెలీ!**

**ఇచ్చటనుండ నేటికి చెలీ! విఫలంబగు నిచ్చ నా పయిన్**
**మచ్చర మెచ్చె నచ్యుతుడు మానిని నొక్కతెఁ గూడి వేడుకన్**
**ముచ్చట లాడుచు న్నగుచు ముద్దిడుచు న్మతి కౌగిలింపుచున్**
**రచ్చలు సేయసాగె నిటు రాడుగదే యెటులోర్తు నెచ్చెలీ!**

**చక్కెరమోవి యానె నొక చక్కని మానిని తద్రతంబునన్**
**సొక్కుచు సోలుచున్ భువన మోహన విగ్రహుఁడైన శౌరి పే**
**రక్కునఁ జేర్చి కుందనపుటందెల నాదు చెలంగ బల్తమిన్**
**మిక్కుటమైన వేడుక రమించె గళత్పరిధాన కాంచియై.**

**మరుఁడను సార్వభౌముడు సమస్తజగద్విజయాభిరాముడే**
**హరిణ విలోల లోచన మహాజఘనంబును రత్నకాంచన**
**స్థిరతర సింహపీఠిపయిఁ జెల్వెసగన్ వసియించెఁ దోరణ**
**స్ఫురణముఁ గూర్చె నచ్చట విభుండు మణీరశనచ్ఛలంబునన్**

'రసికజనమనోరంజననిదానము, రమణీయ రాధికారమణ శృంగారాపదానము విద్వజ్జనానందసంధానైక తానము, మృదుమధుర పదవితానము, సకల సద్గుణనిధానము' నగు గీతగోవిందాభిధానకృతి ప్రధానమిది "ప్రశస్తగోస్తనీ పాక సంవిధానంబు" గ రచియింప బడినది. విద్వత్కవి రచితకృతి అగుట మాత్రమేగాక కార్వేటినగరసంస్థానకృతి అగుటచేతను గూడ ఇది లభించినంత వరకు ముద్రింపదగిన గ్రంథము.

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారు సంగీత గ్రంథముల డిస్క్రిప్టివు కేటలాగును ప్రకటించుచు ఉపోద్ఘాతములో ఈ గ్రంథమును గూర్చి ఇట్లు వ్రాసిరి.

' One author of this prabandha is Rigvedi venkatanarayana who is the son of * kavi kanthirava venkatachala kavi, the author of champu Ramayanamu. Both father and son have dedicated their works to vellanti kasava, Rajah of karvetinagara. Besides this, venkatanarayana wrote Lakshanaparinayamu and Krishnavilasamu in sanskrit, Madanagopala vijayamu in Telugu. Though incomplete, the translation deserves attention as the work belongs to karvetinagara Samsthanamu which had been the seat of well known poets and musicians.

## 2

ఓగిరాల వెంకటరత్నదాసకవి కృష్ణామండలములోని కదళీపుర వాస్తవ్యుడు. కదళీపురమే నేటి కళ్లేపల్లి. ఈ కవీశ్వరుఁడు కదళీపుర మదనగోపాల దేవాంకితముగా తెలుగు పద్యకీర్తనములలో ఆంధ్రాష్టపదులను రచించినాడు. కృత్యాది పద్య మిది చూడుడు.

**శ్రీ కృష్ణోత్తర నిమ్నగా వరుణ దిక్సీమాగ్ర గప్రోజ్వల**
**త్ప్రాకారాంతర రత్నపీఠతల విశ్వామిత్ర సంస్థాపిత**
**స్వాకారోభయ పార్శ్వభోజ నృపకన్యా సత్యభామాత్త శో**
**భాక శ్రీ కదళీపురీ మదన గోపాలా! కృపాంభోనిధీ!**

జయదేవకవి రాధాకృష్ణుల రతికేళికా కలాప కలాపములను సౌరభాషచే ప్రబంధించి పండిత జనపేటికలను భద్రపరుపగా ఇతడు వానిని తెలుగుకీలున బయలుగా దివిచి అఖిల భక్తులకు కొల్లవెట్టినాడు. తన్నుగూర్చి ఇతడు చెప్పికొన్న ఈ పద్యము చూడుడు–

**శ్రీ కృష్ణ పాదరాజీవ షట్పదుడు వా**
**గ్దేవతా చరితచిత్రిత నిజాత్మ**

* ఇందు 'కవిరాజకంఠీవర' బిరుదము కవీశ్వరుని తండ్రియగు వెంకటాచలకవి కుండినట్లు వ్రాయబడియున్నది. గ్రంథస్థాధారముల బట్టియు, ఆశ్వాసాంత గద్యలను బట్టియు బిరుదము కుమారునిదే యయినట్లు తెలియుచున్నది.



**సద్మపద్మావతీ చరణ చారణ చక్ర**
**వర్తియౌ జయదేవపండితకవి**
**ప్రథిత రాధాకృష్ణరతికేళికా కలా**
**పకలాపములు సౌరభాషచేఁ బ్ర**
**బంధంబుఁ గావించి పండితజనపేటి**
**కలను భద్రముఁ జేసె నలరి వానిఁ**
**దెలుగు కీలున బయలుగాఁ దివిచి యఖిల**
**భక్తులకుఁ గొల్లవెట్టును వచ్చికొనుఁడు**
**కోరికల నోగిరాల సత్కులుఁ డుదారుఁ**
**డరయ వేంకటరత్న దాసాహ్వయుండు**

గీతగోవిందములోని శ్లోకములను పద్యములుగాను, అష్టపదులను అష్టపదికీర్తనలుగాను ఇతడు తెనిగించినాడు. రాగతాళముల విషయమున మూలము ననుసరింపక స్వతంత్రించినాడు.

ఇతని పద్యానువాదము సరళమై, సరసమై, మనోహరముగా ఉన్నది. అష్టపది కీర్తనానువాదము లయబద్ధమయినను భావగాంభీర్యము కోలుపోక హృదయంగమముగా ఉన్నది. సంస్కృతశ్లోకమున కితడు గావించిన పద్యానువాదమిది–

**సామాం ద్రక్ష్యతి వక్ష్యతిస్మ చ కథాః ప్రత్యంగ మాలింగనైః**
**ప్రీతిం యాస్యతి రంస్యతే సఖి సమాగత్యేతి చింతాకులః**
**సత్వాం పశ్యతి వేపతే పులకయ త్యానందతి స్వేదతి**
**ప్రత్యుద్గచ్ఛతి మూర్ఛతి స్థిరతమః పుంజే నికుంజస్థితః**

**అల చెలి వచ్చి కాంచు సకలావయవమ్ములు కౌగిలించి తా**
**జెలగు ననంగ ధర్మములు సెప్పు రమించు నటంచు శౌరి లో**

నలరు విరాళి నొందగను నధ్వముగాంచును బుల్కలుం జెమ
ర్పులొలయ మూర్ఛిలున్ స్థిరతమోవృతకుంజము సేరి రాధికా!

"ధీర సమీరే యమునాతీరే" యిత్యాది జయదేవకవి అష్టపదికి ఈ కవీశ్వరుడు గావించిన కీర్తనానువాద మిది-

**కేదారగౌళ రాగము- ఆది**

మలయసమీరము గల యమునావని
గలఁ దమ్మా వనమాలి
చెలుగుచు వ్రేతల వలుదచనులు వే
నులుము నెడల దయమాలి ॥మలయ॥

సురత నియత మందిరమున శతసుమ
శరవేష మనోహరు డగుచు
తరుణీ హృదయేశ్వరు డున్నాడే
వరసేయక శ్రీహరికడ కరుగవలె ॥మలయ॥

ఘనసంకేత సదనాంకితయుతము
గను మృదువంశము నూదుచు
వనిత నీదుమేన నంటు తెమ్మెర
లనెగయు రేణువులను మన్నింపుచు ॥మలయ॥

పులుగులు గలచిన గలగలమను నా
కులరొద నీ రాక లనుచు లో
నులికి బెళుకు జూపుల నలరుల పా
న్పలరించి నీ దారులు గాంచుచు నీ ॥మలయ॥

పడతి! వైరిక్రియ నడుమ నందియముల
విడువు రతుల నాఅడిసేయున్



గడు జీకటి లేనడువు మసిత కం
బడము గప్పి కృష్ణుడు కల విడిదికి ॥మలయ॥

వరమరాళ భాసురాభ్రమన సుం
దర ముక్తాహార రుచిరుడౌ
హరియురమున మెఱుపురీతి కనగాం
గిరౌ మెఱసెదవె యుపరి సురతంబున ॥మలయ॥

నలిన నేత్ర మేఖలను వలువనుం
దొలగ ద్రోచి చెలువలరగను
కలికి ముదలలకు నెలవగు నీ పిఱు
దులు విరిశయ్యందుల జేర్పు మిపుడె ॥మలయ॥

పడతిరొ! గోపాలు డభిమాని రే
తడవు గడిచె బడిబడినను నా
నుడువులు విని యిప్పుడె మురారి లో
నడరెడి కోరిక లెడయక నింపవె ॥మలయ॥

సరోజముఖి యోగిరాల వేంక
టరత్నదాసు మది రంజిల్లన్
వరాంజ లిడి యాధరన్ గదళికా
పురిన్ వెలయు శ్రీహరిం దలంచవె ॥మలయ॥

ఋగ్వేది వేంకటనారాయణ కవియు, ఓగిరాల వేంకటనారాయణ కవియు, ఓగిరాల వెంకటరత్నదాసకవియు గీతగోవిందమునకు జేసిన ఆంధ్రీకరణములు తెలుగుభాష కలంకారములు. తెలుగు సంగీతరచనములయందు ఈ అనువాదములకును, సంగీతగ్రంథరచయితల యందు ఈ ఇరువురు కవీశ్వరులకును ఒక విశిష్టస్థానము కలదు.

# 12. కాలజ్ఞానతత్వములు

భగవద్గీత, బ్రహ్మసూత్రములు, దర్శనములు, తాంత్రిక రహస్యములు మొదలయినవి చదవడము, అర్థము చేసికోవడము కూడా పామరులయిన వారికి తలకు మించిన పని. కాని–

**'నళినీ దళ గత జలమతి తరళమ్**
**తద్వజ్జీవిత మతిశయ చపలమ్**
**విద్ధివ్యాద్య భిమాన గ్రస్తమ్**
**లోకం శోకహతం చ సమస్తమ్'**

అనిచెప్పిన శంకరభగవత్పాదులు మొదలుకొని

**'ఈ జన్మమిక దుర్లభమురా– ఓరి**
**సా జన్మ సాకార సద్గురుని గనరా**
**పంచాక్షరి మంత్రంబు పఠన జేయరన్న**
**పఠన జేసితె యముడు పారిపోవునన్న'**

అని లోకానికి తరుణోపాయం చెప్పిన బ్రహ్మంగారి వరకూ ఎందరో మహనీయులు భగవత్తత్వమును గూర్చిన జిజ్ఞాసతో తపించి తపించి తాము తెలుసుకున్న సత్యాన్ని సంసారమాయలో పడివున్న సోదర పామరులకు తెలపడానికి ప్రయత్నించినారు. ఆ మహనీయుల బోధలు, ఉపదేశాలూ అన్నీ పామరులకు గూడా అర్థమయ్యేట్లుగా గ్రామ్యభాషలో–పాటలుగా– పాడబడుతున్నవి. ప్రచారములోఉన్నవి. ఇలాంటి వేదాంతపు పాటలకే 'తత్వాలు' అనిపేరు. రాయలసీమలో ముఖ్యంగా కడప, కర్నూలు జిల్లాలలో ఏ ప్రాంతానికి వెళ్ళినా, ఏ గ్రామానికి పోయినా సంతలలో, జాతర్లలో కలవారి యిండ్లవాకిట, ఖామందుల లోగిళ్లలో, ముఖ్యంగా అంగళ్లవీధిలో– రైళ్ళపెట్టెలలో ఇట్టి తత్వాలు పాడే బిచ్చగాళ్లు విశేషంగా కనబడతారు. చంకన జోలె– ఆ జోలెలో తిండి తినడానికని పెట్టుకొన్న కుండపెంకు, ఒకచేత తంబూర– దానికి రాయలసీమలో



ఏకనాదం అనిపేరు– మరొక చేతిలో చిటికెలు పెట్టుకొని– 'అంతా చిన్మయ మఖండ మద్వయ మానందం బ్రహ్మానందం'– అని బ్రహ్మానందభూతిని పామరులకు తెలపుతూనో–

**"చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే చిత్తము చెడి పోనొరే యొరే**
**చిత్తము నందున చిన్మయ జ్యోతిని జూచుచు నుండుట సరే సరే**
**ఒక్క ప్రొద్దులని యెన్నుచునుంటె యొనరుగ చెడుదువు ఒరే యొరే**
**ఏకమైన యా వైభవమూర్తిని జూచుచు నుండుట సరే సరే"**

అని పామరులను మందలింపుతో హెచ్చరిక గొలుపుతూనో, తత్త్వాలు పాడే యీ వేదాంతులకు ఒక ఇల్లు, ఒక వూరు అన్నది లేదు. ఊరూరూ తిరుగుతూ ఏ మర్రిచెట్టు కిందో లేక పాడుపడ్డ సత్తరువులోనో నివాసం కల్పించుకొని 'తత్వబోధ' చేసుకుంటూ ఉండడంలోనే వారికి అఖండమైన ఆనందం.అచలమార్గ బోధకము లయిన యిటువంటి 'తత్వాలు' తెలుగుదేశంలో ఎప్పుడు ప్రారంభమయినవో మనము సరిగా చెప్పలేము. వేమనయోగి చెప్పిన 'తత్వాలు'గా కొన్ని కీర్తనలు ప్రచారములో ఉన్నవి కాని అవి వేమనవే అని నిర్ధరించి చెప్పడానికి వీలులేనివి. మనకు తెలిసినంత వరకు– లభించినంతలో– పోతులూరి వీరబ్రహ్మంగారి 'కాలజ్ఞాన తత్వాలే' తత్వాలకు సంబంధించిన మొదటి గ్రంథం. దీనికి తరువాత బ్రహ్మంగారి శిష్యులూ, శిష్యపరంపరలోని వారూ, అనుయాయులూ, యింకా యితరులూ అదే మార్గంలో తత్వాలు రచించి 'తత్వముల సాహిత్యమును' అభివృద్ధి చేసినారు. అచలమార్గ బోధకములయిన ఇటువంటి తత్వములు తెలుగులో వలెనే తమిళ కన్నడ ప్రాంతములందును ప్రచారములో ఉన్నవి. కాని అచలమతమును తెలిపే తత్వాలు అచల తత్వాలు. సమాధి రెండు విధములు. ప్రజ్ఞతో కూడినది, ప్రజ్ఞకూడ పోయినది అని. ఈ రెంటిలో రెండవదే సాధకునకు కావలసినది. అది నిశ్చల సమాధి. అదే అచలసమాధి. అదే రాజయోగము! అచలమతమని, అచలతత్వాలని అందుకే పేరు వచ్చినది.

అచలమార్గావలంబకు లయిన వారికి పోతులూరి వీరబ్రహ్మముగారి 'కాలజ్ఞాన తత్వములు' ప్రమాణ గ్రంథము. దీనిలోని తత్వములు కొన్ని వీరబ్రహ్మముగారు స్వయముగా చెప్పినవి. కొన్ని ఆయన శిష్యులలో ముఖ్యమైన దూదేకుల సిద్ధప్పగారు చెప్పినవి. వీరబ్రహ్మముగారి మనుమరాలు ఈశ్వరమ్మగారు చెప్పినవి. వీరబ్రహ్మముగారి శిష్యుడైన సాలెకులజుడు యాగంటి లక్ష్మప్పగారు చెప్పినట్లు కొన్ని ఉన్నవి. శిష్యులో, భక్తులో అయిన పూదోట రామన్నగారు, చిత్తూరు నరసింహదాసుగారు, కాలువ కోటయ్యగారు, కొమళ్ళూరి వీరరాఘవులుగారు, తాడిచర్ల చలమయ్యగారు, మహమ్మదు హుశేనుగారు, తరిగొండ భ్రమరాంబ నరహరి గారు మొదలయిన వారు చెప్పిన తత్వములను కూడా చేర్చి 'పరిమి వీరాచార్యులు' అనే అతను యీ 'కాలజ్ఞానతత్వా' లను కూర్చినట్లు కనబడుతున్నది. వీరబ్రహ్మంగారి భక్తుడూ, మదరాసు వాస్తవ్యుడూ అయిన పోకల శేషాచలమునాయుడుగారు కొన్ని తాము వ్రాసిన తత్వములను కూడా చేర్చి ఒక పుస్తకమును అచ్చువేసినారు.

కాలజ్ఞాన తత్వాలను రచించిన శ్రీపోతులూరి వీరబ్రహ్మంగారి జీవితమును తాడికొండ రాఘవాచార్యులుగారు 'వీరాచార్యచరిత్రము' లోను, జవంగుల నాగభూషణదాసుగారు, 'శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారి చరిత్ర' లోను, శ్రీజక్కులస్వామినాథయ్య గారు "శ్రీపోతులూరి బ్రహ్మంగారి జీవిత చరిత్ర, లోను వివరించి ఉన్నారు. వీరబ్రహ్మముగారు విశ్వబ్రాహ్మణులు. నందికొండ గ్రామవాస్తవ్యులయిన యనమదల వీరభోజయాచార్యులు– వీరపాపమాంబ అను పుణ్యదంపతుల పెంపుడు బిడ్డడు. కర్నూలు మండలమునకు సంబంధించిన బనగానిపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మగారి ఇంటిలో పశువులు మేపుచు బాల్యము గడుపుచుండగనే ఈయన అనేక మహిమలను చూపించిరి. తాను తోలుకొనిపోయిన పశువుల నాయన కాయడు. బయలులోనికి తోలుకొనిపోయి అక్కడ ఒక గిరిగీచి వానిని విడువగా అవి ఆ గిరి దాటకుండ గడ్డి మేయు చుండెడివట! క్రూర మృగములేవీ ఆ గిరి దాటిరావు. ఆయన మాత్రము దట్టమైన అడవిలోనికి పోయి అక్కడ ఒక గుహలో తాటాకులపై



ఒక విధమయిన ముండ్లతో తమ తపశక్తి వలన తాము తెలుసుకొన్న 'ఏష్య కాలజ్ఞానము'ను ప్రతిదినమును రచియించుచూ ఉండేవారట! ఈ వింతను ఒకనాడు చూచి అచ్చమ్మ అతనిని శరణువేడి శిష్యురాలయినది! ఆయన అనేక అద్భుతములు చూపినాడు. ఒక చచ్చిన ఆవును, చనిపోయిన మనుష్యులను బ్రతికించినాడు. ఒకప్పుడు పోలేరమ్మకు జాతర జరుగుచుండగా గ్రామపెద్ద లీతనిని జాతర చందా యిమ్మని కోరినారు. ఇతడు తనకడ ప్రస్తుతము లేదని, తరువాత కొన్నిదినములకు చెల్లింతుననీ చెప్పినాడు. గ్రామపెద్దలాతనిని రచ్చకీడ్చినారు. అతడు నిశ్చలముగా గుడికి యెదుట తిన్నెపై కూర్చుండి చుట్టకాల్చుకొనుటకై నిప్పును తెమ్మని పోలేరమ్మను కోరినాడు. వెంటనే పోలేరమ్మ ఒక చిన్న బాలికవలె గుడిలోపలి నుండి వచ్చి బ్రహ్మముగారికి చుట్టకు నిప్పంటించి పోయినది. ఈ వింత చూచి గ్రామపెద్దలు బ్రహ్మంగారికి క్షమాపణ వేడుకున్నారు. ఒకప్పుడు జడివానలో నిలిచి తడియకుండ ఈవలికి వచ్చినాడు. మహ్మదీయుడైన దూదేకుల సిద్ధయ్యకు పాడువేదాంతమును నేర్పి మతభ్రష్టుని చేసినాడని మహమ్మదీయులందరు ఇతనిపై సిద్ధవటము నవాబునకు నేరములు చెప్పగా, నవాబువారు బ్రహ్మముగారిని పిలిపించినారట! అప్పుడు బ్రహ్మముగారి ముఖములోని బ్రహ్మవర్చస్సును చూచి నవాబు ఆయనను శిక్షించుటకు మారుగా ఎంతో గౌరవించి పంపినాడట! ఈయన భార్యపేరు గోవిందమ్మ. ఆమెను ఈయన పెండ్లాడిన కథ కూడ చాలవింత కథ. ఈయనకు అయిదుగురు కుమారులు. ఒక కుమార్తె. వీరిట్లే సుఖముగా గృహస్థధర్మమును నిర్వర్తించుచూ ఒక వైశాఖ శుద్ధదశమి భానువారము నాడు జీవసమాధిలో ప్రవేశించినారు. అంతకుముందే తన ముఖ్య శిష్యుడైన దూదేకుల సిద్ధప్పను సమాధిలోనికి పూవులు తెమ్మని బనగానిపల్లెకు పంపి అతను తిరిగి వచ్చుటకు పూర్వమే 'కందిమల్లయ పల్లె'లో జీవసమాధియందు ప్రవేశించినారు. సిద్ధప్ప వచ్చి విషయము తెలుసుకొని విలపించినాడు. అతని దుఃఖానికి అంతులేకపోవడం చూచి బ్రహ్మంగారు సమాధినుండి లేచివచ్చి సిద్ధప్పను ఊరడించి అతనికి తన పాదుకలు, ముద్రాక్షతావళము, బెత్తమూ యిచ్చి

వెళ్ళినారు. ఈ వృత్తాంతాన్ని విని 'ఎల్మోరు' అనే అమెరికను మిషనరీ ఒకడు క్రైస్తవ బోధలను విన్న వాళ్ళెవళ్ళో ఈ కథను కల్పించి ఉంటారని, ఈ కథ నిజం కాదనీ వ్రాసినాడు. కాని క్రీస్తుబోధలకూ, బ్రహ్మంగారిబోధలకూ చాలా భేదములున్నవి. వారి గురుశిష్య సంబంధం అలాంటిది కనకనే 'బ్రహ్మంగారివంటి గురుడు లేడు, సిద్ధయ్యవంటి శిష్యుడు లేడు' అన్న సామెత లోకంలో వ్యాపించింది.

వీరబ్రహ్మముగారు సమాధియైన సంవత్సరమును గూర్చి మాత్రము చరిత్ర కారు లిద్దరు రెండు విధములుగా తెలుపుచున్నారు. తాడికొండ రాఘవాచార్యులుగారు క్రీ.శ. 1686 అనుచుండగా, జవంగుల నాగభూషణదాసుగారు క్రీ.శ. 1594 సం॥ అనుచున్నాడు. దీనినిబట్టి కాలజ్ఞానతత్వాలు ఇంచుమించుగా 16,17 శతాబ్దులకు చెందిన తత్వరచనలని చెప్పవచ్చును. వీరబ్రహ్మముగారి సమాధి నేటికిని 'కందిమల్లయపల్లె' లో ఉన్నది. ఈ కందిమల్లయపల్లె కడపజిల్లా బద్వేలు తాలూకాలో నెల్లూరు– కడప బస్సుమార్గములో ఉన్నది. బద్వేలు దాటిన తరువాత రాణిబావి దగ్గర బస్సుదిగి నడచికాని, ఎడ్లబండ్లమీద గాని కందిమల్లయపల్లెకు పోవచ్చును. ఇప్పటికీ ప్రతిసంవత్సరమునూ వైశాఖ శుద్ధదశమినాడు అసంఖ్యాకజనులు అక్కడ చేరి గొప్పగా ఉత్సవములు జరుపుతున్నారు. బ్రహ్మముగారి సమాధియున్న ఆ ప్రదేశము ప్రకృతి సౌందర్యముచేత గాని జనులను ఆకర్షించు మరి యే ఇతర కారణములచేతగాని స్వతః చూడదగినది కాదట! అక్కడికి చేరడమే ఎంతో ప్రయాసయట! అక్కడకు పోయినవారికి తిండితిప్పలు కూడా సరిగా దొరకవు. కాని వీరబ్రహ్మముగారి మీద భక్తి అన్నివేలమంది జనులను అక్కడికి ప్రతిసంవత్సరమును ఈడ్చుకొనిపోతున్నది. చాలమంది మొక్కులు కూడ మొక్కుకొని అక్కడికి వెళ్ళి మొక్కులు చెల్లించుట కలదు.

వీరబ్రహ్మముగారికి గురువు అల్లాడపల్లెలో ఉన్న ఆలయములో వీరభద్రస్వామిగా వేంచేసి వున్న సాక్షాత్తు భగవంతుడే అని కొందరు నమ్ముతున్నారు. ఈ అల్లాడపల్లె మైదుకూరు– ప్రొద్దుటూరు నడుమ ప్రొద్దుటూరునకు అయిదుమైళ్ల దూరములో ఉన్నది. తాడికొండ రాఘవాచార్యులుగారు మాత్రము వీరభద్రస్వామి అనే ఒక మహనీయుడు జీవించి యుండి బ్రహ్మముగారికి కావలసిన ఉపదేశములను ఇచ్చి పరమపదించగా ఆయన తదనంతరం ఆయనపేర అల్లాడపల్లెలో ఆలయం కట్టబడి ఉంటుందని తెలుపుతూ ఆయన తన ఊహకు హేతువులను తెలిపినాడు.



కలియుగమున కొన్ని ఉత్పాతములు, ఉపద్రవములు కలుగుననీ, వీరభోగ వసంతరాయడను ఒక మహనీయుడు అవతరించి ఆ లోకోపద్రవమును వారించుననీ బ్రహ్మముగారి 'కాలజ్ఞానపత్రిక' తెలుపుచున్నది. అట్టివే మరికొన్ని కాలజ్ఞాన విషయాలను బ్రహ్మముగారి తత్త్వాలు అక్కడక్కడా తెలుపుతూండడం చేత వారి తత్త్వాలకు కాలజ్ఞాన తత్త్వాలు అని పేరువచ్చింది. భవిష్యత్కాలంలో జరగబోవు విషయాలు తెలపడం, మనకు కొత్తకాదు. తమిళంలో 'ఏష్యము' లను తెలిపే 'నాడీగ్రంథములు' చాల ఉన్నవి. అవికాక భుజందర్‌నాడి, కౌశికనాడి ఇత్యాదులు ఉన్నాయి. అవి నేటికిని కొందరికి ప్రామాణికములయిన కొన్ని విషయములను తెలుపుచుండుట ఆశ్చర్యకరమయిన విషయము. ఆముక్తమాల్యదలో బ్రహ్మరాక్షసుడు 'ఏష్యములు' తెలిపినట్లుగా మాలదాసరి కథలో కలదు. 'ఏష్య కాలజ్ఞానము' లో కాలజ్ఞానము చెప్పిన పురుషులు అని ఏష్యములు తెలిపిన అనేకుల పేర్లు తెలుపబడినవి.

"అంగీరసే........................

వీరభోగ సముద్భవమ్".

వారు వారు చెప్పిన ఏష్యములు కొన్ని తప్పిపోవడము కూడా ఉన్నది. కాలజ్ఞానములో చెప్పబడిన విషయములు అన్నీ తప్పిపోయిన వనుటకు వీలులేనట్లే అన్నీ ఒప్పులే అనుటకును వీలులేదు.

బ్రహ్మముగారికి తరువాత ఆయన వలెనే తెలుగుదేశమున తత్వరచనలు చేసినవారు అనేకులు ఉన్నారు. ధవళేశ్వరములోని గుజ్జుల నారాయణదాసుగారు 'తారకామృత సారము' అన్న గ్రంథములో 'తత్త్వములు' రచించినారు. కాకినాడలో యడ్లరామదాసుగారు ప్రసిద్ధులు. వారి తత్వాలు తెలియని

పామరుడు సర్కారులలో ఉండడు. పాటిబండ సుందరరామయ్య, చల్లా సుబ్రహ్మణ్యశర్మ అనువారు కూడా తత్వాలు రచియించినారు. పిఠాపురమునకు చెందిన హసన్మియాసాహెబు 'తత్వజ్ఞాన రసాయనము' అన్నపేరుతో ఒకవేదాంత కీర్తనల పుస్తకము రచించినాడు. అందులోని కీర్తనలు బ్రహ్మంగారి తత్వాలవలె వేదాంతమును సులువుగా బోధింప గలవి. బెంగుళూరులో చిప్పగిరి భంభం గురుయోగీంద్రులవారి శిష్యులయిన భంభంహుశ్శేనుయోగిగారు రచించిన తత్త్వములు అచ్చుపడినవి. ఇట్లు తత్వాల రచనలో బ్రహ్మంగారి కోవ నేటికీ వర్ధిల్లుతూనే వున్నది.

పరమరహస్య మయిన పరమార్థము– పరబ్రహ్మతత్వము బ్రహ్మముగారి మాటలలో యెంత అవలీలగా అందుతున్నదో ఈ తత్వం వినండి.

**ముఖారి రాగము- చాపుతాళము**

**ప్రపంచనడత జూటా మనపెద్దల వాక్యము బాటా ॥ప్ర॥**
**ముగ్గురుమూర్తులు జూటా మూలము ఎరుగుట బాటా ॥ప్ర॥**
**చదువు శాస్త్రములు జూటా ఒరె సద్గతి యెరుగుట బాటా ॥ప్ర॥**
**అన్నిటిని గొల్చులు జూటా తన ఆత్మలో యెఱుగుట బాటా ॥ప్ర॥**
**మతి మంత్రంబులు జూటా మదిలో నెరుగుట బాటా ॥ప్ర॥**
**ఎగ్గులు జేయుట జూటా రాజయోగము నెరుగుట బాటా ॥ప్ర॥**
**కొండలు తిరుగుట జూటా ఈ కోటలు యెరుగుట బాటా ॥ప్ర॥**
**కాశికి పొయ్యేది జూటా మన కంటిలో యెరుగుట బాటా ॥ప్ర॥**
**గురువులేని బాట జూటా గురుకీలక మెఱుగుట బాటా ॥ప్ర॥**
**పరులను యెరుగుట జూటా గురుపాదము యెరుగుట బాటా ॥ప్ర॥**
**వీరయ్యదాసుని మాటా దాని వివరము యెరుగుట బాటా ॥ప్ర॥**
**నమ్మనవారికి జూటా గురుని నమ్మినవారికి బాటా ॥ప్ర॥**

మరొక తత్వం యిది వినండి. హృదయాన్ని గుంజుకోనిపోయి భగవదున్ముఖంగా చేయగల 'గతి' కలది యీ తత్వం.



**చెప్పు లేదంటనక పొయ్యేరు నరులార గురుని**
**చేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు ॥చె॥**
**చెప్పులేదంటనక పొయ్యేరు**
**తప్పుదిదిగో గురుని వాక్యము**
**తప్పుదోవల పోవువారల చప్పరించి మ్రింగె శక్తులు ॥చె॥**

**మొప్పెతనమున మోసపొయ్యేరు**
**అదిగాక కొందరు గొప్పతనమున గోసు మీరేరు ॥చె॥**
**ఇప్పుడప్పుడనగరాదు ఎప్పుడో ఏ వేళనో మరి**
**గుప్పు గుప్పుమని దాటీ పోయెదు గుఱ్ఱపడుకులు ఏరుపడును ॥చె॥**

* * * * * * *

ఇల్లు వాకిలి నాది యిల్లాలు నా దనుచు యేలభ్రమసితి వయ్యో మనసా॥

కాలుని వలలోను కానకను జిక్కితివి కడతేరుటే త్రోవ మనసా॥
తనయులు చుట్టాలు తన వారలని నమ్మి తలపోయకే వెఱ్ఱిమనసా॥
తనువువిడచి వెళ్లె సమయంబులోపల తన వెంట రారైరి మనసా॥
ఆరుమూడిట తేరి ఆపత్తేజముగని ఆనందమున గనుగొనవె మనసా॥
మేటిస్థానములోను మేటిస్థానమునందు సూటితప్పక చూడు మనసా॥
వాటముగా బింబము తేటగా గనబడును తెలివిగలిగి బ్రతుకు మనసా॥

మరొక తత్వము–

**నాదనామక్రియరాగము-చాపుతాళము**

మనసు మనసున బెనగి మనసు యేకముచేసి మనసు మర్మము గన్న దెఱుకా

**మకను చూపులకు నడుమ ఘననాసికము కాలికదిసి**
**రొండొకటిగ గన్న దెఱుకా**
**అక్షరంబుల కాది అక్షరము తా దెలిసి అక్షరము**
**పఠియించు టెఱుకా**
**అక్షరంబును ప్రణవము లించి వీనులను అనుదినము**
**వినుటయే యెఱుకా**

*  *  *  *  *  *  *

**ఎన్ని జన్మములెత్తి ఎన్ని తపములు చేసి ఈ జన్మమెత్తితివి మనసా!**
**ఎన్ని విధములైన నే రూపమున గురుని యెడబాయకుండవే మనసా!**
**చదువులన్ని చదివి సన్మార్గమార్గమున సంచరింపగనేల మనసా!**
**చదువులలో తత్వసారంబు దెలిసికొని సందేహములు మాను మనసా!**

*  *  *  *  *  *  *

దాదాపుగా మనదేశంలో ఏదో ఒక రూపములో వ్యాపించివున్న అద్వైత సిద్ధాంతమును సామాన్య ప్రజలలో బోధించుట కెవ్వరును పూనుకొనలేదు. అట్టిలోటు ఈ 'కాలజ్ఞాన తత్వములు' తీరుస్తున్నవి. నేటికీ సామాన్యులలో– పామరులలో– గురుబోధ నొంది ఈ మతము నాశ్రయించిన వారు– బ్రహ్మముగారి శిష్యపరంపరకు జెందినవారు– లెక్కకుమీరి వున్నారు. రాయలసీమలో ఇంచుమించుగా ప్రతిగ్రామములోనూ ఉన్నారు. అగ్రజాతులవారిలోనూ బ్రహ్మంగారి శిష్యులు సకృత్తుగా వున్నారు. పాశ్చాత్యవిద్యా ప్రభావముచేత అన్ని మతములతో బాటు ఈ యచలమతమును దిగజారిపోయినది. కాని వున్నంతవరకు ఈ మతమే అంతో ఇంతో రూపు చెడకుండా ఉన్నది. మతంమాట ఎలావున్నా, ఆ మతానికి సంబంధించిన తత్వాలు మాత్రం సేకరించి భద్రపరుపదగినవి. వానిలోనెల్ల పరమ ప్రామాణికమయిన కాలజ్ఞాన తత్వాలు పామరులకు భగవద్గీతాగ్రంథము వంటివి.

# 13. దామెరవారిమీది పదములు

తెలుగునాట సంస్థానములు మొన్నమొన్నటి దాక కవితాకళాస్థానములుగ విరాజిల్లిన వనుట సత్యదూరము కాదు. కోటికి పడగలెత్తిన కోటీశ్వరులుగా, యక్షాధీశ్వరునైన లక్ష్మముసేయని మహైశ్వర్య సంపన్నులుగా, పలికినదెల్ల భాగవతము, పట్టినదెల్ల బంగారముగా బ్రదుకులు వెళ్లసాగించిన 'వైభవవితాన పురందరులైన యట్టి భూపతు' లలనాటి సంస్థానాధీశ్వరులు! రాజ్యసంరక్షణము పొంటె– ఒండె– రాజ్యవిస్తరణము పొంటె కుడిచి యొకచో కూర్చుండ నోచుకొనని వారికి పరరాజ్యముల మీదికెత్తి చనుటలో, రాజ్యవ్యవహారములలో తీరికమాట అటుండ విశ్రాంతి జెందుటకైన అవకాశము చాల తక్కువ రాజ్యవ్యవహారములలో నలగులయై ఉడుకెత్తి పోయిన మనస్సుల జఙ్రపరచుటకు, విసుగుదలను పోగొట్టి విశ్రాంతి చేకూర్చుటకు వినోదములు, విహారములు, ఆటలు, పాటలు అను మార్గాంతరములను వారాశ్రయింపవలసెను. వినోదములలో సాహిత్యవినోదమునకు, సత్కవి గోష్ఠికి వారు ముచ్చటపడుట భాషాదేవి అదృష్టము! సాహిత్యముతోబాటు సంగీతమును వారి ఆదరణమున వర్ధిల్లినది. శ్రుతిసుభగముగా శ్రవణపేయముగా జాల్వారుచున్న సంగీత తరంగము లమృత నిష్యందము జిలికి వారికి హాయి గొల్పెడివి! సంగీత సాహిత్యము లిట్లు సంస్థానాధీశ్వరుల సభాస్థానములయందు పీఠమువేసికొనుట చేతనే ఆంధ్రభాషామతల్లి రాజస మలవరచుకొని ఒక వింత హొయలు కులికినది.

సరస సద్గోష్ఠిలో మునిగి తేలుచున్న సంస్థానాధీశ్వరులు సంగీత సాహిత్యరసికులై– భ్రమరకీట న్యాయమున– స్వయము కవిత జెప్పగల సత్కవీశ్వరులై ప్రసిద్ధ సంగీత గ్రంథముల గ్రంథకర్తలై విరాజిల్లుట పలువురియెడ గాననగు సత్యసంభవము! సమరాంగణమునందువలె సాహితీరంగమునను వైపు వాటకము లెరిగిన పోటు మగలై విజయమునంది ప్రజాహృదయముల చూరగొనిన మహారాజకవులు పలువురుండుటయే ఇందులకు నిదర్శనము!

కాళహస్తి సంస్థానము తెలుగునాట సంస్థానములలో పేరెన్నిక గాంచినది. దామెరవారు తదధీశ్వరులు. పద్మనాయక కులమునకు జెందిన డెబ్బదేడు గోత్రముల నాయకులలో ఇనుగాల గోత్రమునకు చెందిన వీరనాయకులు వీరు. వెంకటగిరి సంస్థాన పరిపాలకులగు వెలుగోటివారితో వియ్యమందిన వితరణ రణశూరులు వీరు. ప్రసిద్ధుడు, మహాపరాక్రమవంతుడునగు వెలుగోటి యాచమనాయుని తల్లి వెంకటాంబిక దామెరవారి ఆడుపడుచు. ఈ వియ్యపు సందర్భము దామెర వారికొక గొప్పతనము చేకూర్చునదిగా, అధిక గౌరవప్రదముగా బహులాశ్వచరిత్రమున ఇట్లు పేర్కొనబడినది.

**"తదనుజ యైన లోకహిత ధర్మ విశంకట వేంకటాంబికం**
**గదన కిరీటి యాచవిభు కస్తురిరంగ నృపాలవర్యు డిం**
**పొదవ వరించి కాంచె విభవోజ్జ్వలు రంగయ యాచభూవరున్**
**విదిత గుణాఢ్యు సింగపృథివీ వర చంద్రుని నక్కమాంబికన్".**

**"ఉత్తమ మల్లూరి యొద్ద దావలపాప**
**విభుని గొట్టిన నాటి విజయకలన**
**తిరుమల చేరి ధాత్రిని మన్నెరాజుల**
**బాఱద్రోలిననాటి బాహుబలము**
**చెంగలిపట్టు వీక్షించి లగ్గలువట్టి**
**యాక్రమించిన నాటి విక్రమంబు**
**పాలెంబు కోట వెల్పటి నాజి యతిరాజు**
**జరగజేసిన నాటి శౌర్యపటిమ**
**మున్నె తోపూరు జగ్గరాణ్ముఖుల నొంచి**
**మధుర దొర చెంజి మన్నీని మదమడంచి**
**తిరిచెనావలి చొర దోలు తేజము గల**
**మేటి వెలుగోటి యాచని సాటి గలరె?"**



**"ఈ మన్నీలం గను కాం**
**తామణి పుట్టినిలు దానధర్మదయా ల**
**క్ష్మీ మహిమల పుట్టిల్లట**
**దామర్లాన్వయము బొగడ దగదే ధాత్రిన్."**

**బహులాశ్వచరిత్రము ఆ 1.**

కార్వేటినగర సంస్థాన పరిపాలకులవలె వీరును సంగీత సాహిత్య విద్యారసికులు. పండితకవి పోషణమున పరమానందము నందుచుండిన సుందరమధుర స్వభావులు! సాహిత్యవిచారము, సంగీతప్రచారము సలుపుట మాత్రమే కాక వీరు సంస్కృతాంధ్రముల చక్కని సాహిత్యమలవరచుకొని స్వయము సత్కవీశ్వరులై సత్కావ్యముల నెన్నిటినో విరచించి భాషాదేవి గైవారము చేసి జని కృతార్థముగా సాహితీ జీవనము గడపిరి.

వీరి వంశమునకు జెందినవాడు, ఏతత్సంస్థాన పరిపాలకుడు అగు దామెర వెంగళభూపాలుడు బహులాశ్వచరిత్రమను ప్రఖ్యాత ప్రబంధమును రచించిన వాడు. ఇతడు క్రీ.శ.1550-1600 నడిమి కాలమువాడు. ఇతనికి అగ్రసోదరుడగు చెన్నభూపాలునికి దిమ్మాంబయందు కలిగినవాడును, వెంగళభూపాలునికి ఇంచుక తరువాతి వాడును అగు దామెర అంకభూపాలుడు ఉషాపరిణయ మనెడు రసవత్తర ప్రబంధమునకు కర్త. వీరి వంశమునకు జెందిన వాడే, వీరి తరువాతి తరములలోని (పదమూడవ తరము వాడు కాబోలు) వాడగు దామెర వెంకటరాయకవి సేతుఖండమను ఒక కృతి రచించెను. ఇతని తమ్ముడు దామెర చినవెంకటరాయకవి వేంకటాచలమాహాత్మ్యమను ఒక గొప్ప ప్రబంధమునకు కర్త [1] జ్ఞాన ప్రసూనాంబికా శతకమును రచించిన

1) దామెరవారి రచనలలో బహులాశ్వచరిత్ర మొక్కటే నేటికి ముద్రితముగా నున్నది. తక్కినవి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో కలవు. అందులో ఉషాపరిణయము చారిత్రకముగా మిక్కిలి విలువగల గ్రంథము. వెంటనే ముద్రింపదగినది. (1908 లో తి.తి.దేవస్థానం వారిచే ఈతని వేంకటాచలమాహాత్మ్య గ్రంథము ముద్రింపబడినది. పరిష్కర్త శ్రీ బిరుదరాజు రామరాజు)

మహాపండితుడు. కవీశ్వరుడు శిష్టు సర్వశాస్త్రి తనకు పోషకులగు ఈ కాళహస్తి రాజులపై చెప్పినవియు, వారి ఆదేశమున వారు కోరిన వస్తువుల నభివర్ణించుచు చెప్పినవియు అగు చాటువులు వీరి సాహితీ ప్రియతను చాటును. [2] కవి ధూర్జటివంశమునకు చెందినవాడును, రత్నావళీపరిణయ ప్రబంధకర్తయు అగు ధూర్జటి వెంకటరాయకవి వీరి సంస్థానమునకు చెందినవాడు.

నాటి దనుక ప్రజాహృదయములలో పలుకు చెల్లుబడి సాగించుకొనిన పదకవిత క్రమక్రమముగా ప్రజాస్థానముల వదలి రాజగౌరవము పొంది రాజసముతో మెరయవలెనని కాబోలు రాజాస్థానముల కెగబ్రాకినది. తంజావూరున విజయరాఘవ నాయకుడు పదకవితను చేపట్టినాడు. క్షేత్రయ్య విజయరాఘవ నాయకుని ఆస్థానిలో పదకవితకు పట్టాభిషేకము జరిపినాడు. తరువాత కొలదికాలమునకే కార్వేటినగర సంస్థానాధీశ్వరుడు సాళువ మాకరాజు సారంగపాణిని చేపట్టినాడు. తనపై పదములు చెప్పించుకొనినాడు. అతనిచే పదములు విరచింపజేసినాడు. దేశికవితను వెలార్చుటలో సారంగపాణికి మాకరాజు ఆశ్రయము చాలుగా ఉపకరించినది. మాకరాజు ఆస్థానిలో అతని ఆధ్వర్యమున పదకవిత గండపెండేరము తొడిగించుకొన్నది. పదకవిత పడయుచున్న బహుళగౌరవము చూచి దామెరవారికి కన్నులు జిగేలు మన్నవి. తామును దాని జేపట్టి విఖ్యాతి పడయవలయునను కోరిక వారికి ఉదయించినది. పదకవుల చేరదీసిరి. వారిని ప్రోత్సహించిరి. వారిచే పదవిరచనము గావింపజేసిరి. అలనాటి వారి సత్కృతీ ప్రోత్సాహఫలితమే నేడు నూతనముగా మన కుపలబ్ధము లగుచున్న 'దామెరవారి మీది పదములు'–

కీర్తిశేషులు గురువర్యులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు రెండు సంవత్సరములకు పూర్వము బహుప్రయాసముతో శ్రీకాళహస్తి సంస్థానమునకు జెందిన ప్రాచీనగ్రంథ భాండాగారములోనికి ప్రవేశము సంపాదించుకొని అక్కడి

2) ఇవి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో గలవు. చూ.R .233



తాళపత్రముల నెల్ల పరిశోధించి అందు మిక్కిలి విలువగల గ్రంథములను వారి అనుమతితో గొనివచ్చి తిరుపతి శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ పుస్తకశాలకు జేర్చిరి. అక్కడి నుండి సంపాదించిన గ్రంథముల లోనిదే ఇటీవల వారు ద్వితీయాన్నమాచార్యోత్సవ సందర్భమున ప్రకటించిన తాళ్లపాక తిమ్మక్క–అన్నమయ్య సతి తొలి తెలుగు కవయిత్రి కృతి* సుభద్రాకల్యాణము. రంగనాథుని కృతియగు 'శివమంత్ర వర్ణనము' అను నమశ్శివాయ రగడను** గూడ వారక్కడ నుండియే సంపాదించిరి. ఇచ్చుట ప్రసక్తములగుచున్న 'దామెరవారి మీది' పదములను గూడ కాళహస్తి సంస్థానపు గ్రంథసంచయము నుండియే వారు సంపాదించిరి. ఈ పదములు గల తాళపత్ర గ్రంథము నేడు శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ పుస్తకశాల యందు సురక్షితముగా ఉన్నది.

శ్రీ శాస్త్రిగారి చరణ సన్నిధినుండి పదకవితను గూర్చి పరిశ్రమించుచుండిన వాడనగుటచే వారీ పదముల యోగ్యతను గూర్చి నాకు దెలిపి దీనిని ప్రకటింప నాడే నా కాదేశించి యుండిరి. శ్రీవారి యాశయము నేటికి ఫలోన్ముఖమయినది.

ఈ పదములుగల తాళపత్రగ్రంథము దామెర కృష్ణస్వామి అను ప్రభువు తన సొంతమునకు వ్రాయించుకొనినదిగా తోచుచున్నది. తాళపత్ర సంపుటమునకు సంరక్షకముగా ఉన్న కొయ్యపలకపై 'రాజశ్రీ దామెర కృష్ణస్వామి పొస్తకం– ద్వయతా ద్వయతం' అని ఉన్నది. ఇందు తొలుతన ప్రౌఢుడగు దామెర కృష్ణస్వామి ప్రభువు రచించినవే కాబోలు కొన్ని పద్యములు, అగస్త్యనాథ మకుటముతోడివి కలవు. పిదప కృష్ణ సంబుద్ధితో కొన్ని పిచ్చి పద్యములు తద్రచితములే కాబోలు ఉన్నవి. ఆ పిదప దామెరవారి మీది పదములు వ్రాయబడియున్నవి. ఆ పదముల రచయితను గూర్చిన విశేషములేవియు ఆ

* శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ ప్రచురణము– సంఖ్య 20.

** చూడుడు.రంగనాథుని శివకవిత్వము అను వ్యాసము, Journal of Sri. Venkateswara Oriental Institute.

పదముల వలన తెలియవచ్చుటలేదు. కాని యగస్త్యనాథ సంబుద్ధితోడ పద్యములు వ్రాయబడియున్న పత్రములకు తరువాతి పత్రములో నిట్లున్నది.

'మునిపల్లె రామలింగార్య పుత్రులైన సుబ్రహ్మణ్య కవితా చాతుర్యంబుగా రచియించిన రామాయణ కీర్తనలూ తమ ప్రియశిష్యులైన రాజెశ్రీ దామెర కృష్ణస్వామి వారికి కృపచేసి యిచ్చిన పుస్తుకం'-

ఇందలి రెండవ వాక్యము- తప్పు కాబోలు- గీతలు గీసి కొట్టివేయబడి ఉన్నది. తొలి వాక్యమున పేర్కొనబడిన రామాయణ కీర్తన లేవియు తరువాతి పత్రములలో గానరావు. లేఖకుడు వానిని వ్రాసికొనదలచి తిరిగి యే కారణము చేతనో మానియుండును. ఇందలి అగస్త్యనాథ సంబుద్ధితోడి పద్యములు వ్రాయబడియున్న తొలి పత్రములయందు 'శ్రీ శివ సహాయం శ్రీసుబ్రహ్మణ్య గురవేనమః' అని కలదు. ఈ ప్రతి వ్రాసికొనిన దామెర కృష్ణస్వామి ప్రభువునకు మునిపల్లె రామలింగార్యుని పుత్రుడగు మునిపల్లె సుబ్రహ్మణ్యకవి గురువని తెలియుచున్నది. సుబ్రహ్మణ్యకవి రచించిన రామాయణ కీర్తన లేవో ఎరుగరావు. రామాయణకీర్తనల కర్తృత్వము సుబ్రహ్మణ్యకవి సంగీత శాస్త్రాభిజ్ఞతకు నిరూపకముగా ఉన్నది. దామెర ప్రభువులమీద రచియింపబడిన ఈ పదములు కూడ రామాయణ కీర్తనలను రచించినవాడును దామెర కృష్ణస్వామి ప్రభువునకు గురువును అగు పై సుబ్రహ్మణ్యకవి రచితములయి ఉండునని నా యభిప్రాయము.

ఇందు నాలుగు పదములు దామెర తిమ్మభూపాలుని కుమారుడగు దామెర కుమార వేంకటసార్వభౌముని మీదను, మరి రెండు పదములు దామెర వేంకటేంద్రుని కుమారుడగు దామెర కృష్ణభూపాలుని మీదను రచింపబడి ఉన్నవి. తక్కినవానిలో ఒకటి కాళహస్తీశ్వరుని మీదను, మరొకటి అగస్త్యనాథేశ్వరుని మీదను రచింపబడి ఉన్నవి. దామెరవారి మీద రచింపబడిన పదములవి. చక్కని రచనముతో సరస సుందరములుగా ఉన్నవి. చూడుడు.



**1. సావేరి రాగం**

**పల్లవి**

**నృప శిఖామణి వౌరా**

**అనుపల్లవి**

**విపుల శ్రీదామరల- వెంకటవజీరా ॥నృప॥**

**చరణములు**

**వగమీఱ తాళికై- వజ్ర మడిగినను నె**
**మ్మొగ తమ్మి మాంజాళి- పగిది ముద్దాడేవు**
**జిగి బన్న సరమునకు- పగడంబు లడిగితే**
**పొగర తగు కన్నుచూ- పులనె తేలించేవు ॥నృప॥**

**కొదమపులిగోరునకు- గోమేధిక మడిగితే**
**పదరకని పరమ పా- వనత జూచేవు**
**పొదలు మేఖలకు నను- పుష్యరాగ మడిగితే**
**మది కుచగిరిక్షేత్ర- మహిమ కొనియాడేవు ॥నృప॥**

**వెలయు కమ్మలకు కురు- వింద మణు లడిగితే**
**లలితరాగము దెచ్చి- కలయ గూడేవు**
**వెలలేని మాణిక్య- ములు నీ గుణము లెన్న**
**గలనె కుమార వెం- కట సార్వభౌమ. ॥నృప॥**

**2. ముఖారి- ఆటతాళం**

**పల్లవి**

**మనసు వచ్చితే రమ్మనవే- దా**
**మరల కుమార వేంకటేంద్రుని**

అనుపల్లవి

వనితరొ చెలగుచు- పరిపరి గతులను
బహుబంధంబుల బెనగుదును- నా సామిని ॥మనసు॥

చరణములు

సదయుడవని మ్రొక్కి- సారెకు రా నీపై
పదమూలు వినిపింతును
మదిరాక్షి నా సామి- మది రా నడచి దక్కి
మనవి యంతయు దెల్పుదు
మృదుపాదములు తమక- ము నను వానితొడల
మీద నుంచుకొందును
కుదురుగ బాగాలొసగి ఆ- కు మడుపు.... నే
కొఱికి సగమందింతును- నా సామిని ॥మనసు॥

కోరికె లిమ్మని- కురులచే కట్టుదు
కొట్టుదు విరిసరులా
తీరైన మన్నెము- వీరుడనుచు వెఱచి
యూరకె నే నుండను
ఔర మంచిది కాని- లేరా యోరి యని
నేరము లెన్నుదును
పేర బిలిచొకసారి- పెనగొందు నొకసారి
పెనగొందు పైకొందును- నా సామిని ॥మనసు॥

రాజమౌళి రాజ- రాజు యశోధన
రాజరాజ నుతుడు
రాజముఖీ! యిందు- రానే వచ్చితే యెంతో
రాజిల్లు నా భాగ్యము



శ్రీ జయోన్నతుడు నా- చెలువుడైతే వినవె
చెలి నా జన్మఫలము
అమ్మ నే జెల్ల మో- హము నిలుపలేక మో
వానిన వాడేమనునో- నా సామిని ॥మనసు॥

పక్కజేరి గుబ్బ- పాలిండ్ల గుమ్ముదు
పణతి వాని యెదను
చెక్కిలి నొక్కుదు- చిఱుచెమట నా పయట
చెఱగూన నొత్తుదును
అక్కరతో వాని నలయనియ్యక నేనె
అమ్మరుకేళిలోను
తక్కు ధిక్కు తద్ధి- తక్క ధిక్కు మని లయ
తప్పక క్రీడింతును- నా సామిని ॥మరసు॥

అనురక్తి నలరు పా- న్పున మారుతంత్రము
లన్ని విన్నవింతును
మొనసి పుక్కిటి వీడె- మొసగుదు రతిమైక
మున సొక్కు కన్నులాను
చనవుచే గళము హ- స్తము లూరువులు జంట
బెనయ కౌగిలింతును
అనువందు వెంకటా- వని పాలచంద్రుని
నెనసి పాయక యుందును- నా సామిని ॥మనసు॥

### 3. కల్యాణి- ఆదితాళం

పల్లవి

మన్నెదొరవైతేనె- మనవి చిత్తగించరాదా- వాదా

అనుపల్లవి

వన్నె మీఱ శ్రీదామెర– తిమ్మావని వరకుమార ॥మన్నె॥

చరణములు

వలపోర్వలేక సామి నిన్ను
వలచి యున్నదాన న
న్నులమిన్న నన్ను నేలుకొన్న– ఘనమగు చె
న్నులరారు కుమార వెంకట వజీర
కవుగిలీయ రారా– కన్నడ జేసెద వేరా ॥మన్నె॥

గందము నీ మేనను నలది పున్నమ–
చందమామవలె నంద
మొందు మోమునందు తిలక– ముంచి నా సామి!
యిందు రమ్మని నన్ను బిలిచి తమి–
హెచ్చుట నీతో సారెకు దెలుపుచు
కెందలిరుల డెంకపఱచి తియ్యన–
జెంది యున్న మోవి తీవి నొక్కుచు
సుందరముగ నీ డెంద మలరగను–
సొంపు మీఱ మెలగగ నేర్తు ననుచు
మాటికి నిను వేడుకొనిన ॥మన్నె॥

దానింట నుండి నిన్నరాతిరి యొక
చాన విరిసరుల దెచ్చి సము–
ఖాన నుంచి నిలిచిన పరాకా
ఆ నెలత నీకు కానుక బంపిన– దనిన విన్నపము



దా నాదరించి సఖియ– నేను వచ్చి కవుగిలిచ్చి మచ్చిక
సూనశరుని కేళి బాళి నెనయగ
మానవతికి మనమలర బలుకుమని
ఆనవాలు పంపుట మా సఖిచే వింటిని
యివి తగునటరా ॥మన్నె॥

తక్కులాడిపై గల ప్రేమ– దాచుచు నీవు
పెక్కుమాటలను చక్కెరలు గురియ
మక్కువ జేసేవు– యీ జాలము
యెక్కడ నేర్చితి– వింతలోనె నన్ను
అక్కున జేర్చి గుబ్బ– లదిమి పైకొని
చెక్కిలి నొక్కి చొక్కి– యెక్కువైన నెనరున
మొక్కీ తక్కినా నటంచు సమరతి
గ్రక్కున నేలితివి యింక నుపరతి
యిక్కువలను దామెర వెంకటేంద్ర ని
న్నెనయగ మనసాయెరా ॥మన్నె॥

**4. ఆనందభైరవి రాగం**

అంతటి విలుకాడ ననుచు
సంతతము కలహము సేయుచున్నాడె యేమిసేతు ॥అమ్మలారా॥

చరణములు

అతనివలె ప్రకాశ మౌదు–
ననుచువున్న నా విభుని తోడి తేవె వో యమ్మలారా

అతి మోహము చేత నుప్పొంగుచు
నా చెంత జేరి సురటి విసరే సామిని అమ్మలారా ఓ యమ్మలారా
నల జయంత వసంత– నలకూబరాదులతో
సరియైన సామినీ తోడితేవె– వో యమ్మలారా
ప్రభువులకు మేటైన– ప్రభు వేంకటేంద్రుని
చపలాక్షి వేగ తోడి తేవె– వో యమ్మలారా–

**5. ఆనందభైరవి– ఆటతాళం**

పల్లవి

చెలియ యీ విరహ మ– గ్గల మాయ నెట్లోర్తు
చెలిని తోడితేవె

అనుపల్లవి

చెలగి చంద్రుడు గాయగ– నెలమి మరు దేయగ
చిలుకలు గూయగ– అళులు రొదసేయగ ॥చెలియ॥

చరణములు

కొమ్మరో వినవె యా– కొమ్మ నను వేగమె
రమ్మని కౌగిట జేర్చునె– కమ్మని మోవి
యిమ్మని నన్ను వేడునె– వేడినంతనె
సమ్మతి తోడ ము– దమ్మున దానికి
కెమ్మోవి యిచ్చితి– నెమ్మదితో వినవె ॥చెలియ॥

అంతట శయ్యకు రమ్మని నను బిలిచి
నంతలోనె వేడ్క– మీఱగా చాల
సంతతమును రమ్మని ముద్దిమ్మని



అంతలో దాని స– మ్మతముగ గూడగ
సంతసించినట్టి– సతిని నను గూర్పవె ॥చెలియ॥

సరసముతోడ నా– సరణి మీటుచు
సరస గతుల వాయించుచు
భరత ప్రౌఢిమ మీఱ– భావజ్ఞుడై
ధరవెలసిన శ్రీ– దామెర వెంకట
ధరణి పాలుని తనయ! కృష్ణా! యని నను గూడెను. ॥చెలియ॥

**6. ఆనందభైరవి– ఆదితాళం**

పల్లవి

నిందెప నిందలు పుట్టెను– యిందు కేమిసేతు
నిందెప నిందలు పుట్టెను

అనుపల్లవి

మందయాన యిందువదనను
యిందురమ్మని పిలిచినందుకు ॥నిందెప॥

చరణములు

ఎప్పుడైనా దానితో– హితవుగా నే బలికినానా
కప్పుర వీడ్య మా– కలికి కిచ్చినానా
మెప్పు తోడ దాని నే– మెచ్చుకొన్నానా
చుప్పనాతియెవ్వతో– చూచినట్టు పలికెనేమో ॥నిందెప॥

సరసముగ దాని నా– సరసకు బిలిచినానా
విరిసరములైనా యా– విరిబోణి కిచ్చినానా
కరకరి మరుదేయగ– కరము బట్టి కౌగిలించి
మరిమరి ముద్దులిమ్మని– మరులు కొల్పివేడినానా ॥నిందెప॥

పాటలాటలచేత- పక్కజేరి పై కొన్నానా
నీటుగ కస్తూరిబొట్టు- నిటలమున దిద్దినానా
పాటలగంధి యని పిలిచి- బటువైన కుచముల నంటి
మేటి కృష్ణుండ ననుచు నా- మెలతను గూడినానా ॥నిందెప॥

**7. కల్యాణి- ఆటతాళం**

పల్లవి

నిన్నె కోరినారా- శ్రీకాళహస్తీశ (శ్రీవేంకటేశ)
నిన్నె కోరినారా

అనుపల్లవి

పన్నగ శయన- పన్నగ భూషణ*
భక్త జనపోషణ
మన్ననతో నా- మనవి చేకోరా ॥నిన్నె॥

చరణములు

నన్ను నింత యేచ నేలా- యిట్లా
కన్నడ సేయుట మేలా- నేను
కొన్నాళ్లనుంచి నే- నిన్ను ధ్యానము సేయు
చున్న నన్ను రక్షిం- చుమురా జగదీశ! ॥నిన్నె॥

సంతతము నిను నమ్మి- నీ
శరణు జొచ్చినాను సుమ్మి- నన్ను
వింతగ జూడకు- వేగమె రక్షించు
పంతము సేయక- ప్రత్యక్షము గమ్ము ॥నిన్నె॥

* 'పన్నగభూషణ-పన్నగశయన' అని ఉంటే అన్వయం (సంపాదకుడు).



జపతపముల చేత నిన్ను
నుపమగ గొలిచిన నన్ను- ఎంతో
అపరాధు డనుచును- తప్పులెన్న నేల
కపటము సేయక- కృపజూడు వేగమె ॥నిన్నె॥

**8. ఆహిరి రాగము- రూపక తాళము**

పల్లవి

ఇంతా కోపమేమిరా- నీకు
హితవుగా బలుకరాదా

అనుపల్లవి

సంతతము నీవు నన్ను- అగస్త్యనాథా!
సంరక్షింపరాదా ॥ఇంత॥

చరణములు

తప్పక నిను నమ్మియుంటే- నన్ను
తప్పు లెన్నవచ్చునా
వప్పుగా కలలోవచ్చి- నీవు-
వాదులాడ నాయమా
మెప్పుతోడ నీపైప్రేమ-
మించియుంటే మోసము సేయ తగునా
నా పాలిదైవమని నమ్మియుంటే-
నన్నిట్లు చూడవేరా ॥ఇంత॥

లేనిపోని మాటలు కల్పించగా నీకు-
యే మగువ- చెప్పెరా
కానీ లేరా దాని బోధనలు నీవు
కామించి వింటివో

పూని నా మనవి చిత్తమునందు-
నెనరున నుంచవలెరా
మానినీమణిపై ప్రేమ మించియుంటే నిన్ను
మరలించినానా ॥ఇంత॥

కలకంఠితో నీవు కలసి యుంటివని
కసరి వద్దంటినా
చిలుకల కొలికికి నీ కెమ్మోవి యియ్య-
పలుకకుండినానా
అలివేణి కుచముల బట్టితి వని-
అలిగి యుండినానా
అలరువిలుతుకేళిలో కూడియుంటివని
అందుకు వగచినానా ॥ఇంత॥

**9. కేదారగౌళ రాగం**

**పల్లవి**

*** ఏమని పల్కుదు మా యింతి!**
**యిటు రానందుకా**

**అనుపల్లవి**

**భామరొ యని లేనిపోని**
**పలుకు పలికేటందుకా**

**చరణములు**

**ఆదికాలమునందు విష్ణుని- కల్లు దయ్యా నందుకా**
**మోదముతో దాని మోవి- ముద్దులాడినందుకా**
**సాదరముతో నాదు శిరమున- సతి నుంచినందుకా ॥ఏమని॥**

* గంగాదేవిని వలచి ప్రేమాతిశయమున ఆమెను తన శిరసుపైనే తాల్చి తన మొగము చూడకున్నాడని పరమేశ్వరుని పార్వతి ఉపాలంభించుట ఇందలి వస్తువు. ఇదియు కాళహస్తీశ్వరునిపైనే చెప్పినది కాబోలు! తద్స్ఫోరకమగు సంబుద్ధి ఏదియు ఇందు కానరాదు.



**అందముతో దాని వీడె- మందుకున్నందుకా**
**కందర్పుకేళికి నే- గదియ బిల్చినందుకా**
**మందయానరొ దానిపొందు- మరలించినందుకా ॥ఏమని॥**

**ఆముకొని నే వాని గుబ్బల- నదిమి గుమ్మిన యందుకా**
**కామించి యీలాగు- కలగన్నందుకా**
**కామాక్షి నాపైని- కల్పించినందుకా ॥ఏమని॥**

* * * * *

ఈ పదములయందు పేర్కొనబడిన దామెర కుమార వేంకటభూపాలుడును, దామెర కృష్ణభూపాలుడును ఎవరో, ఏ కాలమునకు చెందినవారో గురుతింపవలసి ఉన్నది. వారి కాలములో వెలసియుండిన వాడే అగుటచే ఈ పదముల రచయితయు ఆ కాలమునకు చెందినవాడగును.

ఇందు పేర్కొనబడిన దామెర కుమారవెంకటభూపాలుడు దామెర తిమ్మానాయని కుమారు డయినట్టు పైన ఉదాహరింపబడిన పదములలో మూడవది యగు **'మన్నె దొరవైతేనె'** అన్న పదములోని **'శ్రీ దామెర తిమ్మావని వరకుమార'** అను సంబోధనము వలన తెలియనగుచున్నది. ఇందు ప్రసక్తుడగు రెండవ యాతడు దామెర కృష్ణభూపాలుడు. ఇతడు పయి పేర్కొనబడిన దామెర వెంకటభూపాలుని కుమారుడయినట్టు పైనుదాహరింపబడిన పదములలో అయిదవది యగు 'చెలియ యీ విరహ మ- గ్గల మాయె' అన్న పదము తుది నున్న **'శ్రీ దామెర వెంకట ధరణి పాలుని తనయ! కృష్ణా! యని నన్ను గూడెను'** అను సంబుద్ధి వలన తెలియనగుచున్నది. కనుక ఇందు పేర్కొనబడిన దామెర కుమార వెంకటభూపాలుడు తిమ్మభూపాలుని కుమారుడనియు, దామెర కృష్ణభూపాలుడు దామెర వెంకటభూపాలుని కుమారుడని తేలినది.

ఇక వీరు ఏ కాలమునకు జెందినవారో పరిశీలింపవలసి ఉన్నది. దామెర వెంగళభూపాలుని బహులాశ్వచరిత్రమును, దామెర అంకభూపాలుని

ఉషాపరిణయమును పరిశీలింపగా అందలి వంశావతార వర్ణనములు తత్తద్రచయితల ప్రసక్తి వచ్చు వరకే రచింపబడినవి అగుటచేత అసంపూర్ణమయి ఉండి నిస్సందేహమయిన నిర్ణయమున కావశ్యమగు సాధనసంపత్తి నొసగుటలేదు.

బహులాశ్వచరిత్ర కర్తయగు దామెర వెంగళభూపాలుని తండ్రి వేంకటేంద్రునికి శేసమాంబిక యందు జన్మించినవాడు కృష్ణభూపాలు డొక్కడున్నాడు. అనగా ఆ కృష్ణభూపాలుడు బహులాశ్వచరిత్ర కర్తయగు వెంగళభూపాలునికి సవతి తమ్ముడగును. ఈ వెంగళభూపాలుని తాత మొదటి వెంగళభూపాలుడని అనుకొన్నచో కొంత చిక్కు తొలగును. ఇందు ప్రసక్తులగు కృష్ణభూపాలుడును, అతని తండ్రియగు (కుమార) వెంకటభూపాలుడును ఒక విధముగా నెరుక కందినట్లే అయినది. కాని ఇందు మరొక చిక్కేర్పడుచున్నది. కుమార వెంకటభూపాలుడు తిమ్మభూపతి కుమారుడని కదా ఇందున్నది. మన ఎరుకకు చిక్కిన ఈ (కుమార) వెంకటభూపాలుని తండ్రియు, కృష్ణభూపాలునికి తాతయు వెంగళభూపాలుడని ఈ వంశవృక్షములు తెలుపుచున్నవి. (కుమార) వెంకటభూపాలుని పినతండ్రి తిమ్మభూపాలుడని కలదు. కాని అట్టిచో ఈ (కుమార) వెంకటభూపాలుడు తన తండ్రి వెంకటభూపాలుడు ప్రసిద్ధుడై, పరిపాలకుడై యుండ 'తిమ్మావని వరకుమార' అని పిలువబడునా అను సందేహమున కెడము కలుగుచున్నది. ఈ పదములలో పేర్కొనబడినవారు వీరే యని నిర్ణయించుటలో రెండు కొరతలు కానవచ్చుచున్నవి. ఇందు పేర్కొనబడిన వెంకటభూపాలుడు తిమ్మభూపాలునికి కుమారుడు కాకపోవుట– ఈ వెంకటభూపాలుడైనను కుమార వెంకటభూపాలుడని ఆ వంశావతార వర్ణనములయందు పేర్కొనబడక పోవుట– అనునవి.



ఒకవేళ అట్లే నిర్ధరింప దలచినను ఈ పదముల రచనము తత్ప్రతిరోధముగా ఉండి తద్విరుద్ధముగా సాక్ష్యము పలుకుచున్నది. పై నిర్ణయమే కావించుచో ఈ పదముల రచన ఇంచుమించుగా బహులాశ్వచరిత్ర కర్తయగు వెంగళభూపాలుని కాలములో జరిగిన దనవలెను. వెంగళభూపాలుడు క్రీ.శ. 1550–1600 సంవత్సరముల నడిమి కాలమువాడని ఇంతకు మునుపు తెలుపబడినది. ఈ పదముల యందలి రచనము అంత పూర్వపు రచనముగా తోచుటలేదు. ఇంచుమించుగా ఆ కాలమువాడే కాదగు తాళ్లపాక పెదతిరుమలాచార్యుని పదముల రచనమునకు ఈ పదముల రచనమునకు భేదము మనకు విస్పష్టముగా గోచరించును. కావున ఎట్టును ఈ నిర్ణయము సవ్యమయినదిగా చూపట్టుట లేదు. కనుక మార్గాంతరము వెదకవలసి ఉన్నది.

'దామెరవారి వంశావళి' లో బహులాశ్వచరిత్ర కర్తయగు దామెర వెంగళభూపాలుని కిరువదియైదవ తరమువాడుగా తిమ్మభూపాలు డెరుకకు తగులుచున్నాడు. అతని కుమారుడు 'కుమార వెంకటప్పనాయడు. ఈ పదములలో పేర్కొనబడిన తిమ్మభూపతి కుమారుడు కుమార వెంకటభూపాలుడితడే! పదముల రచనమును ఇటీవలి కాలపు రచనముగా ఉండుట అందుల కుపబలముగా నున్నది కాని ఆ కుమార వెంకటప్పనాయుని కుమారుడు తిమ్మానాయుడని అందున్నది. కృష్ణ భూపాలుని ప్రస్తావమందు కానరాదు. కాని ఈ వంశావళిలో రాజ్యమునకు వచ్చినవారును, వారి పరాక్రమాదికములును మాత్రమే పేర్కొనబడియుండుటచే ఇందు పేర్కొనబడిన కృష్ణభూపాలుడు కుమార వెంకటప్పనాయునికి గలిగిన పుత్రులు తక్కినవారిలో ఒకండై యుండును. ఈ పదములయందు పేర్కొనబడిన తిమ్మప్రభువును అతని కుమారుడు కుమార వెంకటభూపాలుడును ఎరుక కందిరి. రచనమును తత్కాలముదిగ కనుపట్టుచున్నది. కనుక ఈ నిర్ణయమే సమంజసముగను, సరసముగను తోపకమానదు.

* 'దామెరవారి వంశావళి' లో ఇందు పేర్కొనబడిన కుమార వెంకటభూపాలుని ప్రశంస విశేషముగా కలదు. చూడుడు–

" వీరి తదనంతరం వీరి కుమారుడైన పెదవెంకటనాయనివారు, తిమ్మానాయనివారు వీరు యిద్దరు ప్రభుత్వం చేస్తూ వచ్చిరి. ఈ ప్రకారం ప్రభుత్వం చేస్తూ వున్నంతలో అసబ్జావారు దక్కను సుబాను విచారించగలందుక్కు ఆరికారి సుబాకు వచ్చిరి గనుక పెద వెంకటనాయనిం వారున్న, వారి (తమ్ముడు) తిమ్మానాయనింవారు వీరి కుమారుడైన కొమార వెంకటప్పనాయనిం వారున్ను, అసబ్జావారి తావుకుపోయి వారి భేటి అయి వారి యంతఃకరణ గలిగేటట్టుగా సకలవిధాలా కొలువుగొలిచి పూర్వోత్తరం సంగతి రాజ్యాలు జహరుల పయనం యావత్తూ మనవి చేస్కుని మా జాగీర్లు యథాప్రకారం మాకు దయచాయవలెనని మనవి చేసుకున్నందున వారు గోలుకొండకు తర్లిపోయేటప్పుడు యీ సుబాకు నియమించి వున్న అనవద్దిఖానుని వారిపేరిట వీరికి కొంత జహగీరులు యిప్పించమని ఫరమానా వ్రాయించి యిచ్చిరి. గన్కు వారిచేత బహుమానములు తీస్కుని అనవద్దిఖానునివారి తావుకు వచ్చి వారిభేటి యయి పరమానా చూపించి మనవి చేస్కున్నంతతో ఉత్తరాదిన పామూరు, సీతారాంపురం తాలూకు జహగీరు దయచేసిరి. గన్కు వారిచేత సెలవు తీస్కుని శ్రీకాళహస్తి చేరి పంజుమందిని గూర్చుకుని తాల్కుమీదికి పోయి ఆ తాల్కూలో నున్న వాడవారు బష్కి మొదలైన సరదార్ల బక్షిని మీద లడాయిచేసి వాండ్లను సంహరించి ఆ రాజ్యం కట్టుకుని కొన్ని దినంబులు ప్రభుత్వం చేసిరి. అప్పుడు లడాయి చేసినప్పుడు యీ యొక్క పద్యములు.

**" ధూర్త! నీ జయధాటివార్త విన్నంతనె**
**యూర్పులు నిగుడించె దూర్పుదిక్కు**

* దీనిని గూడ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారే కాళహస్తి సంస్థానమునుండి సంపాదించిరి. చారిత్రకముగా ఆమూల్యవిషయముల పెక్కింటిని ఇది తెలుపుచున్నది. చక్కని రచనము గలది.



**పెక్కు నీదు ధమామి పెట్టు విన్నంతనె**
**తల్లడం బందెను దక్షిణంబు**
**ఘనమైన నీ సైన్య కహకహ ధ్వనులచే**
**బటపట ధ్వని ప్రీలె పశ్చిమంబు**
**సొబగైన నీ డాలు చూచిన యంతనె**
**యుఝ్ఝూత లూగెను నుత్తరంబు**

**అహహా! మఝ్ఝారె! వీరసంహార శూర!**
**తార కర్పూర కీర్తి కాంతా విహార**
**విక్రమోదార అక్కభూవిభు కుమార!**
**విభవదేవేంద్ర దామెర వెంకటేంద్ర!**

**శ్రీ కరంబుగ భేరి జోకొట్టి నడిమి లా**
**ఖానుని వ్రేయవా మానువకడ**
**హత్తినిదుమికించి దుత్తలూరి బయళ్ల**
**మొత్తవా బష్కిని నెత్తివగుల**
**బెదబెదల్ గొనవచ్చు వడి ఫిరంగీగుండ్ల**
**కెదురుగా నడవవా కదనమునను**
**జడిసి పోయెడివాని బొడుచుట ధర్మంబు**
**గాదని నిలుపవా నీదు భటుల**
**నవుర నీకీర్తి విస్ఫూర్తి యజునకైన**
**వర్ణనలుసేయ శక్యమా వసుధలోన**
**దిమ్మ భూపాల సత్పుత్ర! ధీ విచిత్ర !**
**వీరబలసాంద్ర! దామెర వెంకటేంద్ర !**

పెద్ద వెంకటప్పనాయనివారు, తిమ్మనాయనివారు విశ్రమించిన వెన్క వారి తదనంతరం కొమార వెంకటప్పనాయనివారు ప్రభుత్వం చేస్తూ వుండిరి. గన్కు

బహుదినంబులు రాజ్యం చేసినారు. వారు నవాబు వాలాజాగారితో కూడా కష్టపడి దయ సంపాదించుకున్నది*. ముసేలాలి అనే పురిచేరి సరదారుడు చెన్నపట్టణం మీద వచ్చి కనిపించకున్నప్పుడు నవాబు వాలాజా గారు యింగిలీజు బహదరు వారి యనుమతిప్రకారం చన్నపట్నాన్కు యింగ్లీజు బహుదురు వారికి రసీదుపౌబాయిస్తు వచ్చినారు. మరికొన్ని దినములకు వాలాజాగారి తాలూకు మోదరుఖానుడు అనే సరదారుడున్ను పలనాడికి పోయినప్పుడు వీరున్ను కూడా పోయి రెండు సంవత్సరములు అక్కడ వుండి వారి యనుమతి చొప్పున పుల్లారెడ్డి గూడెం వగైరా కొట్టి ఠాణావేసి యుభయత్తర్ల ప్రీతి సంపాదించుకున్నారు. మరికొన్ని దినంబులకు వాలాజా వారున్ను, జండల్ యిసత్‌వారున్ను, కర్నల్ పూటువారున్ను, వెంకటప్పనాయనివారున్ను కూడా కోళాళస్వారి పోయినప్పుడు వారితో కూడా కడాకు వుండి మెహనతుచేసి జెడికోట మార్గాన పూటువారు యిసుమతు వారిలో కలియవస్తూండగా హయిజరువారి పంజు కర్నల్ పూటువారి మీద మొకాబిలా ఆయగన్కు పూటువారికి కుమ్మక్కు నిమిత్తం జంద్రల్ యిసుమత్తువారు పోతూ వెంకటనాయని వారిని పిలుచుకొని పోయినందున వారితో కూడా వుండి హైదరువారి పంజుమీద లడాయిచేసి నిండా మెహనతు చేసి కార్యం ఫత్తి చేసినారు. ఆ వేళ మా పంజులో శేనామందికి చావులు గాయాలు ఆయ గన్కు బారావారున్ను యిసుమతు వారున్ను కూడా సంతోషపడి బహదరు కితాపు బహుమానములు నిండా దయచేసినారు. అప్పుడు వారి యొక్క పద్యములు.

**కోళాల్ నెంత దురుష్కసైన్యములపై గోపంబు రెట్టించి శు**
**డాలంబన్ వెసనెక్కి హైదరు సుబాడా బాసయుం దెచ్చినన్**
**దాళంజాలక వెళ్లసాగిరట కాంతారప్రదేశంబులన్**
**చాలా శ్రీకర దామెరాన్వయ వతంసా! వెంకటాధీశ్వరా!**

* సంపాదించుకొన్నారు అని ఉంటే అర్థవంతం అవుతుంది.



**తొలి యిసుమంతలై గదియ దొడ్రిలవేయు ఫిరంగి పెట్లకుం**
**దొలగి కడాఖడిన్ బవుజుదీఱగ మీసము దీడి హత్తిపై**
**నిలిచి కరాసి దూసి పటు నిర్భరమైన తుపాకి గుండ్లకున్**
**నలగక కామనూరికడ హైదరు బాదురు మీద గప్పునన్॥**
**కలబడ నోర్చి మొత్తితివి గా మఱి దామర వెంకటాధిపా!**

**సంగరమందు నీ భటుల సాహసమద్దిర కామనూర నల్**
**క్రంగుల నొత్తి యీటెలను గత్తుల జూర్ల గటార్ల బాకులన్**
**కంగు ఖణింగు ఘల్లురన గుబ్బి గురాన బిరాన జోళ్లపై**
**జంగున జంగునన్ దుమికి జబ్బలు పిక్కలు డొక్కలక్కలన్**
**ముంగల బుఱ్ఱియన్ దొరుగ మొత్తిరి దామెర వెంకటాధిపా!**

తిరుపతి దగ్గర మమ్మత్కమాలును కొట్టినప్పుడు వీరి యొక్క ప్రతాపమైన పద్యము–

**మమ్మత్కమాలును మర్దించి నందుకు**
**బైదమౌ దొంగళ్ల బైలు సాక్షి**
**చుట్టు పాళేలన్ని చూఱగొన్నందుకు**
**గుఱియైన కందాటికొండ సాక్షి**
**హైదరు మిము జూచి మైదుచే గ్రమ్మిన**
**పోరి గెల్చుట కామనూరు సాక్షి**
**వడి ఫిరంగీ గుండ్లవయజేసి బఖ్కిని**
**గొట్టినందుకు దుత్తుకూరు సాక్షి**
**గాగ బలనాటిరాజుల గర్వమడచి**
**సేతుహిమగిరి మధ్య భూమీతలమున**

**శౌర్యకీర్తులు ప్రఖ్యాతి సలిపినట్టి**
**విజయుడవు నీవె దామెర వెంకటేంద్ర!**

**పటు శౌర్యోక్తి మమత్కమాలు దళముల్ పైవచ్చినం జూచి ప్ర**
**స్ఫుట దంతావళ వీరవిక్రమముచే బొంగళ్ల బైలన్ రట**
**త్పటహోద్యధ్వని వించి త్రుంచితివి నీ పట్టాసిచే శత్రురా**
**ట్పటలిన్ దామెర వెంకట ప్రభుమణీ! భాస్వత్ప్రతాపాగ్రణీ!**

అవల జంద్రల్ యిసుమతు వారున్ను, అర్మీలువుమావారున్ను, తంజావూరి మీదికి పోయినప్పుడు వీరున్ను కూడా పోయి వుండి నిండా మెహనతు చేసినారు. పులిచేరి యింగిలీజు బహదరు కట్టుకునేంద్కు జంద్రల్ మంద్రోలు వారిని అర్పిస్తూ వారితో కూడా మా పంజును అర్పించమనీ హుకుం అయినందున ఆ ప్రకారం అందించినంతల్లో మా సరదారుడు మంద్రోలు వారి యనుమతి చొప్పున మోర్జాలు వగైరా తావుల్లో నిండా మెహనతు చేసినారు. పులిచేరి కట్టుకుని తర్వాత మా సరదారుడ్కి బహుమానం యిప్పించి వెంకటప్పనాయనిం వార్కి యేనుగు గుఱ్ఱం కత్తి వీరకంకణం వగైరా బహుమానములు అర్పించినారు. ఆ పద్యము.

**"శూరుడటంచు మెచ్చి రణశూరుడు మేల్ మమదల్లి మీకు ని**
**ద్ధారుణి వీరంకకణము తాళి తురాయి జరాని సరాలు బల్**
**బారహ జాతి యేనుగును బాళిచి పంతులచేత బంపె నీ**
**పేరుగ నాల్గు దిక్కులకు బెట్టుగ దామెర వెంకటాధిపా!"**

అవతల మరికొన్ని దినములకు కొండపాళెంగారలు సరకాడు మీద తిరుగబడి పోళూరి కోటలో ఠానా ఉన్న ఆరికాటికోట కొత్తవాల్ అబ్బామహమ్మదును తలకాయ కోసుకుని పోయినంద్కు వాలాజు వారి యనుమతి మీద చంద్రల్‌వెల్లి వారితో కూడా వుండి పాళేల లడాయిలో నిండా



కష్టపడి ఫత్తిసేసినందున నవాబు వాలాజావారితో ఆ పాళేలు పూర్వం మాది అని మనవి చేస్కున్నందున వాలాజావారు నిండా బహుమానం దయచేసి ఆ పాళేలు మాకు కొన్ని జహగీరు యిచ్చినారు. ఆ లడాయి చేసినప్పుడు వీరి యొక్క పద్యములు–

**" నీ భేరి ధణా ధణా నినదంబు విన్నంత**
**వేలారి పాళెంబు గోలుపోయె**
**నీ భటావళి కిల్కిలార్భటుల్ విన్నంత**
**పురివీడి చాల్నీడు పరుగుచూపె**
**నీదు జెండా హౌయల్ నెఱి జూచినంతనే**
**వీర్ల కొండన కొండదార్లు సేరె**
**నీ ప్రతాపస్ఫూర్తి నిబిడమైనంతనే**
**మోదెప్పనాయని వాది యణగె**
**నాడె కదలెను సాయబు నాయ దహహ!**
**తత్తరించెను లొక చారితంబు చారి?**
**మనకు రణమేల యీగె రామన్న యనుచు**
**వెళ్ళి రౌరౌర! దామెర వేంకటేంద్ర!**

ఇటీవల హయదరు కలాపనలో హైదరువారి తాలూకు శామారాయుడు నాలుగువేల గుఱ్ఱంతో కూడా తిరుపతిలో వచ్చియుండగా పంజును అర్పించి ఠాణా లేవగొట్టించమని లాటు మకారటిన్ వారి సెలవు యిచ్చినందున ఆ ప్రకారం పంజును అర్పించి వారి దండుమీద రతారపడి లడాయీ చేసి వారి ఠాణా లేవగొట్టించి సరకారు ఠాణాకు అక్కడ వసూలు అయిన రూకలు సరకారుకు చేరేలాగ్ను చేయడమయినది. అప్పుడు లాటు మకారీటీను వారు వాలాజా వారున్ను సంతోషపడి ఉభయత్ర బహుమానములు అర్పించినారు. ఆ దినములలో వారియందు యింగ్లీజు బహదరు వారికి అభిమానం వున్నందున

నవాబు వాలాజావారి కొమారుడు అమీరుల్ వుమారావువారు వారియందు జందుచేసి దురాక్షేపణలు చేసి అవిహితములు నడిపించినందుక్కు యింగిలీజు బహదరువారు పూర్వోత్తరం అభిమానం తెలిసినవారు గన్కు మాయందు దయచేసి కుంభిణి తరపున మెస్తరు క్లోసువారిని వారి తావుకు అర్పించి విచారించి మహలు యావత్తు తృసముఖానకు వ్రాయించి పంపించినందున యీ సంగతి సీమకు వ్రాయించి పంపించి సీమలో తీరివచ్చిన ప్రకారం గౌనరు చార్లీసువోకిరీ బహదరువారి దినాలలో రాజమొహరుతో కూడా సదామదు యిచ్చి పేషకసు తీస్కునేటట్టున్ను ఆ ధనం అడగకుండా గవనరు చార్లివోకిలీ బహదరువారి జాబున్ను బహుమానములున్ను యిప్పించినారు. గన్కు యింగిలీజు బహదరువారి కోటి కల్పవృక్షం వంటిది అనిన్నీ చంద్రుడివలెనె చల్లదనం కలిగినటువంటి దిన్ని గన్కు లాటి కారణవాలీసు వారితో మనవి చేస్కుని నవాబువారి తావున యిలాకా లేకుండా చేస్కుని కుంభిణీ వారి యిలాకాలో చేరినాము. మమ్మును చూచి చుట్టుపట్టు వారున్ను తమ యిలాకాలో ప్రవేసించినారు. యీ ప్రకారం బహుదినములు రాజ్యంచేసి వారు శ్రమించిరి".

* * * * * *

పై ఉద్ధరణమును బట్టి కాళహస్తి సంస్థాన మీ కుమార వెంకటప్పనాయుని కాలములోనే కుంపిణీ వారి కణకువ అయినట్లు తెలియవచ్చుచున్నది. దామెర కుమార వెంకటప్ప నాయుడు హైదరునకు సమకాలికు డయినట్లు పైన పేర్కొనబడినది. హైదరు క్రీ.శ. 1780 ప్రాంతములవాడు అగుటచే కుమారవెంకటప్ప నాయుడును ఆ కాలమువాడే అగుచున్నాడు. అతని మీద రచింపబడిన ఈ పదములును క్రీ.శ.1780 ప్రాంతముల నాటి వనుట దీనిబట్టి నిరూపిత మగుచున్నది.

# 14. సారంగపాణి పదములు

సాహితీ సమరాంగణ సార్వభౌము లయిన శ్రీకృష్ణదేవరాయలవారు విద్యానగరమున ఉండి పెద్దనాది కవిదిగ్గజములకు ప్రాపును, ప్రోపునునై పెద్దయెత్తున సాహితీసమారాధనము చేయుచుండగా దేశములోని చిల్లరరాజులు, జమీందారులు సంస్థానాధీశ్వరులు చేతులు ముడుచుకొని ఊరక కూర్చుండలేదు. తెలుగునాట నాడు వెలయుచుండిన నూజివీడు, చల్లపల్లి, ముక్త్యాల, పిఠాపురము, పెద్దాపురము, గద్వాల, వనపర్తి, వెంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరము మొదలగు రాజాస్థానములు సంగీత సాహిత్యవిద్యా వినోదములు లేనివి కావు. సాహిత్య చరిత్రములో అదియొక సువర్ణఘట్టము! సాహిత్యపోషణ మా నాటి సంస్థానాధీశ్వరుల కొక మధురక్రీడ–పేరు పెంపులు లేని పిల్లజమీందారుడయినను పేరున కేని తన ఆస్థానములో ఒక కవీశ్వరు నుంచికొనును. అతనిచే కావ్యములు రచింపించుకొని ఆనందించును. అది అతనికి ముచ్చట! అందతని కానందము!

కార్వేటినగర సంస్థానము సుమారు రెండు శతాబ్దముల కాలము కవితకు కళలకు పట్టుకొమ్మయై నిలిచినది. కార్వేటినగరప్రభువులు కవితాపట్టభద్రులు, పండితులు, సరసులును. వారి సరస మధుర కర సంస్పర్శమున తెలుగు సాహితీకన్య ఒక క్రొత్త చెలువు నొలసి పులకరించినది. వారి పోషణమున కవీశ్వరులు సుఖజీవనులై కావ్యరచనానందము సాగించుకొనినారు. వారొసగు చుండిన కవిమేరలు వంశపారంపర్యముగా నేటికిని కొనసాగుచున్నవి. సాహిత్యసమ్రాట్టులు, సంగీత సరస్వతులు అయిన వారి సంస్థానములో సంగీతసాహిత్యములు రెండును సమానగౌరవముతో అసమానముగా వెలుగొందినవి. సారంగపాణి అను కవీశ్వరుడు కార్వేటినగరమున వెలసిన శ్రీ వేణుగోపాలస్వామి పేర తదంకితములుగా శృంగార వేదాంత పదములు రచించి విఖ్యాతుడయినాడు. ఇతని పదములు సారంగపాణిపదములని, వేణుగోపాలపదములని ప్రఖ్యాతి పడసినవి. ఈ పదములు చిత్తూరు, నెల్లూరు

జిల్లాలలో నేటికిని బహుళ ప్రచారము పొందియున్నవి. తిరుత్తని, వెంకటగిరి మొదలగుచోట్ల దేవోత్సవాది విశేష సమయముల యందు ఈ పదములు నాట్యాభినయముతో దేవవేశ్యలచే పాడబడుచున్నవి.

**మోహన రాగము- చాపుతాళము**

**పల్లవి**

**" నీవే నా శాస్త్రము- నా చేత కాసుంటె**
**నీ యక్క యింకొక్కతె**

**అనుపల్లవి**

**అదిగాకుంటె- దానక్క మతి యెక్కతె**
**పోవె పో యెవతైన పుణ్యానికి రాదు**
**దేవరంభ యైన తే తెమ్మనక పోదు**
**అతి మోహమున వచ్చి యడుగులపై వ్రాలి**
**బతిమాలినప్పుడే బాళి యెక్కడ బోయె**
**పతక మిచ్చితెగాని పలుక నంటివొ లేదొ**
**మెతుకులు జల్లితె క్షితిలో కాకులు బాతె" 1**
**"ఆ నాడు నగరిది అరవైరూపాయాల**
**తాను పెట్టెలో వుంచి నేనట్టె రానని**
**తాను పావడగూర్చి ధరియించుకోవటె**
**వానలు గురిసితె వాతలు మానున" 2**
**" పాతర లాడుచు రాతిరి వేణుగోపాలా**
**యనుచు నన్నుపరతి గూడిన దెల్ల**
**యీాతగింజ కథ తాతై యున్నది గదే**
**యేతము వంగేది లోతు నీళ్లకె గాదా 3**



ఈ పదము, ఇట్టివి మరికొన్ని పదములలోని తునుకలు వెంకటగిరి మొదలగు చోటుల ప్రజాసామాన్యము పలుకుబడులకు కూడా ఎక్కినవి.

ప్రఖ్యాత సంకీర్తన కవులు తాళ్లపాక అన్నమయ్య, పెదతిరుమలాచార్యుల శృంగారసంకీర్తనములు సవరని భాషతో సాహిత్యపు బలుపుతో ఉండి పండితమాత్రైక వేద్యమై లోకము వెలుగు చూడజాలక పోయినవి*. క్షేత్రయ్య పదములు ప్రజాభాషలో ప్రజలకు సన్నిహితములై శృంగారరసమయములయి, అభినయోచితములగుటచే రసగుళికలవలె ఆస్వాద్యములయి సులభముగా ప్రజాహృదయముల చూరగొన జాలినవి. మువ్వగోపాల పదములను కళావంతులు పాడి అభినయింపగా ఆంధ్రప్రజ రసతన్మయమయినది. క్షేత్రయ్య పదములకు తరువాత ప్రజాహృదయముల చూరగొనజాలిన రచనావైశారద్యముతో బహుళ ప్రచారముతో ప్రఖ్యాతి పడసినవి సారంగపాణి పదములు.

కార్వేటినగరమున తత్పరిపాలకు లొసగిన కవిమేరల ననుభవించుచున్న కవివంశ్యులు కవి శ్రీ చెరుకూరు కృష్ణయ్యగారు ఇట్లు వ్రాయుచున్నారు-

శ్రీసారంగపాణి యను పదరచయిత ఈ గ్రామవాస్తవ్యుడై శ్రీ వేణుగోపాలస్వామి భక్తుడై యుండెను. ఆ పదములను పాడగా నేను కొన్నిటిని విన్నాను గాని నాకు పాఠము లేదు.

ఈ పదములకు 'వేణుగోపాలపదము' లను పేర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో రెండు వ్రాతప్రతులు కలవు. ఈ పదములు తొలుత 1872 వ సం॥న మదరాసులో ముద్రించబడినవి (చూడుడు-భారతి-విరోధి జ్యేష్ఠము) ఈ పదములు మరల 1899 వ సం॥న మదరాసులో ముద్రింపబడినవి. అందు ముఖపత్రములో నిట్లున్నది:-

* ఇప్పటివరకు దొరికిన తాళ్లపాక కవుల సంకీర్తనలన్నీ పూర్తిగా ముద్రింపబడినాయి. (సంపాదకుడు)

"శ్రీ కార్వేటినగరమందు నెలకొనియున్న శ్రీమద్వేణుగోపాల నామాంకితంబుగా సంగీత సాహిత్య దేశీయ కవిత్వ రచనా చమత్కారియగు సారంగపాణి యను మహాకవిచే రచియింపబడిన సారంగపాణి పదములు. ఇవి ఉప్పల రామానుజాచార్యుల వారిచే పరిష్కరింపబడి యద్దనపూడి సంజీవయ్యగారిచే చెన్నపట్టణం పాత చాకలివేటలో నుండు పమ్మి త్యాగరాయ శెట్టిగారి శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపబడియె. 1899 వ సంవత్సరము".

క్షేత్రయ్య మనోహరముగా,శృంగారసమయముగా పదములను రచియింపగా ఇతడు తన కత్తికి రెండువైపులను పదును కలదని తెలుపుటకు కాబోలు శృంగారపదములను, వేదాంతపదములను విరచించినాడు. అన్నమయ్యకువలె ఇతడును శృంగారపదముల కున్నంత జిగిబిగులతో, చిన్నెలు వన్నెలతో వేదాంతపదముల విరచింపగలడు. తన వేదాంతపదములు ప్రధానముగా నాలుగు విభాగములుగా విభాగింపబడినవి. ఆ విభాగములు: శృంగారము, దేశీయము, జాతీయము, కీర్తనలు అనునవి. ఇందలి తొలి రెండు విభాగములలోని పదములు గూడ పురుషవాక్యము, స్త్రీ వాక్యము, సఖీ వాక్యము అను క్రమముతో రచింపబడినట్టున్నవి.

సారంగపాణి వైష్ణవుడు. కార్వేటినగర వాస్తవ్యుడు. కార్వేటినగరమున వెలసిన శ్రీ వేణుగోపాలస్వామి భక్తుడు. కార్వేటినగర సంస్థానాస్థాన కవీశ్వరుడు. సంగీత సాహిత్య దేశీయ కవిత్వ రచనా చమత్కారి.

ఇంతకుమించి ఈ కవీశ్వరుని గూర్చి విశేషము లేమియు తెలియుట లేదు. ఇతని శృంగారపదములలో కార్వేటినగర సంస్థానాధీశ్వరుడగు మాకరాజు ప్రస్తావమున్నది. అతని పేర మూడు శృంగారపదములు కలవు. చూడుడు-

**శంకరాభరణము- ఆదితాళము**

**పల్లవి**

**తేనెలూర మాట లాడకు**
**తెలిసె నీ నెనరు**



**అనుపల్లవి**

**మానినీమనోహర శ్రీసాళువ-**
**మాకరాజ కార్వేటి రాజేంద్రా...**

**పండు గనుచు వెచ్చాని కడిగితె-**
**పల్లిపట్టు రెండా- నాపై**
**కొండెకారి మెదకు మంచి బంగరు-**
**గొప్పగుండ్ల దండా**
**నిండుకొలువులో విరులుంచితివా-**
**నెలత కొప్పునిండా- యిక**
**వుండవలద యిటువంటి నేస్త-**
**మువిద నెనయుచుండ వదలకుండ... ॥తేనలూర॥**

**ఎక్కువైన ముత్యాల పాపట-**
**యింతి కియ్యలేదా యెన్నో**
**లెక్కలాడి నా చేతి కిచ్చినది-**
**యొక్కచీర గాదా**
**నక్కవినయములు చేసేవారికి-**
**చక్కని మరియాద- నే**
**నిక్కమే మంచి నోము నోచితే-**
**నీకే దయరాదా- యికమీద... ॥తేనలూర॥**

**మరునికేళి మెప్పించినందుకు-**
**మగువ కింత ధనమా- నా**
**సరస జేరి యేలుకొమ్మంటే-**
**సామీ దంధనమా**
**అరుదు చేసి యా చెవినే పొగడే-**
**వౌరా నెరతనమా తన**

పెరటిచెట్టు మందుకు గైకోరని-
పెద్దలనగ వినమా- యిది ఘనమా... ॥తేనలూర॥

**ఆనంద భైరవి- ఆదితాళము**

పల్లవి

దాని కెవ్వరు సాటీ- ఆ వెలది నీకే
తగురా రాజకిరీటీ

అనుపల్లవి

మానితవరగుణ పేటీ నీపై-
మరులు కొన్నదిరా మా బోటీ- యిక నిను
మానదురర భాను సమతేజ-
మాకరాట్కార్వేటి రాజా ॥దాని॥

మగువను సభల నెన్నుదురు-
మామ నదలించు నెన్నుదురు ఆ
వగలాడి పల్వరుస కుదురు
వజ్రమణు లనుచు పల్కుదురు- యీ
జగతి దాని కెవ్వరు నదురు- విరి-
జాజులంపె నీకు నదురు- మంచి
నిగనిగలు గల మొగుడుతమ్ముల-
దెగడు చనుగవ బొగడ తగు నిక.... ॥దాని॥

వనజగంధి కనులతీరు- చూడ-
వలరాజు చేతికిలితీరు- ఆ



ఘనవేణి మెరుగు నూగారు సౌరు-
గణుతింప ఫణు లీడుగారు
నిను రమ్మనె పలుమారు- తూపు-
మొనల కోర్వదు పలుమారు అను-
దినమునను చెలిమనము ననుపెన-
గొనితమి యింతనగ వశమా... ॥దాని॥

సుదతి నెన్నగ శ్రీలమిన్నా- దానిశ్రుతు
ల వైకరి శ్రీలమిన్నా- ఆ
మదవతి లేగౌను సున్నా- నాదు మనవి
వినవా మన సున్నా
బెదరించు కురు లళులకన్నా- గొప్ప
పిరుదులు చక్రముల కన్నా- సామి
అదనిదని మరుకదనమున సతి-
నెదను తమివదలకను గదియర... ॥దాని॥

**శంకరాభరణము- త్రిపుటతాళము**

పల్లవి

వలదు యీ మాట రేలరా- మది హితవైన-
వనిత యిల్లిది గాదురా

అనుపల్లవి

వెలయు శ్రీమాకరాజ వీరకార్వేట్రాజేంద్ర
చెలులు దెలుపగ దెలిసె నీ
వగలు చాలు పదివేలు...

కరుణచేతను కోరి- మోహించి యా-
కనకాంగి నిను జేరీ

మఱి మఱి తమి మీఱి- విరహాభరముచే-
తరము గాక తారీ మరు బారీ
తరుణి గురుకుచగిరుల నురమున-
నొరసి మురిసిన సరసమెల్లను
మరచివత్తురె యేర యీ దారి
ఓరోరి... ॥వలదు॥

సగము రే వేళాయెరే- నీ రాకకై
సఖియ యెదురుజూచురా
తగని ముచ్చట లేలరా- నే నొక టంటె-
వెగటు దోచదటరా- బాగేనటరా-
మగువ లెల్లను నగగ నీ విటు
అగడు సేయగ నగున జిగిబిగి
సొగసు మిగులగ పెనగ గలనటరా-
నన్నంటకురా... ॥వలదు॥

సతతమునను చాల- మెచ్చియుండిన
జాణతనము లేల
బతిమాలుకొనే దేలా- వినయములకు నే
నతిబేలనా యిట్లేల- చతురోక్తులేల
తతిని దెలుసుక అతివ వలె బహు-గతుల
నిన్ను పరతుల- నెనయుచు
సతులమేలన ఘనుడ నే జాల- నీ చర్యలేల.... ॥వలదు॥

వనజాక్షి బోటు లెవరైనా- యిచ్చుట యున్నా
పని దాని సముఖానా
మనవి జేసిరైన నెరనమ్మిన
చనవరి సుంతైనా



కొనియాడునా అనువుగ ననుదినము యా
జవ్వనిని గలసిన పనులు హొయలుగ
తనిసియున్నది నీకు మనమునా... ॥వలదు॥

పలుమారు యెంత కొసరిన- మునుపటివలెనే
బాళితో మన సిచ్చేనా
చెలువు దనుచు జూచేనా యిక మీద నా-
యిలుజేర రానిచ్చేనా చను విచ్చేనా
తొలుత చెలిమిని కళలు గులుకగ కలసి
మెలసిన సెలవు దలతున
తలపు తెలియని వలపు తగవేనా యేమైనా.... ॥వలదు॥

ఈ పదముల యందు పేర్కొనబడిన మాకరాజునకు ఇతడు సమకాలికుడు. మాకరాజు నేటి కార్వేటినగరప్రభువునకు నాలుగవతరమువాడట! అగుచో ఈ కవీశ్వరుడు సుమారు నూటయేబది యేండ్ల కింకను మునుపటివాడగును. *ఇట్లు సారంగపాణి కాలము గుర్తింపనగుచున్నది.

మాకరాజు ఆస్థానిలో కవీశ్వరుడుగా రాజసన్మానము లందుచుండిన ఈతడేమి కారణముననో రాజానుగ్రహము కోలుపోయినాడు. రాజాగ్రహమునకు పాలుపడి అనేక కష్టములనుభవించి యుండ బోలును! శృంగారపదముల విరచించుచు అంతదనుక రాజానుగ్రహముతో పైలాపచ్చీసుగా తిరుగుచుండిన ఈతడు ఐహిక విముఖుడై శృంగారపదరచనము మాని భక్తిమయుడై కీర్తనముల రచింపదొడగినాడు. ఆ కీర్తనములలో తన పూర్వజీవితమును పేర్కొనుచు అపుడు తాను తెలియక చేసిన పాపములకై విలపించినాడు. చూడుడు.

* మాకరాజు నేటి కార్వేటినగర ప్రభువునకు నాలుగవతరము వాడని వినికినిబట్టి వ్రాయబడినది. మాకరాజు కాలమును గూర్చి నిశ్చయ పరిజ్ఞానము కలవారు తెలుపుదురు గాక!

**అసావేరి- త్రిపుటతాళము**

పల్లవి

నీ దివ్యమంగళమూర్తి ధ్యానము భక్తి
నిత్యము కృప సేయవే

అనుపల్లవి

వేదోద్ధారకుడైన వేణుగోపాల నీ
పాదద్వంద్వము నాహృత్పద్మమందున జేర్చి

పుట్టింది మొదలుగ భూపాలకుల గొలిచి
పట్టె డన్నానికై పరుగు లెత్తి
పొట్టనించుక మతిలో పొంగుచుంటిని గానీ
పట్టుగ నొకనాడు ప్రద్యుమ్న యననైతి ॥నీ దివ్య॥

నరకహేతువులైన దురితకృత్యములకు
మరగి కండ్ల కావరమున
పరకాంతల మోము లరసి భ్రమసితి గానీ
పురుషోత్తమ నీపై బుద్ధి నిలుప నైతి ॥నీ దివ్య॥

పరమభాగవతుల ప్రల్లదముల పల్కి
గురువుల నిందించి కుటిలుడనై
అరయక తలిదండ్రు లాజ్ఞ మీరితిగాని
స్థిర చిత్తమున హరిని స్మరణసేయ నైతి ॥నీ దివ్య॥

అపకారములకు నే నగ్రగణ్యుడనై
యుపకృతి మాటంటె నుగ్రుడగుచు
అపకీర్తులకు నేనర్హుడైతి గానీ
కపట వామన నీదు కథ చెవుల విననైతి. ॥నీ దివ్య॥



యతుల దూషణ చేసి యెదటి మేలోర్వక
కృతులు మానవుల కర్పితము జేసి
గతవాసరము లీగతి దాటించితి గానీ
పతితపావన సద్గతి జూపుమననైతి ॥నీ దివ్య॥

రాజానుగ్రహము తప్పినది. దారిద్ర్యము చుట్టుకొనినది. బంధువులకు పలుకే బంగార మయినది. గడనుడుగు మగని జూచి కులసతి కోపము వహించినది. కుమారులు చేరదీసి యాదరింపలేదు. మిత్రులు బుద్ధులు చెరుప జూచుచుండిరి. ఇట్టి దీనావస్థలో కవీశ్వరుడు పాడిన కీర్తన మిది అప్పటి అతని అవస్థను కన్నులకు గట్టుచున్నది*.

**ధన్యాసి- చాపుతాళము**

పల్లవి

నిన్ను నే విడువాను నీ పేరు మరువను
నీ బంటు బంటైనానూ

అనుపల్లవి

అన్న యెన్నటికి బ్రసన్నుడ వౌదువో
వెన్న ముచ్చిలి దిన్న వేణుగోపాలా

నలుగురు బంధువులు దలచకయున్నను
నరనాథు డలగినాను
కులసతి మెండొడ్డుకొని పలుకకున్నను
చెలికాండ్రు బుద్ధులు చెరుపవచ్చినాను...

---

* పై పదాన్ని, మరికొన్ని ఇలాంటి పదాలను ఆధారం చేసుకొని సారంగపాణికి అలాంటి అవస్థ కలిగిందని అనుకోవడం తప్ప, దానికి మరొక ఆధారం లేదు. (సంపాదకుడు)

**పాపాత్ము డనుచు కృపారహితు డైనాను**
**భాషించకుండిననూ**
**కోపగించి లక్షకొదవ లెంచినాను**
**మాపు రేపనుచు యేమరి యూరకున్నాను**
**కామక్రోధాదు లెక్కడ వదలకున్నాను**
**స్వాములు దూరినను**
**లేమి వచ్చి యొకరు లెక్కసేయకున్నాను**
**ప్రేమ మరచి సుతులు**
**యేమరి యున్నాను....**

మరియొక్క పదములో గూడ భూపతుల పొగడినందులకై విలపించు చున్నాడు.

**కల్యాణి- ఆదితాళము**

**పల్లవి**

**నిన్ను గొలిచి యొరుల వేడబోయితే**
**నీ కపకీర్తి గాదా**

**అనుపల్లవి**

**పన్నగవైరివాహ వేణుగో**
**పాలరాయ యాపన్నసహాయ....**
**చేరితీ శుభము లిమ్మనుచు చల**
**పోరితీ భూపతుల బొగడి గో**
**జారితీ అజ్ఞానుడనై బహు**
**దూరితీ వేసారితీ**



**కోరితీ హరికథ వీనుల విన**
**మీరితీ దుష్టనరుల సంగతి**
**దారితీ మాయ దెలియుటకు మిము**
**జేరితీ భారతీశ నుతపద...**

మరొక్క చోట **'కోపము జేసే నరనాథు కొలువు గొలిచే దొకరోత'** అని పేర్కొనినాడు.

పోతన, అన్నమయ్య, త్యాగరాజు మొదలగు మహాభక్తుల చరిత్రము లన్నిట ఇట్లే విషాదమేఘము లావరించుట మన మిచట గుర్తింపవలసి యున్నది.

ఇతడు ఉంఛవృత్తితో జీవించుచుండినటులు తెలియుచున్నది. భిక్షాటన మునకు పోయినపుడు తనకు గలిగిన అనుభవముల ఏకరువు పెట్టుచున్నాడు. చూడుడు.

**సౌరాష్ట్రరాగము-చాపుతాళము**

**పల్లవి**

**అక్షయపాత్రకు పోతే కలదని వొక**
**భిక్షము వేయరయ్యా- మూల**

**అనుపల్లవి**

**నిక్షేపము త్రవ్వి నెత్తిన బెట్టేరా**
**కుక్షింభరులు వేణుగోపాల నా స్వామి**
**తెచ్చుకోవలె నని కొందరు రాలే**
**తేబోయి నారంట కొందఱు- ఒట్టి**
**గచ్చులకైనాను కడకు బోయినానని**
**ముచ్చువలెనే తలుపుమూలకు ఒరిగేరు...**

లేవ పాలుమాలి కొందఱు- లోన
దేవర వుందని కొందరు- నడవ
దోవ కడ్డమై యెట్టి దోశిలి ముడుచుక
నీ వొల్లోని గింజలేవి సూపమనేరు....

ఈ ప్రొద్దు పొమ్మని కొందఱు- కాని
యింగో నాడైనాని కొందఱు- యిట్టి
పాపాత్ముల యముడు పట్టి కట్టకమునుపే
కాపాడే దేలా గోపాల నా స్వామి....

ఉంఛవృత్తితో బ్రతుకు వా రిట్టు లిట్టులుండ వలెను

తరువాతి తరముల వారి కొక పథకము తయారుచేసి ఒసగినాడు. ఈ పదము చూడుడు:

**శంకరాభరణము- ఆదితాళము**

పల్లవి

ఉంఛవృత్తితో బ్రతికే వారికి
వుగ్రము కారాదు.

అనుపల్లవి

పంచసాయకు గన్న వేణుగో
పాల దేవ యెందున వగలేక...

అమ్మా, అక్కా, అయ్యా యనవలె
పొమ్మంటె తలవంచుక పోవలె
రొమ్మున తంబుర మీటుచు బాడుచు
రోసపడక యిల్లిల్లు తిరుగవలె...



ప్రొద్దెక్కక మునుపే రారాదు
పొంచులు విని బైట చెప్పరాదు
హద్దు మీఱి లోనికి పోరాదు
ఆడంగుల జూచి నవ్వరాదు

వెంట నొకనిని బిలుచుక రారాదు
వేయకుంటె హఠము సేయరాదు
కొంటెలతో వాదుకు పోరాదు
కోరని కోరికలు కోరరాదు

కొంచె మనుచు గోజాడగరాదు
కొట్లాడేచోట నిలువరాదు
సంచి జూచుకొన యెదబడరాదు
చాల దనుచు తిరుగ రారాదు....

చెయ్యి దుడుకు సాహసము కారాదు
చేత తలుపు తట్టి పిలువరాదు
బియ్య మమ్మేది తెలియరాదు
ఛీఛీకరించుక పోరాదు....

ఇచ్చి పెట్టినది దొరికిం దనవలె
యిప్పటి కిది పదిలక్ష లనవలె
తెచ్చి నందులో ముష్టి వేయవలె
దేవుడే రక్షకు డనుకోవలె....

కార్వేటినగరమునకు సుమారు ఎనిమిదిమైళ్ల దూరమున పల్లిపట్టు అను గ్రామము కలదు. ఆ గ్రామమునందు వరదరాజస్వామి దేవాలయము కలదు.

వరదరాజస్వామి నామాంకితములుగా ఇతడు మూడు శృంగారపదములు విరచించినాడు. మచ్చున కొక్కటి-

**ముఖారి- ఆదితాళము**

**పల్లవి**

**చాలు చాలు వాని నేస్తము యిక**
**నేలనె మనకూ- ఓ**

**అనుపల్లవి**

**బాలరో! వరదనారాయణు**
**డాలతాంగి గూడి మెలగియుండుటె....**

**ఆసజెప్పి గుడిముందర యిచ్చిన**
**బాస మఱచె కొమ్మా యీ**
**దోసకారి యెందరినో యీవగ**
**మోసబుచ్చె నమ్మా**
**నా సరైన చెలులు విన్న వికవిక**
**నవ్వరేమమ్మ- విన**
**దోసమో కలిగిన మా టంటె**
**రోస మెందు కమ్మ- పోవమ్మ** **॥చాలుచాలు॥**

**తనువు తనది జేసియున్న నావం**
**తైన దలచదమ్మా- యేదొక**
**మనవి దాని కెరిగింపక వినడట**
**మంచిపనే నమ్మా**



**నెనరు వాని జాడ లాడకాడకు**
**నేడు గంటి కొమ్మా- అతి**
**వినయ మెల్ల ధూర్తలక్షణ మనే**
**విధమాయ గదమ్మా- లేవమ్మా...** **॥చాలుచాలు॥**

**వరదనారాయణ సామెంత**
**వంచనవా దమ్మ- నా**
**సరస జేరి నను గూడి లేదనుచు**
**సాధించె గదమ్మ**
**యిరవు పల్లిపట్టితేనే తన**
**యెక్కు వెవరి కమ్మా- యే**
**మెరుగ నట్టివాని వలెనె యుండి**
**యెంత జేసె నమ్మా- వలదమ్మా...** **॥చాలుచాలు॥**

అనృణసరోవర తీరమున వెలసిన ప్రసన్నవేంకటేశ్వరస్వామి మీదను, నారాయణవనమున వెలసిన కల్యాణవేంకటేశ్వరస్వామిమీదను, తిరుత్తని సుబ్రహ్మణ్యస్వామిమీదను కూడ ఇతడు పదముల విరచించినాడు. తిరుత్తని చెంగల్వరాయనిపై పాడిన పదమిది చూడుడు.

**ఆనందభైరవి - ఆదితాళము**

**పల్లవి**

**నీ యింటికి నీవు వచ్చేటందుకు**
**నెలత నంపవలెనా**

**అనుపల్లవి**

**రాయబారమా చిఱుతని చెంగల్వ**
**రాయా యిది మాబాగాయె...**

ఎపుడు వత్తువని యెదురే జూచుచు
యెవరు వచ్చిన శకునము లడుగుచు
కపటదైవాల కెల్ల మ్రొక్కుచు
కఱగుచున్నను చే బిలుచుచు ॥నీ యింటికి॥

ఒకటి రెండనుచు దినములు యెంచి
వద్ద దిరుగు చిలుకల నదలించి
సుకము లేక పైపై తమి మించి
సొలయుచున్నను పొందదలంచి ॥నీ యింటికి॥

చెలుల కందరికి లంచము గట్టి
శయ్యమీద చెక్కిట చెయిబెట్టి
వలరాయని రోయబార దిట్టి
వగచుచున్న నాపై దయ బుట్టి ॥నీ యింటికి॥

తిరుత్తనిలో జరుగు దేవోత్సవములను, కార్వేటినగరము వేణుగోపాలస్వామి తెప్ప తిరునాళ్లను, నారాయణవనమున సంతలను, పుత్తూరులో నేటికిని జరుగు అగ్గి తిరునాళ్లను, ధర్మరాజు తిరునాళ్లను వర్ణించుచు ఇతడు పదముల విరచించినాడు. తిరునాళ్లను వర్ణించు పదముల నితడు ప్రజాభాషలో ప్రజాభిరుచులకు ప్రతిబింబములుగా ప్రజల పలుకుబడులతో విరచించుట గమనార్హమై ఉన్నది. అగ్గి తిరునాళ్లను వర్ణించుపదమును అదే పలుకుబడితో అభినయించి చూపినపుడది హృదయంగమముగా ఉండుననుట సందేహము లేదు. *అగ్గి తిరునాళ్ల పదమిది చూడుడు.

* ఈ అగ్గితిరునాళ్లు పుత్తూరులో నేటికిని గొప్ప వైభవముతో జరుగుచుండును. ప్రతి సంవత్సరముననుచిత్రమాసములో ఈ తిరునాళ్లు జరుగునట! దీనినే ధర్మరాజు తిరునాళ్లని కూడ చెప్పుదురు. అగ్గితిరునాళ్ల సందర్భమున ద్రౌపది ఒడిలో నిప్పుగుడ్డ కట్టుదురు.మరియు అగ్గిగుండములో దుముకుటకు ముందు అందు నిమ్మపండును, పుష్పములను పడవైచెదరు. ద్రౌపది ఒడిగా గట్టిన వస్త్రమును కాలక ఉండుటయును, నిమ్మపండును, పుష్పములను వాడక ఉండుటయును అగ్గిలో దుముకువారికి నిదర్శనములు. ఈ అగ్గి తిరునాళ్ల సందర్భమున ధర్మరాజుదేవాలయములో మహాభారతశ్రవణము నియతముగా జరుగును. పాండవ నాటకములను ప్రదర్శింతురు. ఆ ముచ్చటలనే ఈ పదము పేర్కొనుచున్నది.



**ఆరభి- చాపుతాళము**

పల్లవి

అగ్గి తిరుణాలంట- అర్జుని కతలంట
అవురా యెంతరు సొద్దేమే- భారత కత
ఔరా యెన్నె న్నింతలే!

అనుపల్లవి

సుగ్గీజయము దీని సుట్టు బలాదూరు
అగ్గురోరపు అయ్యో ర్నడిగే నీ సాచ్చిగ ॥అగ్గి॥

యిగనేసు పయి నెక్కి యీబీసనూ డొచ్చి
బగు పెగ్గె లెన్నెన్నో బలికీ దుశ్శాసుని
మొగము చూడగానె మొర్చ నాయాలట్టె
గుగురుమిగురనకుండ గుడ్డెల్ల గుక్కెనె ॥అగ్గి॥

అనుమంతెనకటోడు- అబిమన్ను డంటనె
సనియు నోలె బట్టి సాముసేయుచు అట్టె
యినయె యీరబద్రు నిసనకాయలు దొక్కి
కనురెప్పేశేతల్కి కర్ణుని శించనె ॥అగ్గి॥

యిరన్నేచ్చు చడ్డకు డింద్రజిత్తొక రెయ్యి
దురివోదనుని శెయిలోదూరి ముక్కున నెల్లి
అరశి పిపాశోలె అశ్శద్దామను మింగి
సురివోదమాయనే- సూడయేడిగున్నె ॥అగ్గి॥

జేరి బూరుగ లింట గారదేవలమొద్ద
యీరపతిమెకు మొక్కి యిటు తలెత్తే తల్కి
మారుబాసోడొకడు మొలతిత్తొదిలించుకొని
శారెదై దీశెడిదొ జనుల కిచ్చెనే నిపుడు ॥అగ్గి॥

తేనీగగుములోలె– తెండెతెండెగ పంజ
కోన చముద్రం గుంట– కొనను నిల్బడి సూడె
నానాదించంగల్లె– నానారం చంతోలె
యేనుగోపాలుడు యెటుల గాయించెనె ॥అగ్గి॥

ప్రజావ్యావహారిక భాషలో ప్రజల పలుకుబడులతో ప్రజావృత్తములను అభివర్ణించు ఇతని పదములు సహృదయ హృదయంగమములు. ప్రజలభాషలో ప్రజాకవిత్వమును వెలయించి ఈ ప్రజాకవి తన పదములలో కొన్నిట చిత్ర కవిత్వము వెలయించి తన ప్రజ్ఞను చాటు కొనినాడు. తన పదములలో రాగముల పేళ్లు, నృత్యస్థానములు, కొమ్మలపేళ్లు, మానులపేళ్లు, ఊళ్లపేళ్లు, ఔషధములపేళ్లు,, ఆభరణముల పేళ్లు చిత్రముగా కూర్చి తన కవితాప్రజ్ఞను వెలయించినాడు. దేశీయము అను విభాగములోని పదములలో చిత్తూరు మండలము పలుకుబళ్లు, అందు ప్రచారములోనున్న సామెతలు మనోహరముగా కూర్చినాడు. ఈ పదములలోని పలుకుబళ్లు సామెతలు సమకూర్చిన చిత్తూరు మండలములోని సామెతలు, పలుకుబళ్లు సమకూర్చినట్లగును.

ఇతని పదములు సులభమై సుగమమై ఉండుటయే గాక అభినయాను కూలముగను ఉండి శృంగారరసమును పుక్కిలించుచు సహృదయాస్వాద్యములై ఉన్నవి. ఇతని పదములు కవితకు, కళలకు, గానమునకు కదలుపరాని కాణాచి. క్షేత్రయ్యకు తరువాత పదకవులలో ఇతనికే అగ్రతాంబూలము.

# 15. సభాపతయ్యగారి పదములు

విద్యానగర వినాశానంతరము ఆంధ్రసామ్రాజ్యలక్ష్మితో పాటు ఆంధ్రకళా సరస్వతి రాజన్వంతయై రాజ్యోపప్లవము లేని దక్షిణదేశమునకు వలస పోయినది. మధుర, తంజావూరు, పుదుక్కోటలలో నెలకొనిన తెలుగునాయకరాజులు తమ ఏలుబడి క్రిందికి వచ్చిన పచ్చనిసీమలలో విద్యావ్యవహార వినోద ముఖ్యతంత్రముల నిర్వహణమునకై తెలుగుదేశమునుండి కవులను, గాయకులను, గాయనులను, అభినేత్రలను, శిల్పకారులను, వ్రాయసగాండ్రను ఇంకను రాజ్యాంగమున కావలసిన ఇతరోద్యోగులను తమవెంట కొనిపోయి వారి కచట మాన్యములు అగ్రహారములు ఒసగి స్థిర స్వాస్థ్యములు కల్పించిరి. ముఖ్యముగా తంజావూరున రఘునాథనాయకుడు అతని కుమారుడు విజయరాఘవనాయకుడు వైష్ణవమతావలంబకులై చోళమండలమున దేవాలయ నిర్మాణములు కావించి పరమభాగమతోత్తములయి ప్రసిద్ధిపడయుట మాత్రమే గాక బ్రహ్మానంద సహోదరమయిన రసానందానుభూతికి రమణీయ సోపానకల్పము లయిన సంగీత సాహిత్యాభినయముల నభిమానించి ఆదరించి తమ ఆస్థానముల కళాక్షేత్రములు కావించిరి. కవితాపట్టభద్రులు, సంగీతసరస్వతులు, అభినయవిద్యావిశారదులు ఎందరో రఘునాథాదుల వితరణము విని సత్కారములు పడయుటకై నాడు తెలుగు దేశమునుండి తంజాపురమున కరుదెంచిరి. రాజసత్కారములు వడసిన తెలుగు కుటుంబము లచటనే నెలకొని రాజాదరమున తమ కులవిద్యల నవలంబించుచు వచ్చినవి. తంజావూరునకు సమీపమున నున్న శూళమంగళము, మెరట్టూరు. మూవనల్లూరు గ్రామములలో నాడు తెలుగు భాగవత కుటుంబము లెన్నో నెలకొనినవి. శూళమంగళము 'కథకళి' సంప్రదాయమునకు, కూచిపూడి భాగవత సంప్రదాయమునకు చెందినదని చెప్పుదురు.

నాయకరాజులు జరిపిన సంగీత నాట్యవినోదముల ధర్మమా! అని ద్రవిడదేశమున సంగీతకళయు, నృత్యకళయు విరివిగా వ్యాప్తిచెందినవి.

నాయకరాజుల కాలమునను వారి తరువాత ఏలుబడి గావించిన మహారాష్ట్రరాజుల కాలమునను విరివిగా ప్రదర్శింపబడుచుండిన యక్షగానములు, వీధి భాగవతుల వలన పదకవిత ప్రజలకు సుపరిచితమయినది. రఘునాథరాయల కాలమున తంజావూరునకు వచ్చియుండి అతని కుమారుడు విజయరాఘవనాయకునిపై వేల కొలదిగ పదములుపాడి, చోళ మండలమును శృంగార రసప్లావితము కావించిన క్షేత్రయ్య మువ్వగోపాల పదముల కానాడు పలుకుబడి హెచ్చినది. ద్రవిడ దేశమున నెలకొనిన తెలుగు కుటుంబములవారు మాత్రమేకాక తెలుగు నేర్వని ద్రవిడ విద్వాంసులు పలువురు క్షేత్రయ్య పదములను సంప్రదాయసిద్ధముగా పాడి అభినయించుటకు ఉత్సాహము చూపుచుండిరి. యక్షగానముల ప్రదర్శించుటయు, క్షేత్రయ్య పదములు పాడుచు సంప్రదాయ సిద్ధముగా అభినయించుటయు కొంతకాలము వరకు సర్వసామాన్యము లయినవి. ఇందుచే ప్రజాసామాన్యములో సంగీతాభిరుచి మెండయి సంగీతమునకు అఖండ గౌరవము లభించినది. నేడు ద్రవిడ దేశమున సంప్రదాయ సిద్ధమయిన కర్ణాటకసంగీతమును పాడగలవారు పలువురుండుటకు నాయకరాజులు సంగీతము నెడ చూపిన ఆదరాభిమానములును; వారి కాలమునను, వారి తరువాతి మహారాష్ట్ర రాజులకాలమునను ప్రదర్శింపబడుచుండిన యక్షగానములు, వీధిభాగవతములును, అభినయ సహితముగా చూపబడుచుండిన క్షేత్రయ్య మువ్వగోపాలపదములును మూలకారణములని చెప్పక తప్పదు.

తంజావూరునకు సమీపమున నెలకొనిన తెలుగు కుటుంబములలో త్యాగయ్య కుటుంబమును, సభాపతయ్య కుటుంబమును ప్రసిద్ధములు. త్యాగయ్య రామభక్తుడై పరమభాగవతోత్తముడై కీర్తనలు రచించి కర్ణాటక సంగీతమునకు ప్రవర్తకుడుకాగా, సభాపతయ్య రాజగోపాలస్వామి భక్తుడై మన్నారుగుడిలో క్షేత్రయ్యపదములను సంప్రదాయసిద్ధముగాపాడి అభినయించుచు తత్సంప్రదాయ ప్రవర్తకుడగుట మాత్రమే గాక స్వయముగా



తన యిష్టదైవమగు రాజగోపాల నామాంకితములుగా క్షేత్రయ్య పదములను పోలిన పదములను రచించి పదరచయితగా పదాభినయ ప్రవర్తకుడుగా ప్రఖ్యాతి గాంచినాడు.

సభాపతయ్య త్యాగయ్యవలెనే ములకనాటి వైదికశాఖకు చెందిన బ్రాహ్మణుడు. తంజావూరునకు సమీపమున ఉన్న మూవనల్లూరను బ్రాహ్మణాగ్రహార మితని స్వగ్రామము. పిదప ఇతడు తత్సమీపముననే ఉన్న ప్రసిద్ధ విష్ణుక్షేత్రమగు మన్నారుగుడి కేతెంచి అందలి రాజగోపాలస్వామి భక్తుడై తన్నామాంకితములుగా కొన్ని శృంగార పదములను విరచించినాడు. వీరి స్వగ్రామము మూవనల్లూరగుటవల్ల మూవనల్లూరు సభాపతయ్య అని, మన్నారు గుడిలో చాలకాలము వసించిన వాడగుటచే రాజమన్నారుగుడి సభాపతయ్య అని వీరు వ్యవహరింపబడుచుండిరి. భరతశాస్త్రమునందు వీరు మహాప్రవీణులయి ఉండినట్లు తెలియుచున్నది. క్షేత్రయ్యపదములను వీరు సంప్రదాయసిద్ధముగా పాడి అభినయించువారట! పదాభినయమే వీరిని పద రచయితగా గూడ జేసి ఉండుననుటలో ఆశ్చర్యము లేదు. క్షేత్రయ్యపదములు వీరికి నిత్యానుసంధానమున నుండి శిక్షాధ్యయనమున ప్రతిదినమును నలగుచుండుట చేత గాబోలు వీరి పదములయందు క్షేత్రయ్యపదములతనము మిక్కిలిగా కానవచ్చుచున్నది. వీరు సుమారు నూరేండ్ల కిటీవల అనగా క్రీ.శ. 1860 సం॥ ప్రాంతమున ఉండినట్లు తెలియుచున్నది. వీరిని గూర్చి ఇతర విశేషము లేవియు తెలియవచ్చుటలేదు. వీరు శృంగారపదములను మాత్రమే గాక 'సీతాస్వయంవరము' ను పాటలలో రచించిరి. చాలకాలమునుండి ద్రవిడ దేశములో నెలకొని ఉండిన తెలుగు కుటుంబమునకు చెందిన వారగుటచే వీరి పదముల యందును త్యాగయ్య కీర్తనలందు వలెనే కొన్ని తమిళపదములు దొరలినవి.

వీరిని గూర్చిన ఇతర విశేషములకై యిటీవల భోగట్టా చేయగా పుదుక్కోట వాస్తవ్యులగు వృద్ధులొకరు వీరిని గూర్చి ఈ క్రింది కథ తెల్పిరి..

" సభాపతయ్యగారు సంగీతాభినయశాస్త్రములలో మహావిద్వాంసులు. వీరు స్త్రీ వేషము వేసి క్షేత్రయపదములను పాడి యభినయించువారు. సహజముగనే సుందరశరీరులయి చక్కని శారీరము గల సభాపతయ్యగారు చీరకట్టి స్త్రీ వేషముతో పదము పాడి యభినయింపగా దానిగాంచిన పలువురు తమ యెదుట నిజముగా నొకకాంతయే యభినయించుచున్నదని భ్రమియించువారట! ఒకప్పుడు శరభోజీ మహారాజు భరతశాస్త్రాభినయములో మేటియయిన వారేది కోరినను వారి యభీష్టము తీర్చి సత్కరించెదనని పలుకగా ననేకులు స్త్రీలు, పురుషులు తమ యభినయము చూపి రాజ సమ్మానము నొందగోరిరట! అపుడు సభాపతయ్య స్త్రీ వేషమున సభారంగమున నిలిచి స్త్రీ వాక్యముగా పదము పాడి నాట్యము సేయగా నచటివారెల్లరు నా నాట్యము చేసినది స్త్రీయే యనుకొనిరట! అంత సభాపతయ్య తన వేషము నూడ్చి నిలుచుండగా రాజుతో సహా నచటి వారెల్లరు నాశ్చర్యము చెందిరి. ఎల్లర నట్లు ఆశ్చర్యపడునట్లు అభినయించిన సభాపతయ్యగారిని భరతశాస్త్రమున గొప్ప ప్రవీణులుగా నిశ్చయించి మహారాజు వారి యభీష్టము తెలిపిన దీర్తునని పలికిరి. సభాపతయ్య యేదో కొంత ధనమునో, లేక మాన్యమునో కోరుకొనునని మహారాజు తలచినాడు. కాని పరమ భాగవతోత్తముఁడయిన సభాపతయ్య రాజాంతఃపురమున ననాదిగా వంశపరంపరానుగతముగా పూజింప బడుచుండిన యొక శ్రీకృష్ణవిగ్రహమును జూపి తాను భక్తితో పూజాదివిధులు నిర్వర్తించుకొనుటకై దానిని తనకు ననుగ్రహింపవలసినదిగా ప్రార్థించిరట! ఈ ప్రార్థనము విని యా సభలో నున్న వారెల్ల తెల్లబోయిరి! మహారాజును నతడట్టి కోరిక కోరునని యెఱుగని వాడగుటచే నిది విని 'ఈ విగ్రహము నేమి చేసికొందురు? మఱేమైన గోరుకొనుడు, మీకు గోరినంత ధన మొసగెదను. అడుగు' డనగా సభాపతయ్య వినయముతో నమస్కరించి 'మహారాజా! ధనము నా కక్కఱలేదు. అది యశాశ్వతము. మీకడనుండి ధనము గొని పోయినచో తత్కారణమున నాకీ యభినయ విద్యపై నాదరము సన్నగిల్లవచ్చును.



శ్రీకృష్ణానుగ్రహమున నా నేర్చిన విద్యను నలుగురికి నేర్పి తన్మూలమున జీవనము గడపుటలోనే నేను పరమానందము ననుభవించుచుందును. మోహవర్ధకములగు నీ యైశ్వర్యములు నాకు వలదు. మీరు దయతో మోహనమూర్తియగు నా కృష్ణవిగ్రహము నొసగినచో దానిని నా దేవతార్చనలో నుంచుకొని ప్రతిదినము పూజించుకొనుచుందును. ఈ నా కోరిక న్యాయసమ్మత మగునేని నన్ననుగ్రహింపుడు'. అనెను. మహారాజు సభాపతయ్య కోరికలోని తీవ్రతను గుర్తించి వంశపరంపరానుగతముగా తమ యంతఃపురము నలంకరించుచుండిన యా శ్రీకృష్ణవిగ్రహమును సభాపతయ్యగారికి బహూకరించి సత్కరించెనట! సభాపతయ్య యా శ్రీకృష్ణ విగ్రహమును ప్రతిదినము భక్తితో నారాధించు చుండువాడట! వారు పూజించుచుండిన యీ శ్రీకృష్ణ విగ్రహము ఇటీవలి వఱకు వారి యింటనే వారి సోదరుని కుమార్తె యధీనమున నుండి రెండుమూడేండ్లకు ముందు ఎనుబదియేండ్ల వయసున నామె పరమపదింపగా నామె యాస్తిపాస్తులతో బాటు ఆ శ్రీకృష్ణ విగ్రహమును కూడ నామె దాయాదులెవరో కొనిపోయిరట"!

'నిధి చాల సుఖమా రాముని సన్నిధి సేవ సుఖమా' అని వితర్కించుకొని రాజసమ్మానము తిరస్కరించిన త్యాగయ్యకు, విద్యకు మెచ్చి విత్తమీయ వచ్చిన మహారాజును నిత్యపూజకై శ్రీకృష్ణ విగ్రహము నభ్యర్థించిన సభాపతయ్యకు– మనస్తత్త్వములలో భేదము లేదు. త్యాగయ్య భక్తిపరవశుడై కీర్తనలు పాడి తన్మయత్వము చెందగా సభాపతయ్య రసపరవశుడయి పదములు పాడి తన్మయత చెందినాడు. ఒక విధముగా చూచిన త్యాగయ్య నాదబ్రహ్మోపాసకుడు. సభాపతయ్య కళోపాసకుడు. బ్రహ్మానందానుభూతిలో త్యాగయ్యకు సంగీతము సాధనముకాగా రసానందానుభూతిలో సభాపతయ్యకు అభినయవిద్య అంగమయినది. భక్తిమార్గమున త్యాగయ్య ఆనందానుభూతి లక్ష్యసిద్ధికై ప్రయత్నింపగా సభాపతయ్య అభినయకళామార్గము చేపట్టినాడు. మార్గములు భిన్నములయినను ఇరువురి లక్ష్యములు ఒకటే!

సభాపతయ్య రచించిన పదములలో దీనిని ఆ వృద్ధుడే పాడగా విని తన్మయత జెందితిని.

**రాగము శంకరాభరణము- మిశ్రము**

**పల్లవి**

**దారి జూచుచున్నది- నీదు ప్రియ**
**తరళాక్షి యీ చిన్నది**

**అనుపల్లవి**

**వారిజ ముఖి నీవు- వచ్చు వేళనుకొని**
**కోరికతో రాజ- గోపాలసామి నీ ॥దారి॥**

**చరణములు**

**వెన్నెల గాయఁగ- వేడ్క మీఱ మంచి**
**సన్నజాజి విరి- సరులును గందము**
**పన్నీరు చెంబులు- పడకటింటిలో నుంచి**
**వన్నెలాడి తల- వాకిట నిలిచి నీ ॥దారి॥**

**ఏ వగనైనను- ఎందు చప్పుడైన**
**నీవో యని యెంచి- నిలిచి తిరిగి చూచి**
**ఈ వగ చిత్తము- నిచట నిలిపినట్టి**
**భావం బెవరికి- బయలుగానీక నీ ॥దారి॥**

**పచ్చి పచ్చిగా- పదములు పాడుచు**
**వచ్చి రాజ- గోపాల సామీ నీవు**
**ముచ్చట లాడుచు- ముద్దులు వెట్టుచు**
**గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి- కూడుట దలఁచి నీ ॥దారి॥**



సభాపతయ్య రాజగోపాల నామాంకితములుగా రచించిన శృంగార పదములు ఏబదిమాత్రము క్రీ.శ. 1884 సం॥ మార్చి నెలలో శ్రీ.అ-స-నృసింహాచార్యుల వారి శ్రీవాణీ నిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినవి. ఇందీ పదములకు శ్రీ న.మా. తిరుపతి వేంకటాచార్యులవారు సంగ్రహించిన ఆంధ్రవాక్య రూపమయిన నాయికానాయకాది లక్షణములును, రసమంజరి ఉదాహరణ శ్లోకములును ఒసగబడి యున్నవి. ఈ పదములను పరిష్కరించి ప్రకటించుటలోను, ప్రతిపదమునకు నాయికా నాయక రసభావాలంకారాది లక్షణములను నిరూపించుటలోను, పరిష్కర్త లెంతగా శ్రమ పడినదియు వారా గ్రంథమునకు తొలుత గావించిన ప్రకటనముల వలన తెలియగలదు.

"ఈ పదములు రాజమన్నారు గుడిలో భరతశాస్త్రము నందు మహాప్రవీణులయి యుండిన సభాపతయ్యా గారిచే గోపాల నామాంకితములుగాను, శృంగారరస ప్రధానములు గాను రచియింప బడినవి.

**శ్లో. సపం కాలి కవే ర్వాణీ హరి నామాంకితా యది।**
**సా వాణీ సఫలా జ్ఞేయా నిష్ఫలాన్య సమాశ్రయా॥**

అనునట్లు ఇవి భగవత్పరములుగ నున్నవి గనుకను,

**శ్లో. రసేషు శృంగార రసం ప్రధానం**
**హరే రధిష్ఠాన మిదం స జానేః**

అనునట్లు భగవత్ప్రీతికరమయిన శృంగార రసాలంబనము మొదలయిన అనేక విషయములను తెలుపుచున్నవి గనుకను, పండితపామర రంజకములయి యుండును. మరియు ధర్మార్థ కామమోక్షములనెడు చతుర్విధపురుషార్థ ప్రదములుగాను ఉండును అని తలంచి భావజ్ఞేతరులకు సయితము విశదపడునట్లు ముందు ఉపోద్ఘాతమును, అవల రాగము, తాళము, పదము, నాయక, నాయకుడు, రసము, సంచారీభావము, అలంకారమును ఒకటివెంబడి నొకటి క్రమముగాను- కడపట రజమంజరీ శ్లోకోదాహరణములను జేసి అతి

ప్రయాసమునకు వెనుదీయక వ్రాసి అచ్చువేయించి ప్రచురించితిమి. ఇందు వ్రాయబడి యుండు లక్షణములు భరతరస ప్రకరణములోని శ్లోకములకు తెలుగు తాత్పర్యము గాని వేరు కాదు- అలంకార లక్షణములను తెలుపునపుడు చంద్రాలోకములోని శ్లోకములను తెలుగుమాటలుగా మార్చి వ్రాసియున్నాము. ఈ లక్షణములను సంస్కృతమునందు చూడవలెనన్న భరతరస ప్రకరణమును, చంద్రాలోకమును చూడవలయును.* క్షేత్రయ్యగారి పదములు మొదలయిన వానిలో లక్షణోక్తము లయిన కొన్ని పదములను సంగ్రహించి యిందలి లక్షణములతోడ కూర్చి ముద్రింప యత్నించియున్నాము."-

మచ్చునకు సభాపతయ్య గారి శృంగారపదము లివి చూడుడు-

**1. రాగము కాంభోజి- మిశ్రము తాళము**

**పల్లవి**

**అన్యాయముగ నే నపదూరు పాలైతి**
**అతివరో యేమందు నే**

**అనుపల్లవి**

**మన్నారు రాజగోపాల సామికి నాకు**
**కద్దని పలికేరు**

**చరణములు**

**ఆ సరసుడు ప్రీతిచేసి పిల్వగను- రోసము చూపితినే**
**మా సీమలో నిది మరియాద కాదని- వేసారి మ్రొక్కితినే**

* శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు ఇటీవల ఆంధ్రగాన కళాపరిషత్తువారి తరపున ప్రకటించిన క్షేత్రయ్య పదములతో జేర్చి ముద్రించిన 'శృంగారరసమంజరి' ని రచించినదియు, క్షేత్రయ్య పదములలో కొన్నిటికి నాయికా, నాయక రసభావాది నిర్ణయము గావించినదియు, ఈ పదములకు వివరణాదికములు వ్రాసి ప్రకటించిన శ్రీ.నీ.మా. తిరువేంకటాచార్యులవారే అని తలపదగియున్నది. వేరువిధమయిన ప్రామాణికాధారములు లభించునంతవరకు ఈ యూహ సరియయినదే అనుటకుపై ప్రకటనములోని వాక్యము యొక్క సాక్ష్యము చాలుననుకొందును.



**దోసమెన్నక పలుకు మోసగత్తెలు గేలి- చేసే రేమందునే**
**ఆస దీర నే ననుభవించక యయ్యయ్యో- నక్కపల్లమన్న**
**సామెత రీతిని ॥అన్యా॥**

**ఆట పాటలకై యాతనితో నేను- మాటలాడి నందుకా**
**బోటుల కెదుట నీ ప్రొద్దు వానింటికి- పోయి వచ్చినందుకా**
**సూటిగాను వాని చూచి నవ్వే యల- వాటు చేసినందుకా**
**ఏటికే యా గేలి యే పాప మెరుగనే- తాటిక్రింద పాలుత్రాగిన**
**చందాన ॥అన్యా॥**

**ఏకమై గోపాలు డెనయ వచ్చెదనంటే- నీ కిది తగదంటినే**
**కోక లెత్తిపట్టి కొంటితనము చూప- రాకు పో పొమ్మంటినే**
**ఈ కారణమేమే యిది తెలియ వట్టి- పోకిళ్లు చేకొంటినే**
**లోకము మూయను మూకుడు గలదటె- చాకివాడు వృథా**
**జానకి నవినట్లు ॥అన్యా॥**

**2. రాగము బిలహరి- తాళము మిశ్రము**

**పల్లవి**

**ఈలాగు పాంథుడవు నీవు ఒంటిగాను**
**ఇప్పుడెచ్చటి కేగేవు వేగను**

**అనుపల్లవి**

**మేలు పయోధరములు చేరి యెదుటను**
**మెఱయగ గోపాల హరి యనుచును**

**చరణములు**

**చంతనుండెడి గుడి చాటు జేరక**
**శ్రమము దీర సుఖమొంద గోరిక**

సుంత యీ తరువున జూచి యయిన నిలువక
ఎంత సుఖము చేయు నీ కొమ్మ యనుకోక ॥ఈలాగు॥

నీవు కట్టుకోక నిటు బాళి యుంచక
నీవేళ భూసుర హితము మాట వినక
త్రోవ నడచుటకు తో డెవ్వరును లేక
ఈ వగ ముందు వెనుక యోచింపక ॥ఈలాగు॥

ఎవ్వరిందురా నెరుగనట్టి తావు
జవ్వని నన్నొక్కతె నిందుగనినావు
అవ్వలనైన నిందు నిలువలేవు
హరిహరి గోపాల యేల భ్రమసేవు ॥ఈలాగు॥

**3. రాగము పంతువరాళి- తాళము ఆది**

**పల్లవి**

రారా విడిదికి నొకసారి– రార చక్రధారీ

**అనుపల్లవి**

శ్రీ రాజగోపాల శౌరీ– చిత్తమునను దయయుంచి మురారి

**చరణములు**

అంగజ జనకా నిను దలచినదే
అటే దేహము పరవశ మయ్యేనిరా
పొంగి గుబ్బలివో పులకరించేనిరా
భోగి శయన మంచి సమయ మిదిరా ॥రారా॥

సోముని గేరు నీ మోము జూచినదే
సొక్కి బాగ ముద్దిడ కోరేనురా



సామి నీవు మాటాడగా నీ
చక్కెర మోవాన పదరేనురా ॥రారా॥

ఆకు మడుపు లియ్యగాను నీ చెయి
సోకినంతనే కోక వదలెరా
ఏకాంతమున నిన్నెనయ గోపాల
జోక తోడ నీ లోకమె మరతురా ॥రారా॥

భరత నాట్యాచార్యుడై సంప్రదాయసిద్ధముగా పదములను పాడి అభినయించి పదకవితకు ప్రాణముపోసి ప్రచారమునకుఁ దెచ్చుటతో పాటు భాగవతులను తన సంగీతాభినయములచే రసానందాను భూతికి తార్చుట మాత్రమే గాక, స్వయముగా పదములను రచించి తరువాతి తరములవారికిగూడ అట్టి రసానందానుభూతి కల్పించి పద రచయితయై ప్రఖ్యాతి గాంచిన సభాపతయ్య తెలుగువారికి చిరస్మరణీయుడు! ఉత్తరాంధ్రమున క్షేత్రయ్య, రాయలసీమలో సారంగపాణి, దక్షిణదేశమున సభాపతయ్య ఆంధ్రసాహిత్య చరిత్రములో పదకవితా శాఖకు ప్రవర్తకులు.

సభాపతయ్యగారి పదములన్నియు పూర్వ వివరణాదికముతో పునర్ముద్రణము పడవలసియున్నవి. వానికి వ్రాయబడిన వివరణము వంటిది క్షేత్రయపదములకును, సారంగపాణి పదములకును కూడ అత్యంతావశ్యకమై ఉన్నది. ఈ పదముల నెల్ల సంగీతవిద్వాంసుల తోడ్పాటుతో చక్కగా పరిష్కరించి వివరణాదికముతో ఒక సంపుటముగా ముద్రించినచో మూడు వందలయేండ్లుగా వర్ధిల్లిన పదకవితాస్వరూపము నొక్కచోట చూడవీలగును. వీనిలో కొన్ని పదములనేని సంప్రదాయసిద్ధముగా పాడువారి తోడ్పాటుతో స్వరపరచి ప్రకటించినచో సంగీత విద్వాంసులు వాని పాడుటకును, పదకవిత బహుళప్రచారము పడయుటకును అత్యంతోపయుక్తము కాగలదు.

## 16. గొబ్బిళ్ల పాటలు

"శామంతికా ప్రగంచిత సీమంతవతీ కుచోష్ణజితశీత భయ శ్రీమంతము హేమంతము"లో తొలినెల మార్గశీర్షము సమోష్ణసమశీత సుభగము. కావుట నది రసిక జన హృదయాభిరామము. భోగినీ భోగరుచిరమును వ్రతాద్యనుష్ఠానముల కీ మాసము మిక్కిలి ప్రశస్తము. అందులకే విష్ణుచిత్త తనయ గోదాదేవి, గోపకన్నియలు మార్గళి మాసమును కొనియాడి యమునానదిలో మార్గళి నీరాట్టమునకు, నోము నోచుటకు తమ చెలులను పిలుచునటుల సాయించినారు. చూడుడు.

**"మార్గళ్ళి త్తిజ్గళ్ మది నిఱైన్ద నన్నాళార్**
**నీరాడ ప్పోదువీర్ పోదుమినో నేరిళ్ళై యీర్**
**శీర్‌మల్‌కు మాయ్‌ప్పాడి శెల్వచ్చిఱుమీర్ కాళ్**
**కూర్వేల్ కొడున్దొళ్ళి లన్ నన్దకోపన్ కుమరన్**
**ఏరార్ న్దకణ్ణి యశోదై యిళ శ్శిఙ్గమ్**
**కార్‌మేనిచ్చెజ్గళ్ కదిర్ మదియప్పోల్ ముకత్తాన్**
**నారాయణనే నమక్కే పఱై తరువాన్**
**పారోర్ పుగళ్ళప్పడి న్దేలో రెమ్బావాయ్"**

భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానులు మార్గశీర్షమును తమ దివ్యవిభూతిగా పేర్కొనిరి.

**"బృహత్సామ తథా సామ్నాం, గాయత్రీ ఛన్దసా మహమ్,,**
**మాసానాం మార్గశీర్షో౽హమ్ ఋతూనాం కుసుమాకరః"**

అధ్యా 10–శ్లో 35

మార్గశీర్షమిట్లు మహనీయముగా పేర్కొనబడుటకు సముచిత కారణము లేకపోలేదు. ఈ మాసములో తక్కిన అన్ని మాసముల యందు కంటె సూర్యుడు భూమండలమున కత్యంత సన్నిహితుడుగా ఉండును. బాహిరముగా ప్రపంచమున గోచరమగు నిట్టి సన్నివేశమే మానవశరీరమందును ఈ మాసమున సంభవమగును. ఈ మాసముననే జీవకిరణము సహస్రారమునుండి వెన్నెముక మూలమున పురుష శరీరమున ప్రవేశించును. ధనుర్మాసములో పురుష శరీరమున ప్రవేశించిన జీవాత్మ వసంతములో వనితాగర్భమును జొచ్చును.

ఈ కాలమున శరవేధ తీవ్రముగా జరగుట సంభవము కావుననే ప్రాతః కాలములందు ఆహారపరిగ్రహము ఆచారమయినది. ఉప్పుపొంగిళ్లు పొంగించుకొని దేవతానివేదనము కావించి ప్రాతఃకాలములందు ప్రసాదముగా స్వీకరించుట నేటికిని కొనసాగుచున్నది.

ఈ మాసములో కన్నెపడుచులు ముంగిళ్లలో ముగ్గులు తీర్చి గొబ్బిళ్లు పెట్టి గొబ్బితట్టుదురు. గొబ్బిళ్ల దేవతను ఆరాధించుట, గొబ్బితట్టుచు గొబ్బిపాటలు పాడుట అనాది ఆచారముగా కనబడుచున్నది. మార్గశీర్షములో గొబ్బిళ్లదేవత నారాధించు సంప్రదాయమును మనవారు భాగవతమునుండి యలవరచుకొనినదని తెలియుచున్నది. గోపకుమారికలు హేమంతమున మొదలినెల తొలిదినము నందు కాళింది కేగి కాత్యాయని నారాధించినటుల భాగవతమున పేర్కొనబడినది చూడుడు–

"ఇట్టి నితాంతంబగు హేమంతమున మొదలినెల తొలిదినంబునందు నందుని మందంగల గోపకుమారికలు రేపకడ లేచి చని కాళిందీ జలంబులం దోగి జలతీరంబున నిసుమునం కాత్యాయనీ రూపంబు జేసి సురభి కుసుమగంధంబు లిడి ధూపదీపంబు లిచ్చి బహువిధోపహారంబులు సమర్పించి,

**ఓ కాత్యాయని! భగవతి!**
**నీకును మ్రొక్కెదము మేము నే దనుకంపన్**
**మా కందఱకును వైళమ**
**శ్రీకృష్ణుడు మగడు గాగ జేయుము తల్లీ!**

**ఓ తల్లి! మాకు గృష్ణుడు**
**చేతో విభుడైననాడు చెలువల మెల్లన్**
**నేతి వసంతము లాడుచు**
**జాతర చేసెదము భక్తిచాతురి తోడన్.**

అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు నివ్విధంబున మాసవ్రతంబు సలిపి రందొక్కనాడు–

**'రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ రండంచు నాత్మీయనా**
**మములం జీరి కుచద్వయీ భరములన్ మద్యంబు లల్లాడగా**
**భ్రమదోద్దామ గజేంద్రయాన లగుచున్ బద్మాక్షునిన్ బాడుచున్**
**యమునాతీరము జేరబోయిరి గృహీతాన్యోన్యహస్తాబ్జలై**

ఇట్లా నదీతీరంబు చేరంజని గజగమనలు విజనప్రదేశంబున వలువలు విడిచి మదిశంక లేక యకలంకలై క్రుంకులిడ జలంబు సొచ్చి

**వారిజలోచను బాడుచు**
**వారిజలోచనలు వారివారికి వేడ్కన్**
**వారి విహారము సలిపిరి**
**వారి విహారములు జగతి వారికి గలవే".**

**భాగ. దశమస్కంధము.**

భాగవతములో గోపకుమారికలు శ్రీకృష్ణుడు మగడుగాగపడయుటకు కావించిన మార్గశీర్షవ్రతమే తరువాతి కాలములో కన్నెపిల్లల గొబ్బిళ్ల ఆరాధనమయినది. అందుకే గొబ్బిదేవరకు 'భాగవత గొబ్బి' అని పేరు. 'గోపి' కలు ఆరాధించిన దైవము గనుకనే ఆమె గోపిదేవర– గొబ్బి దేవరఅని పేర్కొనబడియుండును. తమిళమున నీమె 'కొప్పి' అని పిలువబడుచున్నది. గోపికలు యమునాతీరము జేరబోవుచు 'భ్రమదోద్దామ గజయాన లగుచున్ పద్మాక్షునిన్ బాడు' టయే గొబ్బిపాటలు పాడుచు గొబ్బితట్టుట అను సంప్రదాయములుగా పరిణమించినవి.



ఈ గొబ్బిపాటలు క్రీస్తుశకము పంద్రెండవ శతాబ్ది నాటికే తెలుగునాట బహుళప్రచారము పడసియున్నట్లు తెలియవచ్చుచున్నది. పాలకురికి సోమనాథుడు తన పండితారాధ్యచరిత్రములో ఈ గొబ్బిపాటలను పేర్కొనినాడు. ఈ గొబ్బిపాటలను వీనుల గేలు సేర్చి అనేకులు కూడి పాడుచుండెడి వారట! ఆ పాడుటలో గూడ పలుతెరగులు కలవట!

**'చెలగి వీనుల గేలుసేర్చి గొబ్బిళ్ల**
**బలుతెఱంగుల గూడి పాడెడువారి'** అని అష్టమహిషీకల్యాణంలో పేర్కొనబడింది.

కన్నెపడుచులు ప్రాతఃకాలమునందే లేచి ముంగిళ్లనలికి ముగ్గులుపెట్టి ఆ ముగ్గులలో గొబ్బిళ్లు పెట్టుదురు. గోమయమును ముద్దలు ముద్దలుగా జేసి దానిపై గుమ్మడి పూవుల బెట్టి రంగవల్లుల నలంకరింతురు. మురువు లొలుకుచున్న ఆ ముగ్గులలో పసుపురంగు గుమ్మడిపూవుల నలంకరించుకొన్న గొబ్బిళ్లు గృహసౌభాగ్యము నినుమడింపజేయును. గొబ్బిళ్లదేవత అలంకరించుకొన్న గుమ్మడిపూవు మహాకవి శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారి కవితలో జిలుగువెలుగులు సంతరించుకొనినది చూడుడు–

**గొబ్బిళ్లదేవత కొప్పులో జెఱివిన**
**మగని మక్కువపైడి మొగలికచ్చు**
**పాదులపెట్టిన పాటి దిబ్బకడుపు**
**ప్రత్యక్షమైన గారాలకూచి**
**మదనేష్టి కృతికి దుమ్మెద సోమపీథికై**
**యవనికి దిగివచ్చినట్టి రంభ**

**దానార్థ వినియోగతా పుణ్యజన్మమౌ**
**గర్భమ్మునోముల గౌరుదేవి**
**మొదలి స్త్రీజాతి కొప్పున ముడుచుకొన్న**
**ప్రసవసంతానములలోని ప్రథమభూష**
**మదురు గుమ్మడిపూవు హేమంతలక్ష్మి**
**పసుపు రాచిన మొగము నా బరిఢవిల్లె**

**-ఋతుసంహారము.**

పిదప ఈ గొబ్బిళ్లకు చలిదియన్నమును నైవేద్యము పెట్టుదురు. అందులకే ఈమెను 'సద్దికూటి గౌరుదేవమ్మ' అందురు. కన్నెపిల్లలు ఆరాధించు దైవమే కాన ఈమెకు పర్యుషిత నివేదనము దోషముకాదు. ఆ తరువాత కన్నెపడుచులు చక్కని పాటలు పాడుచు గొబ్బిళ్ల చుట్టును తిరిగి గొబ్బి తట్టుదురు. ఒక గొబ్బిపాట–

**చందమామ చందమామ ఓ చందమామ**
**చందమామ పిల్లలే నీలగిరికన్నెల్లు**
**నీలగిరి కన్నెలకు నిత్య మల్లెతోట**
**నిత్యమల్లె తోటలో మంచినీళ్లబావి**
**మంచినీళ్ల బావికి బంగారుగిలక**
**బంగారు గిలకకు వెండి చేంత్రాడు**
**వెండి చేంత్రాడుకు గిలకల్ల చెంబు**
**గిలకల్ల చెంబేసి బుడిగిబుడిగి ముంచ**
**బుడిగిబుడిగి ముంచంగానె జీడిగింజ చిట్లె**
**జీడిగింజ చిట్లంగానె నాకు బొమ్మ చిక్కె**
**ఆ బొమ్మ పేరేమి రఘురామసీత**



**జత్తుజత్తు జుత్తులో జారుబావిళ్లు**
**నడచేటి కాళ్ళకు నాగుకడియాలు**
**ఉరిచేటి చేతులకు ఉస్తికంకణాలు**
**అత్తగా రిచ్చింది అల్లంబెల్లం చీర**
**మామగా రిచ్చింది మల్లెమొగ్గల చీర**
**ఆ చీర కట్టుకొని ఆట్లాడబోయె**
**గొబ్బెమ్మా గొబ్బెమ్మా మమ్ముకాయి గొబ్బెమ్మా**

ఏనుగులు గిరులపై గోరాడుట గొబ్బిళ్లు తట్టుటవలె ఉండినదని పోతన వర్ణించినాడు. చూడుడు–

**కలభంబున్ సెరలాడు బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్**
**ఫలభూజంబులు రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచున్**
**బులులన్ గారెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచున్**
**గొలకుల్ సొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్లు గోరాడుచున్**

**భాగ-8-35**

ఏనుగులు తొండములతో నేలపై నున్న దుమ్మెత్తి ఆకసం మీదికి చల్లుట కన్నెలు క్రిందికి వంగి చేతులు వ్రాల్చి గొబ్బిళ్లు తట్టి మీదికి చేతులెత్తుటవలె ఉండినదని భావము.

ఇట్లు మార్గశీర్షము తొలిదినము నుండి భోగి వరకు నాడు నాడు పెట్టిన గొబ్బిళ్లను పిడుకలు తట్టి వాని నన్నిటిని నొకమూలగా గ్రుచ్చియుంతురు. దీనికి 'భోగిపిడుకలు' అని పేరు. భోగినాడు క్రొత్త కుండలలో క్రొత్తగా పండిన వరిబియ్యమును పొంగళ్లు పొంగించుటకు ఈ పిడుకలనే ఉపయోగింతురు. గ్రామములో గొబ్బికి నివేదనము గావించుటకు కావలసిన క్రొత్తకుండలను కుమ్మరి ప్రతిసంవత్సరమును చేసి ఇచ్చుట వాడుక. కుమ్మరి గొబ్బికిగా గ్రొత్త కుండలిచ్చు వాడుక 'హంసవింశతి' లో పేర్కొనబడినది–

**దేవకార్యములకు దిరునాళ్లకును మహో**
**త్సవములకును గంగజాతరలకు**
**సంప్రోక్షణములకు జన్నములకు బెండ్లి**
**వడుగు నోములకును వ్రతములకును**
**సత్రంబులకు సహస్రంబులకును సమా**
**రాధనపితృకార్య యూధములకు**
**బందుగులకు నాలపంబులకును బొంగ**
**లికిని దేవలకు గొబ్బికిని నడరు**
**జంగమార్చనలకు బాలదాసభోజ**
**నములకును దండువెట్టికి నగరివారి**
**కొండబిక్కలకును భిక్షుకులకు నైన**
**గొఅత వడకుండ గుండలా కుమ్మరిచ్చు.** హంసవింశతి

ప్రఖ్యాత సంకీర్తనాచార్యులగు తాళ్లపాకవారి రచనములలో ఈ గొబ్బిళ్లపాటలు అనేకములు కలవు. వారు అల్లోనేరేళ్లు, గొబ్బిళ్లు, సువీసువ్వాలలు, జోలలు, ఏలలు, కూగూగులు మొదలగు దేశిరచనా ప్రభేదముల నెన్నిటినో విరచించిరి. అల్లోనేరేళ్లు, గొబ్బిళ్లు అను ఈ దేశిరచనల తుదల పేర్కొనబడు అల్లోనేరేళ్లు గొబ్బిళ్లు అనునవి కొంతకాలమునకు దమ అర్థములను కోల్పోయి నమస్కార పర్యాయ వాచకము లయినవి. చూదుదు–

**మాయాస్థలిలో మధుసూదనునకు**
**నిరతం బల్లో నేరేళ్లను కొని**
**కాశస్థలి భోగశయానునకును**
**నమరగ నూర్ధ్వశయంబు జొనుపుచును**
**దలప నవంతీస్థలిలో నవనీ**



**పతిదేవునకును బ్రాంజలు లిడుచును**
**ద్వారవతీయాదవకుల భర్తకు**
**దాళహస్తములు దప్పక కొట్టుచు**
**వజ్రపురిని దావలమై చిక్కిన**
**గోపప్రియునకు గొబ్బిళ్లనుచును–**

అల్లోనేరేళ్లు, గొబ్బిళ్లు అనునవి ప్రాంజలులు, తాళహస్తములు అనువానితో బాటు నమస్కార పర్యాయ వాచకములుగా ఇందు పేర్కొనబడినను ఆ చరణములనే పాటగా చదివిన యెడల అవి అల్లోనేరేళ్లు, గొబ్బిళ్లు అను దేశిరచనల తునుకలుగా మనము గుర్తింపగలము. చూదుదు–

**"మాయాస్థలిలో మధుసూదనునకు**
**నిరతంబల్లో నేరేళ్లు–"**

ఇది అల్లోనేరేళ్లను దేశిరచనపుదునుక–

**"వజ్రపురిని దావలమై చిక్కిన**
**గోపప్రియునకు గొబ్బిళ్లు–"**

ఇది గొబ్బిళ్ల పదము తునుక–

ఈ అల్లోనేరేళ్లు, గొబ్బిళ్లు క్రమముగా తమ తమ తనములను కోలుపోయి నమస్కార పర్యాయ వాచకములుగా రూఢము లయినవి.

పూర్వకాలములో వివాహము కాని కన్నెలు ఈ గొబ్బిళ్ల పాటలను తప్పక నేర్చెడివారు. వారు నేర్చియుండవలసిన వానిలో గొబ్బిళ్ల పాటలును ఒకటి–

**"బెళుకు నందములు గొబ్బిళ్లపాటలు కొప్పు**

**సరించు నేర్పు చేసన్నవగలు'–** వారికి కరతలామలకములు. ఈ గొబ్బిళ్లు కన్నెలు మాత్రమే జరుపుకొను వేడుక కాదు. బాలురును ఈ క్రీడావిశేషమున

పాలుకొనుచుండిరి. రామకృష్ణులు గొబ్బిళ్ల నాడుచుండినటుల విష్ణుపురాణమున పేర్కొనబడినది. బాలికలు సమర్తాడినపుడును గొబ్బిళ్లు తట్టి వేడుక జరుపుదురు.

నెల్లూరు మండలమునందును, రాయలసీమలోను గొబ్బిదేవి ఆరాధనమునకు సంబంధించిన ఒక ఆచారము వాడుకలో నున్నది. దానిగూర్చి ఒక వింత కథయు చెప్పుదురు–

గొబ్బిదేవి కాటమరాజుగారి ఇంటి ఆడుపడుచట! అత్తవారింటనున్న తన సోదరికి గొంత భూమి ఈయవలయునని కాటమరాజు తలచుచుండినాడు. అందుకై కొంత భూమిని ఆమె కోసమే ప్రత్యేకించినాడు. కాని పాపము! అది ఆమె కీయకయె అతడు చనిపోయినాడు. ఇది యెరిగిన గొబ్బిదేవి తన సోదరుని కోరిక నెరవేర్చుటకై ప్రతి సంవత్సరమును తనకై తన సోదరుడీయ దలచిన ఆ బీడున వెలసి పుట్టింటి వారొసగిన విందు గుడుపుల నారగించి తిరిగి అత్తవారింటికి పోవును.

గ్రామములో నేటికిని 'కాటమరాజుబీడు' లని కొంత ప్రదేశము ప్రత్యేకింపబడియుండును. ఆ ప్రదేశములలో ఎవరయినను పంటలు పండించుకొనవచ్చును. అందులకు సుంకముగాని, కౌలుగాని ఎవరికి ఈయ నక్కరలేదు. కాని సంక్రాంతి పండుగ నాటి కా బీడులోని పైరు కోతలు ముగిసి ఆ బీడు పరిశుభ్రముగా ఉండవలయును. అందుకొంత ప్రదేశములో ఒక బొమ్మరిల్లుగట్టి అందు మట్టితో కాటమరాజు, గొబ్బి విగ్రహముల జేసి ఉంతురు. ఆ మూడు దినములును తొలుత గొబ్బికి పొంగళ్లు నైవేద్యము పెట్టి పిదప కాటమరాజునకు నైవేద్యము పెట్టుదురు. తన సోదరి గొబ్బి భుజించిన పిదప గాని కాటమరాజు భుజింపడట! పిదప ఆ నివేదనము చేసిన పొంగిళ్లను 'పొంగలో పొంగలి' అని కేకలు వేయుచు ఆ బీటిలోనికి తెచ్చియున్న పశువులకు చల్లుదురు.



ఇది కట్టుకథయే కావచ్చును. కాని ఈ సంప్రదాయము మాత్రము నేటికిని కొనసాగుచునే ఉన్నది. దానిని మనము కాదనలేము. 'పశువుల పండుగ' జరుపుకొను రైతుప్రజానీకమునకు గొప్ప పశుసంపదతో రాజ్య మేలిన కాటమరాజు ఆరాధ్యుడగుట వింతకాదు. ఈ యింట పుట్టిన ఆడుపడుచులను పుట్టింటికి బిలుచుకొని వచ్చి ఆదరించుటయు మనకు గ్రొత్తకాదు. తెలుగునాటిలో నున్న యీ ఆచారములకు పూర్వులెవ్వరో ఈ కథలో ఒక సంగతి కుదిర్చి గొబ్బిదేవిని కాటమరాజుకు సోదరి అని చెప్పి గొబ్బి ఆరాధనమును దేశీయము చేసిరి. ఇందుచే గొబ్బిదేవికి ప్రజాసామాన్యములో ఒక విశిష్టస్థానము లభించినది. ఈ కథకు సంబంధించినదయి సంప్రదాయము లోకములో రూఢమయిపోయినది. భోగి, సంక్రాంతి, కనుము– ఈ మూడు దినములు ముచ్చటగా గొబ్బికి పూజలు, పురస్కారములు, విందు గుడుపులు జరిగించి పులగములు పొంగిళ్లు పెట్టి తరువాతి దినమున నదీతీరములకు గాని, చెరువుగట్లకు గాని గొబ్బిదేవరను గొనిపోయి గొబ్బిళ్లు తట్టి, పాటలుపాడి, నీళ్ళలో ఓలలాడింతురు. గొబ్బిదేవిని జలములో గలిపి పిదప:–

**నిన్న వుండిన గొబ్బెమ్మా**
**నీళ్లలోకి పోతివా**
**మొన్న వుండిన గొబ్బెమ్మా**
**మడుగులోకి పోతివా**
**రాత్రి వుండిన గొబ్బెమ్మా**
**రాళ్లల్లోకి పోతివా**

అని పాటలుపాడి నోము ముగించుకొని గొబ్బిని అత్తవారింటికి పంపి ఇండ్లకువత్తురు. గొబ్బిమేలుకొలుపులు, పవళింపు పాటలు, వాలాడింపు పాటలు, స్త్రీలు పలువిధములుగా ఆయా సమయ విశేషముల యందు పాడుదురు.

అతిప్రాచీనములగు ఈ ఆచారములను ప్రజలు పాటించి ఆదరించుచుండుటచే ఇవి మొన్నమొన్నటిదాక విస్మృతిపథములుగానే నిలిచి

ఉండినవి. గ్రామీణులయినను వీనిని గొంతకు గొంత పాటించుచుండుటచేతనే ప్రాచీనాంధ్ర జాతీయజీవనమును నేటి కూహింపనైన ఊహింపగలుగు చున్నాము. ఉత్తమజాతీయ సారస్వత నవనీతమును మనము మన జాతీయ జీవనక్షీరమునుండియే పొందగలము. జాతీయసారస్వత లబ్ధి కయినను మనము మన పూర్వాంధ్ర జాతీయజీవన దర్శనము చేయవలసియున్నది. పాశ్చాత్యవిజ్ఞాన వేషభాషాభిరుచిచే మన జాతీయజీవనము చాలా దెబ్బతినినది. నవ్యాంధ్రసాహిత్యాచార్యులు శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు అందుకై పరితపించుచున్నారు.

**బువ్వమ్ము బంతుల గల్పించి వయసుకా**
**వర ముబ్బ పడుచులు పాడలేరు**
**గొబ్బి తట్టెడువేళ గూడ గన్నెనెలంత**
**లరమర లేకాడ మఱచినారు**
**తద్దె పండుగల సైత ముయాల లూగుట**
**మోటుగా మగువలు మోసినారు.**
**రుక్మిణి మొదలుగా రుచిగొన్న బొమ్మల**
**పెండ్లిండ్లు బాలలు విడిచినారు**
**ఏ నిరపరాధ మగు క్రీడ లింతవఱకు**
**జాతి ముఖకళ లనదగు చానలందు**
**పెంచె సౌందర్య సుఖరుచి సంచయమ్ము**
**'నా శుభము లస్తమించెడు' నరయరేమొ!**

'ఆ శుభము' లస్తమింపకుండ నిలుపుకొనవలసిన బాధ్యత మనపై ఉన్నది.

* * * *